
అందమైన కళ్ళే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని. మీ డాక్టర్‌ను సంప్రదించండి. సకాలంలో టీకా వేయించుకోండి. ధర అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్: 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™- B
r-DNA Hepatitis-B vaccine

# ఇదీ సంగతులు

51



హాసం
హాస్య-సంగీత పత్రిక

**Also available on net:**
**www.haasam.com**




ముఖచిత్రం
'పిడే' లో
ఆర్తి అగర్వాల్

## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల పుస్తకం



## సంగీతం



పాటల ప్రత్యేకం



71,72, 73,74 పేజీల్లో

# ప్రియ జనవాక్యం



గౌరవనీయులైన ఎడిటర్ గారికి నేను వ్రాసే ఈ ఉత్తరం పూర్తిగా చదవండి. నేను నడవలేను. పూర్తిగా మంచం మీదే ఉంటాను. నేను పుట్టినప్పుడు నాకు సెలబ్రమ్ పాలసీ అనే వ్యాధి వచ్చింది. కానీ దేవుని దయ వల్ల మాట, జ్ఞానం, చదువు అన్నీ ఉన్నాయి - నడక తప్ప! నాకు పుస్తకాలంటే ప్రాణం. అది నా స్కాలర్‌షిప్. నాన్న గారు ఉన్నప్పుడు నాకు ఎటువంటి ఇబ్బంది ఉండేది కాదు 1998లో నాన్నగారు పోయారు. అప్పటి నుండి ఆర్థికస్థితి బాగా దిగజారిపోయింది. అందుకే 'హాసం' కొనడానికి కూడా ఎంతో ఇబ్బంది పడుతున్నాను. అదే విషయం ఉత్తరంలో వ్రాసాను. అది చదివి పింగళి శ్రీనివాసరావు గారు సబ్‌స్క్రైబ్ చేయడానికి ముందుకు వచ్చారు. నాకు చాలా సంతోషం కలిగింది.అందుకు ఆయనకి నా ధన్యవాదాలు చెప్పండి. 'హాసం'పత్రిక నాకు అందితే చాలు. అంతకన్నా నాకు ఏమీ అవసరం లేదు. నాకు బాలసుబ్రహ్మణ్యంగారంటే చాలా ఇష్టం. ఆయన పుట్టిన రోజు జూన్ 4 అని గుర్తుంది. నాకు ఆయన ఫ్యామిలీ ఫోటో కావాలి. నా పరిస్థితి ఆయనకు చెప్పి ఆయన ఫ్యామిలీ ఫోటో నాకు ఇప్పిస్తారని ఆశిస్తున్నాను. ఈ ఉత్తరం కూడా నేను వ్రాయలేదు. నేను చెబితే ఒకరు వ్రాస్తారు. నా పరిస్థితి అర్థం చేసుకున్నందుకు థాంక్స్.

- సి.బి.యస్.మాధవి, చీరాల

**1-15** అక్టోబరు 'హాసం'లో మా అభిమాన గాయకుడు 'గజల్ శ్రీనివాస్ గారి పరిచయం మాకెంతో నచ్చింది. ఆయన చెప్పిన మాట ఆణిముత్యంలాంటిది. 'ఆకలి మనిషికి ఎంత అవసరమో, ఓదార్పు అంతే అవసరం'. శ్రీనివాస్ గారి వీడియో ఆల్బమ్ త్వరలో విడుదల కావాలని కోరుకుంటున్నాం. ఈ పక్షం చిలిపి కవిత తెలికిచర్ల రామకృష్ణ గారు చక్కగా అందజేసారు.

**-ఉమామోహన్, పుంగనూరు.**

16-31 అక్టోబరు 'హాసం' సంచికలో పలు ఆసక్తిదాయక అంశాలు నన్నెంతగానో ఆకట్టుకున్నాయి. ముఖ్యంగా కొమ్మకొమ్మకో సన్నాయి శీర్షికన సంగీత సామ్రాట్ రసాలూరు రాజేశ్వరరావు వర్ధంతి వ్యాసం, ఆయనలోని సంగీత సరస్వతికి అద్దం పట్టేదిగా ఉంది. ఆ పాత మధురం ఎస్.డి.బర్మన్ సంగీతం చాలా ఆసక్తిదాయకంగా వుంది. పి.బి.శ్రీనివాస్ కలం నుండి సీరియల్‌గా వెలుగుచూస్తొన్న లతా పూర్వపు విశేషాలు, పాత పాటలు, కథా సంగ్రహం, విశేషాలు అందిస్తున్నందుకు హాట్సాఫ్.

**-ఎన్.సారంగపాణి, అనంతపురం.**

'హాసం' ద్వారా పొగొట్టుకున్న దాన్ని పొందిన అనుభూతి లభిస్తోంది. 'హాసం' (మన) కుటుంబసభ్యులందరికీ ప్రతి పక్షం అందించే ఆనందాల పసందు. మీరు అందిస్తున్న పాత పాటలు ఒక డైరీలో రాసుకుని భద్ర పరుచుకుని తీరిక సమయాలలో కూనిరాగాలు తీసి మనసు బరువు తగ్గించుకుంటున్నాను. అంతే కాదు రేడియో ద్వారా విని శబ్ద దోషాలతో పాడుకునే వారం. ఇప్పుడు పాటలు తప్పులు లేకుండా పాడి ఎక్కువ ఆనందాన్ని పొందుతున్నాము. ఆపాత మధురం, అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం శీర్షికలు నన్నెంతగానో ఆకట్టుకున్నాయి.

**-చింతలపాటి శారదా శైలూషా, రామగుండం.**

నేను 'హాసం' అభిమానిని. గత సంవత్సరం నుండి కొన్ని సంచికలు తప్ప అన్నీ వదలకుండా చదువుతున్నాను. ఆ కొన్ని సంచికలు ఎలా మిస్సయ్యానంటే మా వూర్లో అవి రెగ్యులర్‌గా రాకపోవడమే. అయినప్పటికీ కొన్ని సంచికలు మాకు 30 కి.మీ. దూరంలో వున్న నిజామాబాద్‌కు వెళ్లి తెచ్చుకుంటున్నాను. ఏమైతేనేం 'హాసం' చదవగానే పడిన శ్రమ అంతా మరిచిపోతున్నాను. పాఠకాభిమానులను అంతగా మరిపించేది, మురిపించేది 'హాసం' ఒక్కటే. 'హాసం' పత్రిక చదివి పారేసేది కాదు.కలకాలం దాచుకొనదగినది. నేనుపాత సంచికలు తిరగేస్తున్న సమయంలో ఒక పొరపాటు కనపడింది. 1-15 జులై 2003 సంచికలో 35 వ పేజిలో మణిశర్మ సినిమాల ఆల్బమ్‌లో 'యువరాజు' ప్రచురింపబడింది. కానీ యువరాజు సినిమాకి సంగీతం రమణగోగుల కదా!

**-కొండపల్లి గంగయ్య, లంగ్డాపూర్.**

**(మీరు చెప్పింది కరక్టే -ఎడిటర్)**

1-15 అక్టోబరు హాసం సంచిక క్విజ్‌ఫలితాల వెల్లడిలో నా ఫోటో ప్రచురించినందుకు నా ధన్యవాదములు. కొనరాజు సినీ గీతాలు డబుల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్స్‌ను రిసీవ్ చేసుకున్నాను. చాలా సంతోషంగా ఉంది. మీకునా హృదయ పూర్వక కృతజ్ఞతలు. 'హాసం'లో పాత, కొత్త సినిమా పాటలకు శ్రీకారం చుట్టి వాటిని ప్రచురిస్తూ ప్రతివారికి మనో ఉల్లాసాన్ని కల్గిస్తున్నారు.

**-సి. రంగనాయకులు, మార్కాపురం.**

పజిల్స్ నింపి పంపడమన్నా, క్విజ్‌లలో పాల్గొనడమన్నా ఎంతో ఆసక్తి నాకు. ఎన్నో పత్రికలలో బహుమతులు వచ్చాయని నా పేరు ప్రకటించడం వాటికోసం చకోర పక్షిలా నెలలూ, సంవత్సరాలు ఎదురు చూసిన రోజులు ఉన్నాయి, కానీ బహుమతులు మాత్రం అందుకున్న పాపాన పోలేదు. హాసం 16-31 సంచికలో సరిగపదమని-3 విజేతగా ఎంపికైన నాకు పత్రిక విడుదలైన రెండురోజులకే కొరియర్‌లో బహుమతి అందుకున్న నేను ఎంతగానో సంతోషించాను. 'బెస్ట్ పెయిర్ ఘంటసాల-లీల గార్లు పాడిన ఆడియో సి.డి పాటలు మదిని దోచుకున్నాయి. బహుమతిని పంపినందుకు మీకు నా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

**-యు.విజయశేఖర్‌రెడ్డి, హైదరాబాద్**

మా మిత్రుని వద్ద 'హాసం' చదివాను. మది పులకరించింది. చెప్పలేని అనుభూతిని పొందాను. ఇంత గొప్ప పత్రికను ఇన్నాళ్లూ మిస్ అయినందుకు చింతించాను. శ్రీ పింగళి శ్రీనివాస్ గారు మీకు రాసిన లేఖ ద్వారా 'హాసం' అభిమానులు అందరూ హృదయం గల కళాకారులే అని తెలియజేశారు.

**-వి.రాజేశ్వర్, ఆసీఫాబాద్, ఆదిలాబాద్.**

2003 అక్టోబర్ రెండవపక్షం సంచికలో మీ సంపాదకీయం చదివి స్పందించి, నేను సంగీత శిక్షణా తరగతుల ద్వారా ప్రోగ్రాముల ద్వారా సంపాదించే డబ్బులో కొంత భాగం కేటాయించి ప్రతీనెలా 10 హాసం సంచికలు ఔత్సాహికులైన సంగీత పిపాసులకు ఉచితంగా అందించాలనే నిర్ణయం తీసుకున్నాను. సృజనాత్మక పంథాలో సంగీత కారుల కరదీపికగా వెలుగుతున్న హాసాన్ని అపూర్వ రీతిలో నడుపుతున్న మీ శ్రమకు నా స్వరాంజలులు. మీ స్వర యజ్ఞంలో నన్నూ భాగస్వామిని చేయగోరతాను.

**-దేశపతి శ్రీనివాస శర్మ, ఎం.ఏ.బి.యిడి,**

**స్వరసాధన సంగీత విద్యాలయం, సిద్ధిపేట.**

'హాసం' పత్రికను నేను ఫిబ్రవరి 2002 నుండి చదువుతున్నాను. చిత్తరంజన్‌గారి లలిత సంగీతం, సరిగపదమని వచ్చే సంచికకోసం ఎదురు చూచేలా చేస్తున్నాయి. మీరు ప్రచురించే పాత అరుదైన పాటలు నాలాంటి గాయని, గాయకులకు ఎంతో ఉపకరిస్తున్నాయి. ఇప్పటి పరభాషా గాయకుల పాటలు విని వ్రాసుకోవడం కూడా కుదరటం లేదు. మీరు సెంటర్ స్ప్రెడ్‌లో ఇచ్చే కొత్త సినిమా పాటలు ఆర్కెస్ట్రాలో పాడుకోవడానికి బుక్‌లా తయారు చేసుకున్నాం. మీకు మా కృతజ్ఞతలు.

**- బి. ఝాన్సీలక్ష్మి (సింగర్), శ్రీరంగపట్నం.**

బాపుగారి విశ్వరూపం ప్రతివక్షం దర్శిస్తున్నాను. ఆస(శ)క్తి వుండాలే గాని బాపు బొమ్మల మీద పి.హెచ్.డి. చెయ్యొచ్చు - హాయిగా నవ్వుకుంటూ! మనిషన్నవాడు, మనసున్నవాడు, బాపు బొమ్మలు చూశాక ఆయన వేళ్లకి దండం పెట్టి తీరాలి! అందుకే! బాపుగారికో దండం! ఆయన చేతి వేళ్ళకి కోటి దండాలు! ప్రచురిస్తున్న మీకు పూల దండలతో అరదండాలు!

**- రాఘవేంద్ర శ్రీనివాస్, మచిలీపట్నం.**

సంపుటి: 3 సంచిక: 3

**1-15 నవంబరు 2003**

**పేజీలు: 76**

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400



The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య - సంగీత పత్రిక

51

అభిమానానికి రెండువైపులా అంచులుంటాయి. హద్దుల్లో ఉన్నంతవరకు అభిమానం హర్షణీయం, ఆనందదాయకం, స్ఫూర్తిప్రదాయకం. అదే దురభిమానంగా మారిందంటే అక్కడినుండి చిక్కులు మొదలవుతాయి. నేను అభిమానించేదానిని లేక అభిమానించేవారిని ఎవరూ విమర్శించకూడదనడం, తక్కినవారిపై ద్వేషం పూనడం ఒకరకమైతే అసలు అభిమానాన్ని చూరగొన్న వ్యక్తే 'ఇక చాలు మహాప్రభో' అనే సందర్భాలు కోకొల్లలు.

ఎందుకంటే అభిమానించేవాడు తనకు ఇష్టమైన వ్యక్తి లేదా వస్తువుపై మమకారాన్ని పెంచుకోవడంతో బాటు, ఒక విధమైన పోసెసివ్‌నెస్ కూడా ఫీలవుతాడు. అది తన కలలకు ప్రతిరూపంగా నూటికి నూరుపాళ్ళూ ఉండాలని కోరుకోవడమే కాదు, అలా ఉండాలని శాసిస్తాడు కూడా. అలా ఉండని సందర్భాలలో శాపనార్థాలు పెట్టడానికి కూడా శంకించడు. ఇది నమ్మశక్యంగా అనిపించకపోయినా నిజజీవితంలో ఇలా జరుగుతూంటుంది.

సినిమాహీరో, హీరోయిన్ల దర్శనానికై ఎండలోనైనా ప్రజలు గంటల తరబడి వేచి వుంటూంటారు. చివరకు వారు వచ్చాక జనాన్ని చూసి భయపడో, లేక అలసట వల్లనో కారు దిగక పోయినా, మేడ దిగి పలకరించకపోయినా ఇదే అభిమానులు రాళ్లు విసురుతారు. ఇది ఒక చిత్రమైన సైకాలజీ.

అదే విధంగా సామాన్యజనులు తమ ఆదర్శాల లగేజీని అభిమాన నాయకులకు తగిలించేస్తారు. నిత్య జీవితంలో తాము లౌక్యంగా, లోకరీతికనుగుణంగా బతుకుతున్నా ఆ నాయకులు మాత్రం ఆదర్శ ప్రాయంగా, నీతి నిజాయితీలతో, సమర్థతతో విలసిల్లాలని కోరుకుంటారు. వీరనుకున్న ఆదర్శాల నుండి వారేమాత్రం పక్కకు జరిగినా మండిపడతారు. తిట్టిపోస్తారు. వారి పరిస్థితులను, పరిమితులను అర్థం చేసుకునే ప్రయత్నం ఏ మాత్రం చేయరు.

ఇది ఎందువల్ల జరుగుతూంటుంది? మనకు నిజజీవితంలో హీరోలు కరువయిపోయారు. గత కాలంలో గాంధీ, నెహ్రూ, పటేల్, బోసు వంటి నాయకులు ప్రజలను ఆకర్షించగలిగారు. తమను ఆరాధించేటట్లు నడచుకోగలిగేరు. అందుకే ఏ విధమైన రాజకీయ ప్రయోజనాలను ఆశించకుండా కేవలం వారి మీద భక్తితో తమ పిల్లలకు వారి పేర్లు పెట్టుకున్న సామాన్య జనం ఎంతోమంది ఉన్నారు. ఈనాడు కనబడుతున్న వందలాది నాయకులలో ఏ ఒక్కరి పేరైనా తమ పిల్లలకు పెట్టుకునే జనం ఉన్నారా?

ధృవతారలు కానరాని ఈనాటి ఆకాశసీమలో ఏ చిన్న చుక్క మెరిసినా దానినుండే కొండంత వెలుగు ఆశించే స్థాయికి మనం నెట్టబడ్డాం. అవినీతికి వ్యతిరేకంగా ఏ పీలకంఠం గొంతెత్తినా మెచ్చుకుంటున్నాం. సభ్య సమాజంలోని విలువలను తలపించే తెమ్మెర ఎంత చిన్నదైనా పులకిస్తున్నాం. పులకించి ఊరుకోవడమే కాదు ఆ తెమ్మెర ఎంత వేగంగా, ఎటువైపు వీచాలో నిర్దేశించ బూనుతున్నాం. అక్కడే వస్తోంది చిక్కు! ఆ ఆదేశాలు ఇచ్చేందుకు ఉపయోగించే భాషతో మరింత చిక్కు!

'హాసం' పత్రిక అభిమానులలో పైన చెప్పిన రకాలవారూ ఉన్నారు. వారు పత్రికను తమ స్వంతపత్రికగా భావించి ఈగ వాలనివ్వరు. అంతవరకు పోన్లే అనుకోవచ్చు. కానీ దాన్ని దాటి మరో మెట్టు పైకెళ్తారు. తాము కలలు కని నెరవేర్చుకోలేకపోయిన వాటి జాబితాను బయటకు లాగుతారు. సలహాలు గుప్పిస్తారు.

'నాకు ఫలానా గాయకుడంటే ఇష్టం. అతని ఫోటో రంగుల్లో ఆర్ట్‌పేపరుపై ముద్రించి వేయవలెను'. అన్న అభ్యర్థనతో పత్రపరంపర ప్రారంభమవుతుంది. పాఠకులలో ఎంతమందికి ఆయన గురించి తెలుస్తుంది? ఆ ఫోటో లభ్యమవుతుందా? ఆర్ట్‌పేపరుపై వేయవలసిన అవసరం ఉందా? వీటన్నిటితో వాళ్లకు ప్రమేయం ఉండదు. వాళ్ల కోరిక తీరకపోయేసరికి అలుగుతారు. నిష్ఠూరాలాడుతారు. 'మీకు సంగీతకారులపై బొత్తిగా అలక్ష్యంగా ఉంది. ఈ ధోరణి మంచిది కాదు' అని. భాషలో తీవ్రత క్రమంగా పెరుగుతూ పోతుంది. దురదృష్టవశాత్తూ మనలో చాలామందికి తమ అభిప్రాయాలను సవ్యమైన భాషలో వెల్లడించడం కానీ, ఇతరుల అభిప్రాయాలను పక్షపాతరహితంగా వినడం కానీ తెలియదు. 'నా ముచ్చట తీర్చలేదు కాబట్టి నువ్వు చెడ్డ!' అని చటుక్కున అనేస్తారంతే! 'మీది చాలా గొప్ప పత్రిక' అని అంతకు ముందే మెచ్చుకున్న విషయం జ్ఞప్తికి రాదు కాబోలు.

ఒకసారి ఎ.సి.త్రిలోక్‌చందర్ అనే సినిమా డైరక్టరు రాశారు - షూటింగు చూడడానికి వచ్చిన ఓ పెద్దాయన ఆయనను చివాట్లేశాడట! 'మీరు సినిమాలు తీయడానికి ఏళ్లూ, పూళ్లూ పట్టిస్తారెందుకు? ఓ నాటకం ఆడుతూంటే కెమెరా పట్టుకెళ్లి తీసేస్తే మూడుగంటల్లో ఓ సినిమా తయారయిపోదూ!' అని. పత్రిక కమ్మర్షియల్‌గా సక్సెసవ్వాలంటే ఏ యే శీర్షికలు ఎలా నడపాలి, ఎవరిచేత రాయించాలి అని సలహాలిచ్చే వాళ్లలో చాలామంది తంతు ఇలాగే ఉంటుంది. వారికి పత్రికలను నడిపిన అనుభవం కానీ, మార్కెట్‌పై అవగాహన కానీ, ఆయా కాలమిస్టుల సంగతి గానీ ఏమీ తెలిసుండదు. అయినా సలహాలివ్వడానికి వెనుకాడరు. 'బ్రహ్మాండమైన ఐడియా ఇచ్చాను. విన్నారు కాదు. చెప్పకలేదంటనక పొయ్యారు...' అన్న ధోరణిలో సాగుతుంది మందలింపు. అందర్నీ నవ్వించచూసే 'హాసం'నే పగలబడి నవ్వించే తెరవెనుక 'హాసం' ఇది!



**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# శ్రీ శునక లీలలు

- వి.యల్.వి.భారతి



'కెవ్వు'మని అరిచింది భామ. అప్పుడే ఆఫీసు నుంచి వచ్చి బాత్రూంలో మొహం, కాళ్ళూ, చేతులూ కడుక్కుంటున్న భైరవ్ భార్య అరుపువిని 'కొంపదీసి కరెంట్ షాకు గానీ కొట్టలేదు కదా!' అని కంగారు పడుతూ బైటికొచ్చాడు.

హాల్లో నిలువు గడకర్రలా నిలబడి ఉన్న భామని చూసేసరికి ఒళ్ళు మండిపోయిందతనికి.

"టీ.విలో హర్రర్ సీరియల్ చూస్తున్న దానిలా ఏంటా అరుపు?"

"అది కాదండీ... మరే... మరే!"

అసలు సంగతి చెప్పకుండా నాన్చుతున్న ఆమె వ్యవహారం అతనిలో అంతకంతకూ సహనాన్ని చంపేసి ఆ స్థానాన్ని విసుగు ఆక్రమించింది.

"పైనుంచి బల్లి గానీ మీదపడిందా?" భామకి బల్లంటే చచ్చేంత భయం మరి!

"అబ్బే! కాదు"

"పిల్లల స్కూలు ఫీజు ఇంత మొత్తం కట్టమని నోటీసు గానీ పంపారా?"

"ఊఁహూ! అదేమీ కాదు"

"వంట గ్యాస్ ధరలు పెరిగినట్లు పేపర్లో ఇప్పుడే చదివావేంటీ?" ఆమె చేతిలో ఉన్న న్యూస్ పేపరు చూసి అడిగాడు.

"అదీకాదు! అదీ... అదీ... అటు చూడండి. మీరు తెచ్చిన బ్యాగులో ఏదో ఉన్నట్లు కదులుతోంది." ఆపాద మస్తకం చిగురుటాకులా వణికిపోతోంది భయంతో!

"ఓ... దాని గురించా? అదీ... ఉండు చూపిస్తాను" బ్యాగుని సమీపించి జిప్ సగం తెరిచాడో లేదో కెవ్వుమని ఇల్లు ఎగిరిపోయేలా అరిచాడు.

"బాబోయ్! పాము! మా ఆయన్ని కరిచింది కాపాడండి" అరుస్తూ వీధిలోకి పరిగెత్తబోయింది భామ.

"ఏహే! పాము కాదు నీ తలకాయ కాదు. చూడు ఇందులో ఏముందో?"

"మరి మీరెందుకు కెవ్వుమని అరిచారు?"

"పూర్తిగా సబ్బు వదలని మొహంతో బైటికొచ్చాను కదా! సబ్బు నురుగు నుదుటి మీంచి జారి కళ్ళల్లో పడిందంతే!" ఒక చేత్తో కళ్ళు నులుముకుంటూ మరో చేత్తో బ్యాగులోని ఒక చిన్న ప్రాణిని బైట పెట్టాడు.

'ఛీ... కుక్క పిల్లా!" చిరాగ్గా మొహం పెట్టింది భామ.

"చూడు దీని బొచ్చు బ్రౌన్ కలర్‌లో ఎలా నిగనిగ లాడుతోందో? ముద్దొస్తోంది కదూ! మా కొలీగ్ సుబ్బారావు ఇంట్లో కుక్క ఐదు పిల్లల్ని కన్నదట. ఆ సంగతి తెలిసి ఈరోజే వెళ్ళి దీన్ని తీసుకొచ్చాను. పసి ముండ పుట్టి వారం కూడా కాలేదనుకుంటా! దీనికేం పేరు పెడదాం?"

"ఏంట్రా గొడవ?" పక్కరూం లోంచి భైరవ్ తండ్రి హాల్లోకొచ్చాడు.

"చూడండి మావయ్యా! ఉన్న ఈ ముగ్గురి పిల్లలతోటి వేగలేక ఛస్తుంటే ఇప్పుడీ కుక్క పిల్లొకటి"

"చిన్నప్పటి నుంచీ ఈ కుక్కల పిచ్చేంట్రా నీకు?"

"నాన్నా! చిన్నప్పుడు నేను ఏ కుక్క పిల్లని తెచ్చినా బైటికి తరిమి కొట్టేవాడివి. ఆ కోరిక ఇవ్వాడు తీర్చుకుంటాను. ఎవ్వరూ కాదనటానికి వీల్లేదు" వినురుగా జవాబిచ్చాడు భైరవ్.

"హే..." అరుస్తూ సుడిగాలిలా దూసుకొచ్చారు పిల్లలు. కుక్కపిల్లని చూడగానే తెగ సంబరపడిపోయారు. ఏకగ్రీవంగా దానికి 'బ్రౌనీ' అని నామకరణం చేసారు.

పిల్లల్నీ భర్తనీ చుర చురా చూస్తూ విసవిసా వంటింట్లోకి నడిచింది భామ.

ఆరోజు నుంచీ భైరవ్, పిల్లలు బ్రౌనీని చేసే గారాబం ఇంతా అంతాకాదు. సుష్టుగా తిని బొద్దుగా ఒళ్ళు చేసింది. రాను రాను కళ్ళు నెత్తికెక్కి దానికి పొగరెక్కసాగింది. వీధి అరుగుమీద కూర్చొని వచ్చిపోయేవారిని చూస్తూ ఇంటి కప్పు ఎగిరిపోయేలా భయంకరంగా మొరిగేది. అదంటే ఆ వీధిలో అందరికీ హడలే! దారిన పోయేవాళ్ళు ఆ ఇంటి దగ్గరకొచ్చేసరికి గేటుని భయం భయంగా చూస్తూ వడివడిగా అడుగులేస్తారు.

భైరవ్ ప్రతినెలా మొదటి ఆదివారం బ్రౌనీని ఆటోలో డిస్నీపెట్ సెలూన్‌కి తీసుకెడతాడు. అక్కడ దానికి హెయిర్ కట్స్ నుంచీ ఆయిల్ మసాజ్, ఆరోమా థెరఫీలు, వెరైటీ బాత్‌లు వరకూ బోలెడన్ని బ్యూటీ ట్రీట్‌మెంట్లూ చేయిస్తాడు. అక్కడో వెటర్నరీ డాక్టరుంటాడు పెట్స్ రెగ్యులర్ చెకప్‌కి. ఆ పెట్ సెలూన్ వాళ్ళు యోగా ఫర్ డాగ్స్ అనే కొత్త కాన్సెప్ట్‌ని తయారు చేసారని కుక్కల కోసం డైలీ యోగా క్లాస్ అనే వీడియో కేసెట్స్, సీ.డీ.లు కూడా రిలీజ్ చేసారని తెలిసి తానూ ఒక సి.డీ. కొని... ఇంటికి తీసికెళ్ళాడు.

పిసినారి భామకి తన భర్త ఒక కుక్క కోసం ఇంత ఖర్చు పెట్టడం సుతారమూ నచ్చట్లేదు. ఇవ్వాడు దానికో సీ.డి. అనేసరికి ఒళ్ళు మండిపోయింది.

బ్రౌనీని టీ.వి. ముందు కుర్చోబెట్టి సీ.డి. ఆన్ చేశాడు భైరవ్. మొదట టీ.విలో కనిపించే కుక్కల్ని చూసి కాసేపు మొరిగింది. తర్వాత కదలకుండా చెవులు రిక్కించి ఎంతో ఏకాగ్రతతో చూడసాగింది. వివిధ జాతులకి చెందిన కుక్కలు గమ్మత్తుగా పల్టీలు కొడ్తూ రకరకాల భంగిమల్తో యోగా చెయ్యటం ప్రారంభించాయి. అది చూస్తున్న బ్రౌనీ మొహం సంతోషంతో విప్పారింది. తోక అదే పనిగా ఊపుతూ తన ఆనందం వ్యక్తం చేసింది.

"అయ్యయ్యో! ఆ సీ.డి. ఆపండి. టీ.వి.లో 'మోహమ్మాటం తెచ్చిన కడుపు' సీరియల్ ఉందండీ! కావాలంటే ఆ కుక్కల గోల ఆ తర్వాత పెట్టుకోండి" అంటూ సీ.డి. ఆఫ్ చేసి టీ.వి. సీరియల్ పెట్టబోయింది. అంతే! తన ఆనందానికి అడ్డొచ్చేవాడు దేవుడైనా క్షమించకూడదనుకుందేమో ఒక్కసారిగా వెనక నుంచి ఎగిరి ఆమె మీదకి దూకింది. ఊహించని ఆ పరిణామానికి బ్యాలన్సు తప్పి ముందుకి బొక్క బోర్లా పడబోతుంటే టీ.వి. ఉన్న టేబుల్ కొనభాగం సరిగ్గా ముక్కు దూలానికి తగిలి ముక్కు పచ్చడైంది భామకి.

"ఛచ్చాన్రో! దేవుడో! మాయదారి కుక్క చంపేస్తోందిరా! కొంపకి దిక్కుమాలిన సంతని తెచ్చి పెట్టాడ్రో!" అంటూ శోకాలు తీస్తూ శాపనార్థాలు పెట్టింది.




అక్కడే ఉండి నేల తుడుస్తున్న పనిమనిషి రత్తాలు కిసుక్కున నవ్వింది. ఈ సంఘటన దానికి పరమానందం కలిగించింది. 'లేకపోతే... పోయిన నెల నాగాలు పెట్టానని జీతం ఎగ్గోస్తుందా? తగిన శాస్తి జరిగింద'ని కసిదీరా నవ్వుకుంది. అక్కడితో ఆగక ఆ వీధిలో ప్రతి ఇంట్లో ఈ సంఘటన వర్ణిస్తూ కథలు కథలుగా చెప్పి పడీ పడీ నవ్వింది.

అడిగినప్పుడు చిన్న చిన్న చేబదుళ్ళు ఇవ్వలేదని పిసినిగొట్టు భామపై కోపం ఉన్న కొందరు ఆమె నవ్వుతో శృతి కలిపారు. ఆమె చేసే ప్రచారంలో పాలు పంచుకున్నారు.

మర్నాడు మధ్యాహ్నం చుట్టు పక్కల అమ్మలక్కలు భామ ఇంటికొచ్చారు. "అయ్యో! ముక్కు మీద ఆ కట్టేమిటండీ! బాత్రూంలో గానీ జారి పడ్డారా?" కావాలని పరామర్శించింది కామాక్షి.

"మీ పిచ్చిగానీ... తుంటి మీద కొడితే పళ్ళు రాలినట్టు జారిపడితే కాలు విరగాలి గానీ ముక్కు పచ్చడౌతుందా?" సామెతల సావిత్రి సమర్థింపు.

"మొహం మీద గాయం అయితే మటుకు ఎన్ని బ్యూటీ పార్లర్ల చుట్టూ తిరిగినా ఆ మచ్చ మటుకు పోదు సుమండీ" హేండ్ బ్యాగులోంచ్చి అద్దం తీసి చూసుకుంటూ ఉచిత సలహా పారేసింది వాల్జెడ వనజ. మేకప్ చెరిగిందో లేక జుట్టు రేగిందో అన్న అనుమానంతో మాటి మాటికి అద్దం చూసుకోటం, తన వాల్జెడని చేత్తో వయ్యారంగా తిప్పుతూ మాట్లాడ్డం ఆమెకలవాటు.

"ఫరవాలేదు! ఎలాంటి మచ్చలైనా ప్లాస్టిక్ సర్జరీతో సరిచేసుకోవచ్చుట కదా!" పక్కింటి బామ్మగారు తన బోడితలమీదకి కొంగు లాక్కుంటూ అంది.

"భలేవారే! ప్లాస్టిక్ సర్జరీ అంటే మాటలా? వేలకొద్దీ ఖర్చు!" భామ పిసినారి గుణం గుర్తు



తెచ్చుకుని మనసులో ముసి ముసిగా నవ్వుకుంది మాణిక్యం.

ఖర్చుమాట వినేసరికి ఉలిక్కిపడింది భామ. ఇదంతా తన కర్మ! ఆ ముదనష్టపు కుక్క మూలంగానే ఇన్ని కష్టాలు. పైకి ఏమి అనక గుడ్ల నీళ్ళు కక్కుకుంది.

"ఏయ్! ఆ వాల్జెడ అటూ ఇటూ ఊపటం ఆపుతావా? అది మా మొహాలకి తగులుతుంటే ఎంత చిరాగ్గా ఉంటుందని? లేకపోతే నీకే అంత పొడుగు జడ ఉందని గర్వమా?" ఒక చేత్తో అద్దం చూసుకుంటూ మరో చేత్తో వాల్జెడని వయ్యారంగా తిప్పుతున్న వనజని కసురుకుంది సావిత్రి.

"పొడుసంత! అందరికీ నా జడంటే అసూయే. జానెడు జుట్టున్న ప్రతి దానికీ నా జుట్టు చూస్తే ఏడుపే"

"అబ్బో! నీకే ఉంది లేవమ్మా అంతేసి పొడుగు. ఏదో కత్తిరించుకోటం ఫ్యాషన్ కాబట్టి మేమిలా పొట్టి జుట్టుతో ఉన్నాం. లేకపోతే నీలా శ్రద్ధగా సంరక్షణ చేసుకుంటే మాకూ అంతకన్నా పొడుగే ఉండేది" సావిత్రి మాటలకి అందరూ నవ్వారు.

ఆ మాటలకి ఉక్రోషం వచ్చి "హుం..." తన పొడుగాటి జడని విసురుగా వెనక్కి తోసింది వనజ.

"ఆపండ్రా మీ గోల! ముందు ఆ దెబ్బ ఎలా తగిలిందో అడగరే?" బామ్మగారు పక్కదోవ పడుతున్న వాళ్ళ మాటల్ని మళ్ళీ ట్రాకు మీదకి తెచ్చే ప్రయత్నం చేశారు.

ఇక దుఃఖం ఆపుకోలేక దగ్గర్లోనే కట్టేసున్న కుక్కని చూపిస్తూ ఘొల్లుమంది భామ.

"ఏంటి? కుక్క కారణంగా మీకా దెబ్బ తగిలిందా!?" ఆ వార్త అప్పుడే వింటున్నట్టు అందరూ ఆశ్చర్యం నటించారు మనసులోనే నవ్వుకుంటూ.

ఎవరు బ్రౌనీ గురించి మాట్లాడినా దాన్ని




పేరుపెట్టి పిలవాల్సిందే! పొరపాటునైనా దాన్ని కుక్క అన్నారో... దాని కోపం నశాళం అంటుతుంది.

అసలు వాళ్ళందరూ ఇంటికలా రావడమే నచ్చలేదు బ్రౌనీకి, అయినా ఏమీ అనకుండా గుర్రుగా అలా చూస్తూండి పోయింది. ఇప్పుడు తనని 'కుక్కా' అన్నందుకు దాని కోపానికి పుండు మీద కారం చల్లినట్లైంది.

బ్రౌనీ ఒక్క ఉదుటున లేచి భయంకరంగా మొరుగుతూ గొలును తెంపుకోటానికి విశ్వప్రయత్నం చేస్తూ ముందు కాళ్ళని గాల్లోకి పైకెత్తి విరుచుకుపడింది. అనుకోని పరిణామానికి విస్తుపోయారందరూ. ఆ కుక్కకి దగ్గర్లోనే వనజ ఉందని అది ముందరి కాళ్ళతో పైకి లేచినపుడు ఆమె దానికి మరింత దగ్గరౌతుందని ఎవ్వరూ ఊహించలేదు.

తనని కుక్కు అన్నందుకు ఉగ్రరూపం ఎత్తిన ఆ బ్రౌనీ నోటికి వనజ జడ సులువుగా దొరికింది. అది ఆమె జడని నోటితో బలంగా వెనక్కి లాగింది అంతే! ఆమె తలపై అమరి ఉన్న అందమైన వాల్జెడ విగ్గు ఒక్కసారిగా ఊడి బ్రౌనీ కాళ్ళముందు పడిపోయింది. అందరూ నోరెళ్ళ బెట్టి, గుడ్లప్పగించి చూస్తూ కొద్ది సెకన్లుపాటు తేరుకోలేదు. మరుక్షణం ఘొల్లుమని పొట్ట చెక్కలయ్యేలా నవ్వసాగారు. భామకూడా తన బాధని తాత్కాలికంగా మర్చిపోయి వారి నవ్వులతో శృతి కలిపింది.

అవమానంతో రగిలిపోయింది వనజ. తన బోడిగుండు తలని తడుముకుంటూ అద్దంలో చూసుకుంటూనే కళ్ళల్లో నీళ్ళు తిరిగాయామెకు.

వెంటనే తన ఎత్తు చెప్పులు టక టక లాడించుకుంటూ విస విసా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. ఆ వీధి మలుపు దాక వాళ్ళందరి నవ్వులూ వినిపిస్తూనే ఉన్నాయామెకి.

* * *

"రండిసార్... రండి.." ఎప్పుడూ రాని ఆఫీసర్ యమధర్మరాజు తనింటికొచ్చాడేంటబ్బా అని తెగ తికమక పడిపోయాడు భైరవ్.

"అబ్బే... మరేం లేదు. ఏదో పనిమీద ఇక్కడదాకా వచ్చాను. ఒంట్లో బాగోలేదని నువ్వు రెండు రోజులు సెలవు పెట్టావు కదా! నీకెలా ఉందో చూద్దామని" గారపళ్ళు బైటపెట్టి పెదవులు చెవులదాకా సాగదీస్తూ అనవసరంగా నవ్వాడు ఆఫీసర్ ఎం.డి.రాజు. వాడి స్వభావాన్ని బట్టి అందరూ యమధర్మరాజు అని పిలుచుకుంటారు.

"చాలా సంతోషం. ముందు మీరు కూర్చోండి." అంటూ ఆఫీసర్ని సోఫాలో కూర్చోపెట్టి లోపలికెళ్ళాడు భైరవ్ భార్యతో ఏదైనా టిఫిన్ చేయమని పురమాయించటానికి.

పిప్పళ్ళ బస్తాలాంటి శరీరాన్ని సోఫాలో కూలేసి హాయిగా నిట్టూర్చాడు ఆ ఆఫీసరు.

"ఏమేవ్! మా యముడు సరాసరి ఇంటికే వచ్చాడు. కాస్తా ఏదైనా టిఫిన్ చేద్దూ!" బ్రతిమాలుతున్న భర్తకేసి చుర చుర చూసింది భామ.

"అయితే ఒక కండీషన్! కుక్కని ఎక్కడైనా దూరంగా వదిలేస్తానని మాటిస్తేనే" మొండికేసిందామె.

"దాని సంగతి తర్వాత ఆలోచిద్దాం గానీ ముందు...."

"అదేం కుదరదు. మాటిస్తేనే..."

"ప్లీజ్! పాపం బుజ్జిముండ! అదేం చేసిందని!"



"భౌ... భౌ" అంటూ మొరుగుతూ వచ్చి ఎం.డి.రాజు కూర్చున్న సోఫా చుట్టూ తిరగసాగింది బ్రౌనీ.

"బాబోయ్! బ్రౌనీ మా యముడ్ని గానీ కరిచెయ్యలేదు కదా!" హడిలిపోతూ ఒక్క పరుగుతో హాల్లోకొచ్చాడు భైరవ్.

జరిగిన పొరపాటు అర్థమయ్యింది. బ్రౌనీ కోసం కేటాయించిన సోఫాలో యముడు కూర్చుని ఉన్నాడు. దాని సీట్లో అది ఎవ్వరినీ కూర్చోనివ్వదు. అలా కూర్చుంటే ఆ సోఫా చుట్టూ భయంకరంగా అరుస్తూ తిరుగుతుంది.

యముడు బిక్క చచ్చిపోయి మిడిగుడ్లేసుకుని ఏంచెయ్యాలో తోచక అటూ ఇటూ చూస్తున్నాడు. కాళ్ళు సోఫా పైకి మడిచి పెట్టుకోబోయాడు.

"వద్దుసార్! అలా చేస్తే ప్రమాదం. ఇది మా బ్రౌనీ కూర్చునే సోఫా. అందుకే మీచుట్టు తిరుగుతోంది. కాళ్ళు మడిచి పైన పెట్టుకున్నారో అది అమాంతం మీదికెక్కి కరుస్తుంది. ముందు అక్కడ్నుంచి లేచి ఆ పక్క సోఫాలో కూర్చోండి."

"అబ్బా! మళ్ళీ లేచి కూర్చోలేనయ్యా" అంటూ నల్లని బారీ శరీరాన్ని అసహనంగా కదిలించాడేగానీ మనిషి అరంగుళం కూడా కదల్లేదు.

విధిలేక బ్రౌనీని పెరట్లో కట్టేసొచ్చి యముడి ముందు కూర్చున్నారు భైరవ్. ఇద్దరూ కాసేపు ఏదో పిచ్చాపాటిగా ఆఫీసు విషయాలు మాట్లాడుకున్నారు.

ఇంతలో భామ టిఫినూ, ఫ్రిజ్‌లోంచి స్వీట్లూ తెచ్చి వారిద్దరి ముందు పెట్టింది. వాటిని అబగా అందుకుని తినసాగాడు.

"పాపం! బానలాంటి ఆ పొట్టకి ఈ కాస్త ఏమూలకి?' అనుకుంటూ తన వాటా కూడా యముడికి పెట్టేశాడు భైరవ్.

'మరి నీకో?' అనకుండా మొహమ్మాటానికి పోకుండా మొత్తం శుభ్రంగా తినేసి బ్రేవ్‌మని త్రేన్చి వెనక్కి జారగిలపడి రెండు సెకన్లలో నిద్రలోకి జారిపోయాడు యముడు.

భైరవ్‌కి తెలుసు. ఇంకో గంటదాకా ఏనుగొచ్చి తొక్కినా నిద్రలేవడని. ఆ యముడిని అలాడే వదిలేసి ఏదో పనిమీద బైటికెళ్ళాడు.

కాసేపటికి భామ హాల్లోకొచ్చి ఎదురుగా కనిపించిన దృశ్యం చూసి కొయ్యబారి పోయింది.

పిల్లలెవరో బ్రౌనీని విడిచిపెట్టారు కాబోలు.. అది యముడి పక్కన కూర్చుని వాడి మీసాల మధ్య ఇరుక్కున టిఫిన్ తాలూకు శకలాలని సంతోషంగా తోకూపుకుంటూ శుభ్రంగా నాకేస్తోంది.

యముడు నిద్రలోనే స్టెనోని గుర్తు చేసుకుంటూ కుక్క మొహాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని "లిల్లీ! ఐ లవ్ యూ" అంటూ ముద్ద ముద్దగా మాట్లాడుతున్నాడు.




అప్రయత్నంగా కెవ్వుమని అరిచింది భామ.

ఆ అరుపుకి కుక్క బెదర్లేదు. యముడూ కదల్లేదు. వెంటనే పెరట్లోకెళ్ళి దుడ్డుకర్ర తీనుకొచ్చి కుక్క మూతిమీద ఒక్కటి వేయబోయింది. ప్రమాదం పసిగట్టిన బ్రౌనీ ఛెంగుమని క్షణంలో సోఫామీదనుంచి కిందకి దూకింది. దుడ్డుకర్ర కొనభాగం యముడి మూతికి గట్టిగా తగిలింది. ముందు పళ్ళు రెండూ ఊడొచ్చాయి.

అప్పటికి యముడిలో చలనం వచ్చింది. నొప్పి పెడుతున్న మూతిని తడివి చూసుకున్నాడు. వేళ్ళకి అంటింది ఎర్రటి రక్తం.

లిప్తపాటు అయోమయంలో పడి తేరుకుని పూర్తిగా కళ్ళు విప్పార్చి చుట్టూరా చూశాడు. ఎదురుగా భామ... భద్రకాళిలా! చేతిలో దుడ్డుకర్ర త్రిశూలంలా!

"అయ్య బాబోయ్! రక్తం! చంపేస్తున్నార్రోయ్! దేవుడోయ్" అరుస్తూ గేటుదాకా పరిగెత్తుకొచ్చాడు భారీకాయాన్ని రొప్పుతూ... ఈడుస్తూ...!

అప్పుడే లోపలికొన్తున్న భైరవ్‌కి డాషిచ్చాడు.

పాపం! బానలాంటి బొజ్జ తగిలేసరికి బక్కప్రాణి భైరవ్ ఎగిరి గాల్లో రెండు పల్టీలు కొట్టి నేల మీద పడి పిల్లి మొగ్గవేసి నిలదొక్కుకున్నాడు.

తన మూలంగా కింద పడ్డాడే అన్న జాలి లేకుండా క్రూరంగా కాల్చేసేలా చూస్తూ "భైరవ్! నీకు ఇంక్రిమెంట్ కట్! కాదు.... కాదు... యు ఆర్ డిసిమిస్డ్!" పిచ్చిగా అరుస్తూ బైటికి పరిగెత్తాడు యముడు.

అది చూసి బ్రౌనీ కూడా ఇంట్లోంచి బుల్లెడ్‌లా దూసుకొచ్చి టాపు ఎగిరిపోయేలా అరుస్తూ యముడి వెనకాల పడింది.

తొంభైఅయిదు కేజీల బరువున్న శరీరాన్ని మోయలేక మోస్తూ ఆయాసంతో రొప్పుతూ, జారిపోతున్న ప్యాంటుని ఒక చేత్తో పైకి ఎగదోసుకుంటూ వీధిలోకి పరుగు పెడుతుంటే అందరూ ఇళ్ళల్లోంచి బైటికొచ్చి వింతగా చూస్తూ చెక్కలయ్యే పొట్టని నొక్కి పెట్టుకుని నవ్వలేక అవస్థ పడుతున్నారు.

పాపం! భైరవ్‌కి మాత్రం "యు ఆర్ డిస్ మిస్డ్" అన్న మాటలే చెవులో మార్మోగుతుంటే యముడూ, దాని వెనక పరిగెత్తే బ్రౌనీ మసక మసగ్గా కనిపిస్తూ ఉండగా స్పృహతప్పింది. ●



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే

రచన, సంగీతం
కీ॥శే॥ న్యాయపతి రాఘవరావు
(రేడియో అన్నయ్య)
గానం
- బాలల బృందగానం
రాగం
యమన్
(హిందుస్తాని సంగీతం)
తాళం : చతురశ్రగతి
(కర్ణాటక సంగీతం)
- కహరువా (హిందుస్తాని సం॥)
ఆరోహణ
సరిగమపదనిస
అవరోహణ
సనిదపమగరిస

ప: అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే
తెలంగాణము రాయలసీమయు
కోస్తా ప్రాంతపు తెలుగు దేశము ॥అంతా॥

1చ: ఆంధ్రులమైనా తమిళులమైనా
ఉత్కలులైనా కన్నడులైనా
మరాఠి ఐనా గుజరాత్తైనా
పంజాబైనా బాంగ్లా ఐనా ॥అంతా॥

వచనం: వందనమమ్మా వందనము
వణక్కమమ్మా వణక్కం
నమస్కార్ నమస్కార్
అస్సలాం అస్సలాం

2చ: భాషలు వేర్వేరైనా గానీ
భావాలన్నీ ఒకటేనోయ్
జాతులు మతములు వేర్వేరైనా
నీతులు అన్నీ ఒకటేనోయ్ ॥అంతా॥

3చ: దేశాలన్నీ ఒకటే ఐతే
ద్వేషాలేవీ ఉండవుగా
బాల ప్రపంచం భావి ప్రపంచం
భావి భారత వారసులం ॥అంతా॥

- షడ్జమము, చతుశృతి రిషభం, అంతర గాంధారం, ప్రతి మధ్యమం, పంచమం, చతుశృతి దైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు. శుద్ధ మధ్యమం కూడా యీ పాట బాణీలో వాడ బడినది.



కర్ణాటక సంగీతంలో ని 65 వ మేళ కర్త అయిన కల్యాణి రాగాన్నే హిందుస్తానిలో యమన్ కల్యాణ్ అని, యమన్ అని పిలువబడుతున్నది. కల్యాణ్ థాట్‌గా మేళకర్తరాగంగా ప్రసిద్ధి చెందిన యీ రాగానికి యవన దేశస్థుడగు అమీర్ ఖుస్రు తన పూర్వీకుల జ్ఞాపకార్థం యీ రాగంలో అల్ప ప్రమాణంలో వివాది రూపంగా శుద్ధ మధ్యమ ప్రయోగం చేసి యవన్ కల్యాణి అని నామ ధేయాన్ని యిచ్చాడు యీ రాగానికి. అదే కాలక్రమమున యమన్ కల్యాణ్‌గా రూపొందింది. లలిత సంగీతంలో యీ రాగంలో శుద్ధమధ్యమ ప్రయోగం ప్రముఖంగానే చూపుతూ ఎంతోమంది స్వరకర్తలు అద్భుతమైన సుమధుర బాణీలు కూర్చారు.

చిన్నారి బాలబాలికల నిర్మలమైన మనుసులలో సంకుచిత భావాలు చోటు చేసుకోకూడదని, బాలలందరూ ఒకటేనని దేశంలో ఎన్ని మతాలు, జాతులు వున్నా భారతీయులంతా ఒకటేనని "అంతా ఒక్కటే మనమంతా ఒక్కటే" అంటూ ఐకమత్యాన్ని చాటి చెప్పే యీ గీతాన్ని రేడియో అన్నయ్యగా ఖ్యాతిగాంచిన కీ॥శే॥న్యాయపతి రాఘవరావుగారు రచించారు. ఈ పాటలో యింకా ఆయన "దేశాలన్నీ ఒకటే అయితే ద్వేషాలేవీ వుండవుగా" అంటూ చక్కని శాంతి సందేశాన్ని కూడా అందించారు. ఈ గేయాన్ని ఆంధ్రబాలానంద సంఘం బాలలు పాడగా దూరదర్శన్‌లో ప్రసారం చేశారు. అఖిల భారత తెలుగు బాలల మహోత్సవంలోను, ప్రపంచ తెలుగు మహాసభల (1975)లోనూ యీ గేయాన్ని బాలలు పాడి వేలాది ప్రేక్షకుల మన్ననలు పొందారు.

## కీ॥శే॥ న్యాయపతి రాఘవరావు

రేడియో అన్నయ్యగా దాదాపు 4 దశాబ్దాల పాటు పిల్లల వినోద వికాసాల కోసం అహర్నిశలు కృషి చేసిన శ్రీ న్యాయపతి రాఘవరావు గారు ఆంధ్రులందరికీ సుపరిచితులు. 1905 ఏప్రిల్ 13 (రామనవమి) నాడు శ్రీ ఎన్.ఆర్.స్వామిగారి మూడవ కుమారుడుగా జన్మించారు.



రాఘవరావు గారు హైస్కూలు చదువు పూర్తి అవుతుండగానే గాంధీజీ పిలుపు విని జాతీయోద్యమంలో అడుగుపెట్టారు. ఆంధ్రా యూనివర్సిటీ నుండి బి.ఎ (లిటరేచర్) పట్టా తీసుకుని కొంత కాలం 'హిందూ' పత్రికలో పనిచేశారు.

1939 లో మద్రాసు ఆకాశవాణిలో పిల్లల కార్యక్రమాలు నిర్వహణ ప్రారంభం చేశారు అప్పటినించీ పిల్లలే ఆయనకు లోకం. పిల్లల కార్యక్రమాల కోసం ఆయన పిల్లలను చేర్చి కథలు కబుర్లు నాటికలు వారికి నేర్పి ఆకాశవాణిలో ప్రసారం చేసేవారు. ఆ సందర్భంగా రాఘవరావు గారు పిల్లల్ని, వారి ఆలోచనలును ఎంతో బాగా చదివేరు. పిల్లలు అర్థంచేసుకోగల తేలిక భాషలో స్వయంగా పాటలు, నాటకాలు, గల్పికలూ రచించేవారు. ఆ రోజుల్లో పిల్లలతో బాటు పెద్దలూ కూడా చాలా ఉత్సాహంగా వినేవారు.

పాటలు రాసి దానికి బాణీ కట్టి పిల్లలకు నేర్పేవారు. ఈ రకంగా పరిశీలిస్తే అన్నయ్యగారిని వాగ్గేయకారుడు అనే చెప్పాలి. కాని ఆయన

ప॥ సాసా | , నిస | నిదనిద | ; దద | నిరి | , గరిస | సా ; | ; ; |
అం తా | . ఒకట | టే . . . | . మన | మంతా | . ఒ. కట | టే . | . . |

గగాగ | , గగా | గామగ | రిరిరి | నిరి | గామగ | గరిరిరి | ససా |
తెలంగా | . ణము | రాయల | సీమయు | కోస్తా | ప్రాంతపు | తెలుగుదే | . శము |
॥అంతా॥

1. చ॥ గాగగ | గాగా | గగమగ | రిరి | నిరిరి | రిరి | గాపగ | రిసా |
ఆంధ్రుల | మైనా | తమిళుల | మైనా | ఉత్కళులు | లైనా | కన్నడు | లై. నా |

ససాస | గామేగ | పపదా | పమగా | నిరిరి | రిరి | గాపా | గరిసా |
మరాఠి | ఐ నా. | గుజరా | లై. నా | పం. జా | బైనా | బాంగ్లా | ఐ. నా |
॥అంతా॥



వచనం (తాళంలో)
వందనమమ్మా వందనము
వణక్కమమ్మా వణక్కం
నమస్కార్! నమస్కార్!
అస్సలాం అస్సలాం

2. చ॥ సాసస | గామేగ | పాపా | పాపా | పాపా | పాదప | గపమా | గా ; |
భాషలు | వేర్వే. | రైనా | గాని | భావా | లన్నీ. | ఒకటే | నోయీ |

గాగగ | గగగగ | గామ్మగ | రిరి | నిరిరి | గామగ | గరిస | సా ; |
జాతులు | మతములు | వేర్వే. | రైనా | నీతులు | అన్నీ. | ఒకటే. | నోయీ
॥అంతా॥

3వ చరణం 2వ చరణం వలె పాడాలి.

మే = ప్రతి మధ్యమం
మ = శుద్ధ మధ్యమం

సంగీతం, సాహిత్యం అనేవి పిల్లలను మంచి పౌరులుగా తీర్చిదిద్దే సాధకాలుగా ఉపయోగించారే కాని తన ఉన్నతిని గూర్చి ఆలోచించలేను గురజాడ వారి 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ' గేయానికి ఆయన మాయామాళవగౌళ రాగంలో సరళంగా బాణీ కట్టారు. ఆ పాట వింటుంటే గుండె ద్రవించి ధారగా కన్నీరు కారని వారుండరు.

1957లో సారథీ స్టూడియోస్ వారు గాయకుల కోసం అన్వేషిస్తుంటే, తాపీచాణక్య, మాస్టర్ వేణుగార్లను బాలానందానికి పిలిచి వారికి నన్ను పరిచయం చేసినది అన్నయ్య గారే. ఆ తరువాత నేను 'కులదైవం' సినిమాలో పాడాను. మద్రాసు ఆకాశవాణి నుండి 1956లో అన్నయ్యగారు తన సతీమణి కామేశ్వరి గారితో హైదరాబాదు వచ్చేశారు.

అప్పటి నుంచి అన్నయ్య గారితోను బాలానందంతోను మా కుటుంబమంతటికీ పటిష్టమైన అనుబంధం ఏర్పడింది. ఇప్పటికీ ఆ అనుబంధం కొనసాగుతూనే ఉన్నది.

రేడియో కార్యక్రమాలే కాకుండా 1940లో 'బాలానంద సంఘం' స్థాపించి అన్నయ్యగారు పిల్లల వినోద వికాసాల కోసం ఎంతో కృషి చేశారు. నటన, పాట, కథ వీటన్నిటిలో శిక్షణ ఇచ్చారు. పిల్లల కోసం 'బాల' మాసపత్రిక స్థాపించారు. ఆయన రచనలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. నేడు ప్రఖ్యాతిపొందిన ఎంతోమంది నటులు, గాయకులు, సాహితీమూర్తులు, ప్రయోక్తలు బాలానందంలో అడుగులు వేయటం నేర్చుకున్నవారే.

'చిలకమ్మపెళ్ళి' సంగీత నృత్యరూపకానికి అన్నయ్యగారు బాణీ కూర్చగా నేను వాద్య సంగీతాన్ని కూర్చి పాడాను కూడా. తేట మాటలతో ఆటల పాటల మధ్య పిల్లలకు నీతిబోధ చేయటంలో అన్నయ్యగారికి అన్నయ్యగారే సాటి! ఆయన రచించి పాడించిన ఎన్నో పాటలున్నాయి. వాటిలో కొన్ని గేయాలను వారు గతించిన తరువాత బాలానంద సంఘం నా వాద్య నిర్వహణలో రెండు కాసెట్లుగా విడుదల చేసింది. నారాయణగూడాలోని తమ స్వంత యింటిని బాలానంద సంఘానికి దానం ఇచ్చారాయన. ఆ భవనంలో అన్నయ్యగారు మేనకోడలి కుటుంబం శ్రీ సూరిబాబుగారు శ్రీమతి కమల, శ్రీమతి కామేశ్వరి ఇప్పటికీ అన్నయ్యగారి ఆశయాలకు అనుగుణంగా బాలానందం నిర్వహిస్తున్నారు. అనుక్షణం పిల్లల ఉజ్వల భవిష్యత్తును సక్రమంగా తీర్చిదిద్దాలని తపన చెందిన అన్నయ్యగారు రచించిన ఎన్నో అమూల్య రచనలు గ్రంథాలుగా వెలువడితే భావితరాలకు ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది.

**యమన్ రాగం ఆధారంగా సినిమా పాటలు 16-30 నవంబరు 2002 సంచికలో ఉన్నాయి.**




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్లపూడి వెంకటరమణ

వెండితెర నవల

7

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

**బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లూ పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికి వెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలిస్తుంది ఝాన్సీ. -(ఇక చదవండి)**

ఝాన్సీని చూస్తుంటే కన్న కూతురును చూస్తున్న ఆత్మీయానుభూతి కలుగుతున్నది ఛైర్మన్‌కు. ఆమె తెలివితేటలు. ప్రజ్ఞాపాటవాల పట్ల అపారమైన విశ్వాసం కలిగిందాయనకు. తన సహనం, సౌశీల్యంతో ఇంటినెలా తీర్చిదిద్దు కుంటుందో, తమ వ్యాపార సామ్రాజ్యాన్ని కూడా అలాగే చక్కదిద్దగలదన్న నమ్మకం కలిగిందా వ్యాపార దక్షుడికి. తక్షణమే ఆమెను తమ కంపెనీలో చేర్చుకోవడం తమ వ్యాపారానికి రక్షణగా నిలుస్తుందని ఆశ కలిగిందాయనకు. ఇంకేమాత్రం ఉపేక్షించ దలుచు కోలేదు. కుర్చీలోంచి లేచి



నిలుచున్నాడు. డైరెక్టర్లందరూ కూడా లేచి నిలుచున్నారు.

"థాంక్యూ వెరీమచ్. నువ్వెవరో, ఎందుకొచ్చావో తెలియదు. నిలుచున్న పళంగా ఇంత చక్కని ఆలోచనలు, మార్గాలు చెప్పావు. కూర్చుని ఆలోచిస్తే ఇంకా చాలా మార్గాలు చెప్పగలవని మా డైరక్టర్లందరికీ నమ్మకం కలిగింది." అని "గోపాల్" పిలిచాడు కొడుకును.

"డాడ్" అన్నాడు గోపాల్.

"అమ్మాయి పేరేంటి?" అడిగాడు.

"ఝాన్సీ లక్ష్మి" చెప్పాడు గోపాల్.

డైరెక్టర్స్‌ను చూశాడు ఛైర్మన్.

"వెరీగుడ్. ఈమె పేరు మిసెస్ ఝాన్సీ. మన కంపెనీలో ఉద్యోగం కోరి వచ్చారట." చెప్పాడు. అందరి ముఖాల్లో ఆమోదం కనిపించింది.



"అమ్మాయ్! ఝాన్సీ.. నిన్ను మా కంపెనీలోకి సంతోషంగా ఆహ్వానిస్తున్నాను. నిన్ను సేల్స్ డిపార్ట్‌మెంట్‌కు వైస్ ప్రెసిడెంట్‌గా నియమిస్తున్నాను. గోపాల్.... ఆర్డర్స్ టైప్ చేయించి పట్రా." పురమాయించాడు.

గోపాల్ వెంటనే ఒక సెక్రటరీని పిల్చి ఏం చెయ్యాలో చెప్పి పంపించాడు.

ఝాన్సీ ముఖంలో ఆనందం! ఉద్వేగం!

దైవదర్శనం కోరి ఆలయానికి వెళ్తే దేవుడే ప్రత్యక్షమైనట్లు!

పువ్వు కోసుకుందామని తోటకు వెళ్తే పూల తోటంతా తానే కదిలి తన కొప్పులో కాపురం పెట్టినట్లు!!

ఎండిపోయి బీటలు వారిన పుడమి, మేఘుడు రెండు వాన చుక్కలు చిలకరించగానే పులకరించి కమ్మని వాసనలు వెదజల్లినట్లు!!!

చెవులలో అమృతధారలు కురిసినట్లున్న ఛైర్మన్ మాటలకు పరవశించి పోయింది ఝాన్సీ.



ఆనంద బాష్పాలు జల జల రాలాయి. వాటిని ఆపేందుకు ప్రయత్నించ లేదామె. ఇంట్లో అంట్లు చెంబులు తోముకుంటూ, పిల్లాపాపలను చూసుకుంటూ, పతిసేవ చేసుకుంటూ, నేడు గత్యంతరం లేని పరిస్థితిలో రోడ్డుమీద పడ్డ తనకు ఒకేసారి ఇంతటి ఉన్నతమైన, ఉదాత్తమైన ఆదరణ లభించడం ఆమెను వివశురాలని చేసింది. భరించలేని ఆనందాన్ని తట్టుకోవడం ఎంతటి భారమో అవగతమైంది. ఆ ఆనందం అనుభవిస్తుండగానే ఛైర్మన్ తదుపరి విషయాలు చెప్పాడు.

"ఒక సంవత్సరం కాంట్రాక్టు. మంచి రిజల్టు చూపిస్తే ఇంకా

పెంచుతాం. అంతవరకూ నెలకు పదివేలు జీతం, క్వార్టర్సు, ఫోను, రోజూ కారు ఇస్తాం." వరాల ఉప్పెన ముంచెత్తింది ఛైర్మన్ నోటినుంచి.

ఝాన్సీ నయనాలు ఇంకా వర్షిస్తూనే ఉన్నాయి.

"మీరింక వెళ్ళవచ్చు." అందరికీ సెలవిచ్చాడు ఛైర్మన్. డైరక్టర్లంతా నిష్క్రమించారు.



ఇంతలో గోపాల్ అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ టైపు చేయించి తెచ్చాడు. ఛైర్మన్‌కు అందించాడు. ఛైర్మన్ ఒక్కసారి దానిని కళ్ళతోనే చదివి ఆప్యాయంగా ఝాన్సీ ముందు పెట్టాడు. మారు మాటాడకుండా అంగీకార సూచకంగా సంతకం చేసింది ఝాన్సీ.

దానిని తిరిగి తీసుకున్నాడు ఛైర్మన్. "మంచిది. రేపు కారు వస్తుంది." చెప్పాడు.

ఝాన్సీ తల వంచుకుని అలాగే కూర్చుంది.

"గోపాల్... ఈమెను కారులో పంపి ఇంటి అడ్రసు తెలుసుకుని రమ్మను." చెప్పాడు ఛైర్మన్.

ఝాన్సీ కళ్ళు తడిగా మెరుస్తున్నాయి.

* * *

ఇంట్లో దిలాసాగా కూర్చుని సినిమాపత్రికను చదువుతున్నాడు బాలాజీ.



ఇంటిముందు కారు ఆగింది. కార్లోంచి ఝాన్సీ దిగింది. ఉత్సాహంగా ఇంట్లోకి వచ్చింది. "ఏమండీ.. వచ్చేసింది." అని పిల్లలకోసం అటు ఇటు చూసి 'పిల్లలేరీ?' అంటూ బెడ్రూమ్‌లోకెళ్ళింది.

"ఆడుకోడానికి వెళ్ళారు. నాకు చెప్పు. నేనర్థం చేసుకోగలను." అన్నాడు బాలు వ్యంగ్యంగా.

"అది కాదండీ. ఇచ్చేశారు" చెప్పింది నవ్వుతూ.

"ఏమిచ్చారు? నీ అప్లికేషనా?"

"ఛీ.. ఉద్యోగమండీ."

"అనుకున్నాను. ఆ రాజగోపాల్ గాడు..."

"గోపాలకృష్ణ"

"వాడే. క్లాస్‌మేటు, పాతఫ్రెండు గదాని పడేసుంటాడు. టీ కాఫీలు కాయడమా, చాకలి పద్దులు రాయడమా?" అన్నాడు వేళాకోళంగా.



"ఛీ పొండి... ఉద్యోగం. పేద్ద ఉద్యోగం." చెప్పింది భర్త పక్కనే కుర్చీలో కూర్చుంటూ.

చెప్పుకింద తేలులా పడుండే ఇల్లాలు తనతో సమానంగా కూర్చోవడం బాలాజీ అహాన్ని దెబ్బతీసింది. అయినా ఇపుడు తాను పురుషలక్షణం లేని వాడు కావడంతో ఏమీ అనలేక పోయాడు.

నిర్లక్షంగా పేజీలు తిరగేస్తూ "జీతమెంతో చెప్పు ఉద్యోగం చిన్నో పెద్దో నేను చెబుతాను." అన్నాడు.

భర్త నిర్లక్ష్యధోరణికి మనసు కలుక్కుమంది ఝాన్సీకి. బాధగా చూసి లేచింది. బెడ్రూమ్‌లోకి వెళ్తూ 'పది' అనబోయి "మూడు" అని చెప్పింది.

"వందలా పదులా" పరిహాసంగానే అన్నాడు బాలు.

ఝాన్సీ కళ్ళలో నీళ్ళు చిప్పిల్లాయి. 'ఒకట్లు' అని పెళుసుగా జవాబు చెప్పి గదిలోకి వెళ్ళింది.

"ఒహో... వేలా? బాగుంది. చీపురు, కుంపటి తప్ప ఎరగని వారికి ఇలా వేలు, లక్షలు గుమ్మరించేస్తే కంపెనీ మూడు రోజుల్లో దివాలాయేం... గ్యారంటీ." వుల్లవిరువు మాటలను కొనసాగించాడు బాలాజీ.



భర్త నూటి పోటి మాటలకు తీవ్రంగా కలత చెంది చేతిలోని బ్యాగును విసిరికొట్టింది ఝాన్సీ. జీవితసహచరి హృదయాన్ని సరైన కోణంలో సహృదయంతో అర్థం చేసుకోలేని పెనిమిటి- ఏ స్త్రీకైనా నరక ప్రాయమే కదా! పోనీ... చెడ్డవాడా అంటే కాదు. ఆడదంటే అలుసు! అంతే! భవిష్యత్తులో తన మీద పెత్తనం చేస్తూందేమోనన్న శంక. ఇన్నాళ్ళూ ఇంటిని రారాజులా శాసించిన తను ఇక నుంచీ భార్య మాటకు తలవంచ వలసి వస్తూందేమోనన్న బెదురు!



అంతే తన మాటలకు భార్య మనసు కష్ట పెట్టుకుంటుదని తెలుసు. అయినా తనకెదురు లేదన్న ధీమా! ఇటువంటి భర్తలు నూటికి ఎనభైమంది కనిపిస్తారీ సమాజంలో. అనహానంతో సిగరెట్ వెలిగించాడు.

"మూడు వేలని మురిసి బోర్లా పడేవు. ఆకంపెనీ ఊరి చివర్లో ఉంది. నువ్వు బస్సెక్కి మగాళ్ళ పీడా అదీ భరించలేవు. ఆటోలెక్కితే నెలకు ఐదారువందలకు మునిగి పోతావు." అన్నాడు సిగరెట్ వెలిగించుకుంటూ.

"ఆటో ఏం ఖర్మ? కారిస్తారు." అన్నది విసురుగా.

ఆమాట వినపడగానే "ఆ...కారా?" అన్నాడు నోరు తెరిచి. అతని నోట్లోంచి సిగరెట్ జారికింద పడింది ఆహం కొంచెం తగ్గిందనడానికి గుర్తుగా.

"మరేఁ...కారూ, పెద్దబంగళా, బొచ్చుకుక్క, దానికో బంగారు గొలుసూ, అన్నీ ఇస్తారు. ఇంటి ఖర్చులే ఉండవు." అన్నది దుఃఖాన్ని దిగమింగుకుంటూనే బట్టల్ని సర్దుతూ.



భార్య దుఃఖం క్లయిమాక్స్ కొచ్చిందని అర్థమైంది బాలాజీకి. ఇక ఏడిపించడం తగదనుకున్నాడేమో గబగబ వచ్చి ఆమె ఎదురుగా నిలుచున్నాడు. భార్య దుఃఖాన్ని చూసి తప్పు చేసిన వాడిలా తలదించుకున్నాడు.

"సారీ ఝాన్సీ. సరదాగా జోక్ చేశానంతే. నిజంగా... అయామ్ థ్రిల్డ్. నా అంత జీతం మొదటి అంటెంప్ట్‌లోనే గెల్చేశావు. అయామ్ రియల్లీ ప్రౌడాఫ్ యూ." షేక్ హాండివ్వడానికి చెయ్యి జాపాడు.

ఆ మాత్రానికే కరిగిపోయిందా ఇల్లాలు. చిన్నగా నవ్వుతూ తలవంచుకునే చెయ్యి జాపింది. బాలాజీ ఆమె చెయ్యిని గట్టిగా ఊపి

ముందుకు లాక్కుని వాటేసుకుని ఎత్తుకుని గిరగిరా తిప్పాడు. తలుపు చాటున నించుని చూస్తున్న పిల్లలు ఆశ్చర్యపోయారు.

* * *

వైకుంఠం.

అంతా ప్రశాతంగా ఉంది. శేషశయ్యపై యధాప్రకారం మాజీ ప్రధాని దేవెగౌడలాగా ఒత్తిగిలి పడుకుని యోగనిద్రలో ఉన్నాడు నారాయణుడు. బహుఃశా స్థితి కారకుడు కావడం వల్ల స్థిరంగా పడుకుంటాడేమో? సృష్టించడం విధాత డ్యూటీ. నాశనం చెయ్యడం శివుని డ్యూటి. అందువల్ల వాళ్ళు నిరంతరం బిజిగా ఉంటారు. ఆరెండిటినీ చూనన్తా కూర్చోవడమేగా తన పని! అందువల్ల నిశ్చింతగా పడుకుంటాడు. ఎండా వానా తగల కుండా వేయి పడగలతో శేషన్న గొడుగు పట్టి ఉంచుతాడు.



లక్ష్మీదేవి తన డ్యూటీ ప్రకారం పతి పాదాలను మర్దనా చేస్తున్నది. నారదుడు ఏ ముహూర్తంలో 'మీ ఆయన నిన్ను మోసం చేస్తున్నాడ'ని చెవిలో ఊదాడో కానీ అప్పటి నుంచీ లక్ష్మికి మంటగానే ఉంది. ఎప్పటికైనా ఆయనలాగా తాను పడుకుని, ఆయన తనలాగే తనపాదాల వద్ద కూర్చుని మర్దిస్తూ బావుణ్ణు అనే కోరిక మదిని తొలిచేస్తున్నది. కానీ అందుకు అవకాశం రావాలి కదా! ఎప్పుడూ రచయితలాగా పరధాన్యంలోనే ఉంటాడయె పతి 'దేవుడు'.

నారదుడు లక్ష్మిపక్కన చేరి చెవిలో జోరిగలా నసపెడుతున్నాడు. 'ఎలాగైనా పతి, చేత సేవ చేయించుకో' అని సైగలతోనే రెచ్చగొడు తున్నాడు. ఇక ఆగలేక పోయింది లక్ష్మీదేవి.

"నాథా".. మెల్లగా పిలిచింది.

స్వామి మాట్లాడలేదు.

"ప్రాణేశ్వరా" మళ్ళీ పిలిచింది.

స్వామికి మెలకువ రాలేదు.

"హే... లక్ష్మీ నారాయణ స్వామీ" గట్టిగా పిలిచింది.

ఉలికిపడి నిద్రలేచాడు నారాయణుడు.



నాకు తెలిసిన వారబ్బాయి పేరు అహి ప్రమోదు. ఎప్పుడు చూసిన సీరియస్‌గా ఏదోకటి రాసుకుంటుంటాడు. వాడిని పిలవాలంటే ముందుగా 'అహీ' అనిముద్దుగా పిలుస్తుంది వాళ్ళమ్మా. వాడు పలకడు. 'ప్రమోదూ' అని రెండవ సారి కూడా ముద్దుగానే పిలుస్తుంది. వాడు మొద్దులాగే పలకడు. "ఒరే వెధవా.. ఏం చేస్తున్నావురా గాడిదా' అని మూడవసారి కోపంగా పిలిస్తే 'ఏంటి మమ్మీ' అంటాడు అప్పుడే మొదటి సారి విన్నట్లు. అందువల్ల వాడు కూడా నారాయణాంశ సంభూతుడా అనిపిస్తూంటుంది నాకు ఒక్కోసారి.

"ఏమి దేవీ?" అన్నాడు నారాయణుడు లక్ష్మిని క్రీగంట చూసి.

"సరదాగా అడుగు తున్నాను. ఇప్పుడు మనం ఉన్న స్థితిని తారుమారు చేస్తే ఎలా ఉంటుంది?" అడిగింది లక్ష్మి.

ఆలి అభిమతం అర్థమైంది అరవిందలోచనుడికి. ఒక్కసారి కళ్ళు మూసుకుని ఆలోచించాడు. లక్ష్మీదేవి విలాసంగా పడుకుని ఉంటే తాను ఆమె పాదాల వద్ద కూర్చుని పాదసేవ చేస్తున్న దృశ్యం సాక్షాత్కరించింది. మధుసూదనుడు దొంగ నవ్వు నవ్వాడు. భార్య అభిమతాన్ని ఏదోరకంగా తీర్చాలి కదా... భర్తన్న తరువాత! "నా ప్రాణ దీపమా! నీ సరదా తీర్చడమే నా సరదా. తథాస్తు" అన్నాడు.



అంతే! శేషసాయి పటం గిర్రున తిరిగి ఆగింది. ఆగేసరికి కనిపించిన దేంటి? పడగ క్రింద తలపెట్టిపడుకున్న స్వామి శేషుడి తోకవైపు పడుకుని ఉన్నాడు. శేషుడితోక వద్ద కూర్చుని పాద సేవ చేసే లక్ష్మి పడగ నీడలో కూర్చుని స్వామి పాదాల వద్దే కూర్చుని ఉంది. ఆమె కోరినట్లు గానే పరిస్థితి తారుమారైంది. ఎవరి స్థితి మాత్రం వారికే ఉంది. ఔరా! పెళ్ళాలకు మాయ మాటలు చెప్పి మోనం చేయడంలో మనుషులు, దేవుడు ఒక్కటే. అంతా దేవుడు చేసిన మనుషులు! మనుషులు చేసిన దేవుడు!! మగాడి మనస్సు మర్త్యలోకంలో అయినా, అమర్త్యంలోకంలో అయినా ఒకటే బుద్ధితో ఉంటుంది.



లక్ష్మీదేవి దిగ్భ్రాంతి చెందింది. తన కోరిక తీర్చాడు స్వామి. కానీ తన ముచ్చట మాత్రం తీరలేదు. ఇంకే మనగలదు? అంతా ఖర్మ అనుకుని తలబాదుకుంది. అది చూసి స్వామి నవ్వుకుని మళ్ళీ యోగనిద్రలో మునిగిపోయాడు.

* * *

ఆఫీసుకు వెళ్ళడానికి రెడీ అయింది ఝూన్సీ. భర్తకు వంటచెయ్యడం ఎలాగో నేర్పిస్తున్నది. వంట సంగతి తరువాత, అసలు స్టౌ వెలిగించడం ఎలాగో తెలిస్తే గదా మన 'మగానుబావుడికి?' ఆరోజుకు వంట చేసేసింది. "ఇటేపు కాఫీ టిఫిను సరంజామా, అటేపు భోజనం. ఇంకోసారి కాఫీ కాచుకోవాలంటే ఈ స్టౌ... వెలిగించడం తెలుసుగా" అన్నది ఝూన్సీ మరోసారి కన్ఫర్మ్ చేసుకుందామని. బాలాజీ నవ్వాడు.

"తెలుసు" అన్నాడు బాలాజీ యమా కేర్‌లెస్‌గా "సాయ్‌లెన్స్, ఈ న్టవ్వులూ గివ్వులూ కనిపెట్టింది వేమము. వాడుకుని సుఖపడేది మీ ఆడంగులు. మాకే పాఠాలు నేర్పుతావా? సింపుల్ థింగ్స్. ఆ బటన్ కుడి పక్కకు తిప్పితే వెలుగుతుంది. ఎడమ పక్కకు తిప్పితే ఆరుతుంది. సెంటరయితే మండుతుంది" అన్నాడు.



"కాదు మహాప్రభో.. కుడిపక్కకు తిప్పితే..." చెప్పబోయింది. "ఆగలాగ.. తెలుసు.. ఆన్ అవుతుంది. సెంటరుకు తిప్పితే ఆరుతుంది." అని సెంటరులో పెట్టాడు. నాబ్‌ను. గుప్పున మంట వచ్చింది. 'అమ్మో' అని వెనక్కు జరిగాడు బాలాజీ.

"ఎవడో ఎడం చేతివాటంగాడు కనిపెట్టినట్టున్నాడు" అన్నాడు ఆడలేక మద్దెల ఓడు అన్నట్లు.

గభాల్న స్టౌ ఆపేసింది ఝాన్సీ. "ఎవడో ఒకడు లెండి. మీకు పుణ్యం ఉంటుంది. చూసుకోకుండా ఎడంవైపు ఆఫ్ అనుకుని వదిలేస్తే ఇల్లంతా గ్యాస్‌లీకై..." చెప్పింది.



"ఓకే.. ఓకే.. పద. నీకు టైమవుతుంది. యువరిల్లు విల్ బి ఇన్ సేఫ్ హ్యాండ్స్." అన్నాడు సరదాగా.

"కూరా పులుసూ రాత్రికి కూడా సరిపోతాయి. సాయంత్రం వేడిగా అన్నం వండుకుంటే చాలు. నేను రాగానే చేస్తానూ!?." అన్నది ఝాన్సీ బయలు దేరుతూ.

"వాట్.. అంటే.. పొద్దుటి పాచి కూరా, పులుసు రాత్రికి తినాలా? ఏం ఖర్మ? నేను చెయ్యలేననుకున్నావా?"

"అనుకోలేదు. అనలేదు. నేను చేస్తానన్నాను. అంతే" బయటకు నడిచింది ఝాన్సీ.



భార్యను పట్టుకుని ఆపి" అంటే ..... ఆ మహా ఇల్లాలు ఆఫీసుకెళ్ళి గడించుకు రావడమే కాదు- రెండు పూటలా వండి వారుస్తుంటే- ఆ మొగుడు దున్నపోతులా తిని కూచోడమే అని చాటాలనా? ఆఁ... నేనీ వంట తినను. పారేసి మళ్ళీ వండుకుంటా." అన్నాడు.

"వండండి బాబూ.. వండండి. నాకు టైమయింది. నేను చీర కట్టుకోవాలి." గదిలోకి వెళ్ళింది.

"అంటే.. ఇప్పుడు విప్పుకున్నట్లా? హె..హె..హె.." వెకిలిగా నవ్వాడు బాలాజీ.

వెళ్ళబోతున్న ఝాన్సీ చురచుర చూసింది.

*****

బాలాజీ ఇల్లు. ఇంట్లో వంటిల్లు. వంటింట్లో భార్య ముందు బాలాజీ. రెండు చేతుల్లో గరిటెలు పట్టుకుని వంట చెయ్యడంలో తాను నలభీములకు ఏవిధంగా తమ్ముడినో భార్యకు వివరిస్తున్నాడు బాలాజీ. ఆఫీసుకు వెళ్ళడానికి తయారౌతున్నది ఝాన్సీ.

వాకిట్లో కారు ఆగిన శబ్దం వినిపించింది. పిల్లలు గబగబ బయటకు పరిగెత్తుకొచ్చారు. తమ వాకిలిముందు ఎస్టీమ్ కారు ఆగి ఉంది. డ్రైవర్ గుమ్మం ముందుకొచ్చి "మేడమ్ ఝాన్సీ కా ఘర్ యహీహై?" అని అడిగాడు హిందీలో. అతని భాష అర్థం కాక పిల్లలు ఇంట్లోకి వెళ్ళబోతుండగా బాలాజీ బయటకొచ్చాడు. చేతుల్లో కవ్వం, పట్టకారు అలాగే ఉన్నాయి.



"యస్.. దీసీజ్ మిస్టర్ బాలాజీ. మేడమ్స్ హజ్బెండ్. అండ్ దీజ్ ఆర్ ది టూ చిల్డ్రన్. మేడమ్ రావడానికింకా టైమ్ పడుతుంది. తుమ్‌జావ్ అండ్ వెయిట్. జావ్" అన్నాడు బాలాజీ.

డ్రైవర్ ఆశ్చర్యపోయాడు బాలాజీ తీరును చూసి. కారు వద్దకు వెళ్ళి బ్యాక్ డోర్ తీశాడు. ఫుల్ సూట్‌లో హుందాగా ఉన్న గోపాల్ దిగాడు.

"హలో...నమస్కారమండీ" అన్నాడు నవ్వుతూ.

"హలో... హలో... కమిన్... వెల్కమ్... అఁ... పిల్లలూ... ఆఫీసంకుల్‌కు గడ్మాణింగ్ చెప్పండి" అన్నాడు బాలాజీ నవ్వు పులుముకుని.



పిల్లలు భయపడి 'అమ్మా' అని అరుస్తూ లోపలకు పరిగెత్తారు.

"రండి...కమాన్ ... ఐ లైక్ యూ బికాజ్... మీరూ నాలాగే లేడీస్ మైండున్నవారు. నేను మా యావిణ్ణి "వెళ్ళు... పనిచెయ్" అని ఇలా పర్మిషనిచ్చాను. మీరు అలా లపీమని 'రా.. పనిచెయ్' అని ఛాన్సిచ్చారు. వండర్‌ఫుల్" నవ్వుతూ అన్నాడు బాలాజీ.

గోపాల్ కూడా నవ్వుతూ "వండర్ ఫుల్లేంటండీ? ఫెంటాస్టిక్" అన్నాడు.

అతని విచిత్రమైన నత్తి మాటలకు నవ్వొస్తున్నది బాలాజీకి"నా ఉద్దేశ్యంలో ఆడవాళ్లూ మనుషులే. మొగాళ్లతో తమానంగా." అన్నాడు గోపాల్.

ఎవరో పిల్చినట్లుగా బయటకు వెళ్ళాడు బాలాజీ.

"సారీ... రాలేనండీ. ఖాళీ ఉండదు. యూ నో హౌ బిజీ అయామ్ సారీ ఏవనుకోకండేం..." అంటూ తానేదో బిజీగా ఉన్నట్లు గోపాల్‌కు కనిపించాలని అక్కడే ఒక నిముషం పాటు తచ్చాడాడు. మళ్ళీ లోపలకు వెళ్ళాడు. గోపాల్ పక్కన కూర్చున్నాడు. చేతుల్లో గరిటెలు మాత్రం అలాగే ఉన్నాయి.



"నేను పెళ్ళైనప్పటినుంచీ మొత్తుకుంటున్నానండీ. మీ ఆడవాళ్ళూ మనుషులే. వంటింటి కుందేళ్ళలా ఉండకూడదు. టాలెంట్ పొగచూరి పోగూడదు. బైటికెళ్ళి ఉద్యోగం చేసి ప్రూవ్ చేసుకోవాలి అని పోరగా పోరగా ఇన్నాళ్ళకు ధైర్యం చేసిందండీ" గ్యాస్ కొట్టాడు.

లోపల్నుంచి వింటూ నవ్వుకుంటున్నది ఝాన్సీ. గోపాల్‌కు మరింత దగ్గరగా జరిగాడు బాలాజీ.

"ఇహ నేనంటారా... వెధవది సెలవులు మురిగిపోతున్నాయి. నాకా... కళలంటే ప్రాణం" చెప్పకు పోతున్నాడు.



"యూ ఆర్ రైట్.... కలలు! డ్రీమ్స్! అనే సబ్జెక్టు మీద కాలేజీలో నేను రీసెర్చి చేశాను. దాంతో..." చెబుతున్నాడు గోపాల్.

గోపాల్ మాటలకు నవ్వొచ్చింది ఝాన్సీకి. "కలలు కాదండీ గోపాల్‌గారూ... క..ళ..లు.. ఫైనార్ట్స్" గదిలోంచే కేకేసింది.

గోపాల్‌కు తన పొరబాటు అర్థమైంది. "నన్ను గారూ అనకు ఝాన్సీ. నువ్వు అను. నాకు అదో తుత్తి" అన్నాడు.

ఆ చనువు సంభాషణకు బాలాజీకి కోపం వచ్చింది. అయినా పైకి కనిపించనీయలేదు. మామూలు సంభాషణ కొనసాగించాడు.

"అదన్నమాట. డిగ్రీలు ఎన్నున్నా నాకు పెయింటింగ్, రైటింగ్, యాక్టింగ్, లాంటి కళా పోషణలంటే ... ఎంతో తుత్తి" అన్నాడు గోపాల్ లాగానే నత్తిగా.



అది కావాలని మాట్లాడింది కాదు. కొంతమంది వ్యక్తులతో కొంచెంసేపు మాట్లాడితే మనకూ వాళ్ల లాగే మాటలు వస్తాయి .

చేతుల్లో ఉన్న కవ్వం, పట్టకారు కోలాటంలా కొడుతూ "కుకింగంటే ఎంతో సరదా. నిన్న... పదినిముషాలలో ప్రూవ్ చేసి చూపించా మాయావిడకి...." అన్నాడు నవ్వుతూ.

-(ఇంకావుంది)

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

చిత్రం : కాశ్మీర్ కీ కలీ
రచన : యస్.ఎచ్.బిహారీ
సంగీతం : ఓ.పి.నయ్యర్
గానం : మహమ్మద్ రఫీ, ఆశాభోంస్లే
అభినయం : షమ్మీ కపూర్, షర్మిలా టాగోర్

## ఇషారోఁ ఇషారోఁ మేఁ'








అ: ఓ.... ఆ....

ఆ: హాయె.... ఇషారోఁ ఇషారోఁ మేఁ దిల్ లేనే వాలే
బతా యే హునర్ తూనే సీఖా కహాఁ సే

అ: నిగాహోఁ నిగాహోఁ మేఁ జాదూ చలానా
మేరీ జాన్ సీఖా హై తుమ్‌నే జహాఁ సే

అ: ఓ మేరే దిల్ కో తుమ్ భాగయే, మేరీ క్యా థీ ఇస్ మేఁ ఖతా
ముఝే జిస్‌నే తడ్‌పా దియా యహీ థీ వో జాలిమ్ అదా, యహీ థీ వో జాలిమ్ అదా
యే రాంఝూ కీ బాతేఁ, యే మజ్నూకే కిస్సే

అలగ్ తో నహీఁ హై మేరీ దాస్తాఁసే ఆ: ॥ఇషారోఁ॥

ఆ: హో ముహబ్బత్ జో కర్‌తే హైఁ వో ముహబ్బత్ జతాతే నహీఁ
ధడ్‌కనేఁ అప్‌నే దిల్ కీ కభీ కిసీకో సునాతే నహీఁ, కిసీకో సునాతే నహీఁ
మజా క్యా రహా జబ్ కి ఖుద్ కర్ దియా హో
ముహబ్బత్ కా ఇజ్‌హార్ అప్‌నీ జుబాఁ సే ఆ: ॥నిగాహోఁ॥

అ: హో మానా కి జానే జహాఁ లాఖోఁ మేఁ తుమ్ ఏక్ హో
హమారీ నిగాహోఁ కీ భీ కుఛ్ తో మగర్ దాద్‌దో, కుఛ్ తో మగర్ దాద్ దో
బహారోఁ కో భీ నాజ్ జిస్ ఫూల్ పర్ థా
వహీ ఫూల్ హమ్‌నే చునా గుల్‌సితాఁ సే ఆ: ॥ఇషారోఁ॥

## దీవానా హువా బాదల్








అ: (ఒహొహో అ హ హా ఆ హ హా మ్ మ్ మ్.... అ హ హా
యే దేఖ్‌కే దిల్ ఝూమా లీ ప్యార్ నే అంగ్‌డాయీ)
దీవానా హువా బాదల్, సావన్ కీ ఘటా ఛాయీ
యే దేఖ్‌కే దిల్ ఝూమా లీ ప్యార్ నే అంగ్‌డాయీ ॥దీవానా హువా॥

అ: ఐసీ తో మేరీ తక్‌దీర్ న థీ, తుమ్‌సా జో కోయీ మెహబూబ్ మిలే
దిల్ ఆజ్ ఖుషీ సే పాగల్ హై (2)
యే జానేవఫా తుమ్ ఖూబ్ మిలే (2)
దిల్ క్యోఁ న బనే పాగల్, యాదోఁ నే అదా పాయీ ॥యే దేఖ్‌కే॥ ॥దీవానా హువా॥

ఆ: జబ్ తుమ్‌సే నజర్ టక్‌రాయీ సనమ్ జబ్‌బాత్ కా ఎక్ తూఫాన్ ఉఠా
తిన్‌కే కీ తరహ్ మైఁ బహ్ నిఖ్‌లీ (2)
సైలాబ్ మెరే రోకే న రుకా (2)
జీవన్ మేఁ మచీ హల్‌చల్, ఔర్ బజ్‌నే లగీ శహనాయీ ॥యే దేఖ్‌కే॥ ॥దీవానా హువా॥

అ: హై ఆజ్ మేరే అర్‌మానోఁ సే ఆబాద్ మేరీ దిల్ కీ నగ్‌రీ
బర్‌సోఁ సే ఫిజా మౌసమ్ థా (2)
వీరాన్ బడీ దునియా థీ మెరీ (2)
హాథో మేఁ తెరా ఆఁచల్ ఆయా కి బహార్ ఆయీ ॥యే దేఖ్‌కే॥ ॥దీవానా హువా॥

ఓ.పి.నయ్యర్ సంగీతాన్ని ఇన్ఇమిటబుల్ అని అంటూ ఉంటారు. అంటే ఎవరూ అనుకరించను కూడా సాధ్యం కానిదని. అంతటి విలక్షణ శైలి ఆయనది. ఆయనతో చక్కని కాంబినేషన్ ఏర్పరచుకున్న గీత రచయిత యస్.ఎచ్.బిహారీ. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన 'కాశ్మీర్ కీ కలీ'లో ప్రతి పాటా సూపర్ హిట్టే. ఈ పాటలో షమ్మీకపూర్, షర్మిలా టాగోర్‌ల అభినయం అదనపు ఆకర్షణ.

'ఇషారోఁ ఇషారోఁ మేఁ' పాట చిలిపితనం, గడుసుతనం కలగలిసిన పాట. చెప్పకనే చెప్పుకునే భావాలు, 'నన్ను ప్రేమలోకి దింపింది నువ్వే' అని చెప్పీ చెప్పని ఊసులు ఈ పాట సోయగాలు. ఈ పాట సంగీతంలోని విశేషాలను 'హాసం' 32వ సంచికలో వివరించటం జరిగింది. ఇక్కడ సాహిత్యంలో విశేషాలు చూద్దాం.



ఇషారే అంటూ సైగలు. హునర్ అంటే సామర్థ్యం, ప్రతిభ. విద్య అని కూడా అనుకోవచ్చు. సీఖ్‌నా అంటే నేర్వటం. నిగాహేఁ అంటే చూపులు. జాదూ అంటే మాయ. 'ఇషారోఁ ఇషారోఁ' అనే పునరుక్తి 'కేవలం' అనే భావం స్ఫురింపచేయటానికి వాడారు. 'కేవలం సైగలతో' అని భావం. అలాగే 'నిగాహోఁ నిగాహోఁ'.

**ఆ: 'సైగలతో మది దోచే వాడా**
**ఈ విద్య ఎక్కడ నేర్చావో తెలుపుమా'**
**అ: 'చూపులతోనే మాయ చేయటం**
**నీవెక్కడ నేర్చావో అక్కడే ప్రియా'**



'సైగలతోనే నా మనసు దోచావ'ని ఆమె అతనికి నేరుగా చెప్పటం లేదు. అంతా అతని తప్పే అయినట్టు ఈ విద్యలు ఎక్కడ నేర్చావు అని అడుగుతూంది. అతను మాత్రం తక్కువ వాడా? 'చూపులతో మాయ చేయటం నీవెక్కడ నేర్చావో నేనూ నా విద్యలు అక్కడే నేర్చాను' అని బదులిచ్చాడు. మొత్తానికి వారిద్దరూ ప్రేమలో పడి ఒకరినొకరు చిలిపిగా, గడుసుగా ఆటపట్టిస్తున్నారు.

భాగయా అంటే నచ్చింది. ఖతా అంటే తప్పు. తడ్‌పానా అంటే ఉక్కిరిబిక్కిరి చేయటం. జాలిమ్ అంటే చెడ్డది. అదా అంటే వయ్యారము, సొగసు. 'జాలిమ్ అదా' అంటే 'మాచెడ్డ సొగసు' అని చెప్పుకోవచ్చు. రాంఝా అంటే హీర్ రాంఝా అనే ప్రేమికుల జంటలో ప్రియుడు. కిస్సా అంటే కథ, దాస్తాఁ అన్నా కథే.



**అ: 'నా మనసుకు నువ్వు నచ్చావు, ఇందులో నా తప్పేముంది?**
**నను ఉక్కిరిబిక్కిరి చేసినది ఈ సొగసే కదా**
**రాంఝా కథలు, మజ్నూ గాథలు నా కథలాగే ఉంటాయిలే'**

'నాకు నువ్వు నచ్చావంటే దానికి కారణం నీ మాయదారి సొగసే' అని అంటున్నాడతను. తన తప్పేమీ లేదట. ఆమె సొగసు చూసి ఉక్కిరి బిక్కిరై మనసు పారేసుకున్నాడట. 'బ్రహ్మకైన పుట్టు రిమ్మ తెగులు' అన్నట్టుంటుంది. రాంఝా, మజ్నూ వంటి ప్రేమికులు కూడా తనలాగే విధిలేక ప్రేమలో పడ్డారట. ఎంత తమాషాగా రాశారో కదా అనిపిస్తుంది.

ముహబ్బత్ అంటే ప్రేమ. జతానా అంటే బాహాటంగా చూపించటం. ధడ్‌కన్ అంటే గుండె చప్పుడు. ఇజ్‌హార్ అంటే వ్యక్తీకరణ. జుబాఁ అంటే నాలుక.



**ఆ: ప్రేమలో పడినవారు ప్రేమను నలుగురిలో చూపరు**
**గుండె చేసే సవ్వడి ఎవరి చెవినా వేయరు**
**మజా ఏమంటుంది స్వయంగా తమ నోటితో ప్రేమ చాటితే'**

స్త్రీ సహజమైన సిగ్గు ఇక్కడ నాయిక మాటల్లో ధ్వనిస్తుంది. ప్రేమను బాహాటంగా ప్రదర్శించకుండా మనసూ మనసూ ఊసులాడుకోవాలని ఆమె ఆశ. 'ప్రేమను మాటల్లో చెప్పుకుంటే మజా ఏముంటుంది? చెప్పీ చెప్పనట్టుంటేనే అందం' అని ఆమె భావం. ఇలా అంటూనే ఆమె తన ప్రేమను చెప్పకనే చెబుతోంది చూశారా?

'లాఖోఁ మేఁ ఏక్' అంటే 'లక్షల్లో ఒకరు' అని. తెలుగులో 'నూటికో కోటికో ఒక్కరు' అనే ప్రయోగం లాంటిది. 'దాద్ దేనా' అంటే ప్రశంసించటం. బహార్ అంటే వసంతం. నాజ్ అంటే గర్వం. ఫూల్ అంటే పువ్వు. గుల్‌సితాఁ అంటే తోట.



**అ: 'ఒప్పుకున్నాను ఓ నా ప్రియా నీకు సాటి లేనే లేదని**
**కానీ ఏరి ఏరి నిన్ను కోరిన నా ఘనత కూడా ఒప్పుకో**
**వసంతాలు కూడా చూసి గర్వపడే పూవును**
**ఎంచుకున్నాను తోట నుంచి'**

ఆమెది అరుదైన అందమని అతనికి తెలుసు. కానీ ఆమెను ఎంచుకున్న తన నిశితదృష్టి కూడా ప్రశంసార్హమే అని స్వోత్కర్ష చేసుకుంటున్నాడు. 'నిన్ను ఎంచుకున్నందుకు నన్ను







మెచ్చుకోవాలి సుమా!' అనే భావం అద్భుతం. వసంతం గర్వపడే పువ్వును ఎంచుకున్నాడతను. ప్రేయసి అందానికి ఇంతకన్న ఉపమానం ఏముంటుంది?

****

'దీవానా హువా బాదల్' ఓ చక్కని ప్రేమగీతం. ప్రేయసీ ప్రియులు అవ్యాజ ప్రేమను తెలిపే పాట. మబ్బుకి ప్రేమ పిచ్చి పడితే అది శ్రావణమేఘమైందట. అది చూసి మనసు పురివిప్పిందట.

దీవానా అంటే ప్రేమ పిచ్చివాడు. బాదల్ అంటే మబ్బు. సావన్‌కీ ఘటా అంటే శ్రావణ మేఘం. ఝూమ్‌నా అంటే ఊగటం. అంగ్‌డాయీ అంటే మేనివిరుపు.

**అ: మబ్బుకి ప్రేమ సోకింది, శ్రావణమేఘమై కమ్మింది**
**ఇది చూసి మనసూగింది, ప్రేమ మేను విరిచింది'.**

శ్రావణమేఘానికి ఎంత చక్కని నిర్వచనం చెప్పారో చూడండి. మబ్బుకి ప్రేమ సోకితే శ్రావణమేఘం. అందుకే కదా వర్షించి హర్షం కలిగిస్తుంది. ఆ శ్రావణమేఘాన్ని చూసి మనసు అనే నెమలి పురి విప్పి ఆడింది. దానితో మనసులో ప్రేమ ఒళ్ళు విరుచుకొని నిద్రలేచింది. ప్రేమోదయాన్ని ఎంతో భావస్ఫోరకంగా చెప్పారు.

**'నీవంటి ప్రేయసి దొరికేటంత భాగ్యం నాకు లేదనుకున్నానే**
**మనసు ఆనందంతో పిచ్చిదయింది, ప్రియా, నీవు భలే దొరికావులే**
**మనసు పిచ్చిదవదూ మరి? ఊహలకు సొగసు అమరింది'**

అని అతడు తన భాగ్యాన్ని తానే నమ్మలేకపోతున్నాడు. తన ఊహలకు ఆమె సొగసు అద్దిందని మైమరచిపోతున్నాడు. ఆమె తన భావోద్వేగాన్ని ఇలా చెబుతోంది.

**'నీతో చూపులు కలవగానే భావాల ఉప్పెన ఎగసింది**
**ఆ ప్రవాహంలో కొట్టుకుపోయాను, ఆ వరద ఆపినా ఆగలేదు**
**బ్రతుకున అలజడి రేగింది, మదిలో సన్నాయి మోగింది'**

అతన్ని చూసిన క్షణమే ఆమెలో ప్రేమ భావాలు మొలకెత్తాయి. ఆ అలజడి ఆపినా ఆగలేదు. మదిలో సన్నాయి రాగాలు కూడా వినిపించాయి. అంటే అతనితోనే జీవితం పంచుకోవాలని ఆమె కోరిక. అతని జీవితంలో ఆమె రాకతోనే వసంతం వచ్చిందని అతనిలా అంటున్నాడు.

**'నా హృదయనగరు ఆశలతో నిండిపోయింది నేడు**
**ఇన్నాళ్ళూ ఉన్నది శిశిరమే, నా లోకమంతా ఎడారే**
**నీ చెంగు నా చేతికి అందినంతనే వసంతం వచ్చింది చూడు'**

ఇన్నాళ్ళూ మోడుబారి ఎడారిలా అనిపించిన జీవితం ఆమె రాకతో కొత్త చిగుళ్ళు తొడిగి పూలు పూసింది.

ఓ.పి.నయ్యర్ శైలికి ఆశాభోంస్లే గళమే సరిపోతుందని ఆయన అన్న మాటలను అక్షరసత్యం చేశాయి ఈ పాటలు. ఇక మహమ్మద్ రఫీ అయితే షమ్మీకపూర్ గళమే కదా! అతని ప్రతి కదలికనూ ముందే ఊహించి పాడేవారు రఫీ. వారిద్దరిదీ అలౌకిక అనుబంధమే అనాలి.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

# అంతేరా... బామ్మర్ది

ఆదివిష్ణు



జరిగిన కథ



భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణు ఉద్యోగాల వేటలో ఉండగా అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్ వల్ల ప్రమాదం రావడం గురించి పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి తన్ని కలవడానికి వచ్చిన రంగనాధాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. బావగారి పేరు చెప్పకుండా బసవరాజు వద్దకు ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళ్లి ఉద్యోగం సంపాదిస్తాడు. తనకు జరిగిన అవమానానికి ఉగ్రుడైన రంగనాథం ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. అసిస్టెంట్ పాణి చదివి వినిపించే వార్తల వల్ల కొడుకు, కోడలను విషప్రయోగం చేస్తారని నమ్మి అవమానించడంతో వారు ఇల్లు వదిలి వెళ్లిపోతారు.

బసవరాజు రోగం కుదర్చాలని వేణు ఓ రష్యన్ పేపర్ తీసుకువచ్చి అసిస్టెంటుల గురించి క్రైమ్ వార్తలు వినిపిస్తాడు. దాంతో బసవరాజు తన అసిస్టెంట్ పాణిని ఉద్యోగంలోనుండి తీసివేస్తాడు . ఈ లోగా ఇంట్లో అందరూ బసవరాజు లాగే తామూ పేపరు వార్తలు నమ్మి ఇతరులను అనుమానిస్తున్నట్లు నటిస్తుంటారు.

-(ఇక చదవండి)

బసవరాజు తన కుమార్తె ప్రవర్తనకు షాకు తిన్నాడు!

అమె గది తలుపు తడుతూ ఎంతో ఆప్యాయంగా పిలుస్తున్నాడు

"అమ్మా! ఉమా! నేనమ్మా! మీ నాన్నని! తలుపు తియ్యమ్మా! ఎందుకంత భయం? తలుపుతియ్యమ్మా! అమ్మడూ!"

అప్పటికే - వేణు నేలమీద పడ్డ నవలను తీసి పరీక్షించేడు!

ఆ పని పూర్తయింతర్వాత బసవరాజుతో తాపీగా అంటున్నాడు -

"ఉమ తలుపు తియ్యదు!"

బసవరాజు గబగబా వేణు దగ్గరకొచ్చి అడిగేడు-

"ఎందుచేత? ఎంచేత తియ్యదు! కారణం? అచ్చెప్పు నాకు!"

బసవరాజుకి నవల చూపిస్తూ వేణు అన్నాడు -

"ఇదొక నవల!"

"అదేమిటని అడగలేదు నేను! ఉమ తలుపెందుకు తియ్యదు? అచ్చెప్పు నాకు! కన్నతండ్రిని - నన్ను చూచి ఎందుకు భయపడి పారిపోయింది! అది కూడా చెప్పు!"

"ఉమ ఈ నవల చదివింది"

"మళ్లా నవలంటావేమిటి? నవలకీ ఉమ పిచ్చి చేష్టలకీ - "

"లింకుంది! ఆశ్చర్యపోకండి! కేవలం ఈ నవల చదివిన కారణంగానే ఉమ పిచ్చిపిచ్చిగా వ్యవహరిస్తోంది!"

"మిస్టర్ వేణూ!"

"అరవకండి! ఏదో చదివి ఏదో విని తిక్కతిక్కగా ప్రవర్తించడం మీ ఒక్కరి ప్రత్యేకతే అనుకుని మురిసిపోకండి! మీ అమ్మాయి ప్రవర్తనకి ఈ నవల్లో కథావస్తువే మూలకారణం! ఆ కథ అల్లాంటిది!"

"ఎల్లాంటిది? అచ్చెప్పునాకు!"

"ఒక తండ్రి - డబ్బుకి ఆశపడి - కన్న కూతుర్ని - ఒక లేత వయస్సు పిల్లని - వయస్సు ముదిరిన మనిషికిచ్చి పెళ్లి చేస్తాడు!"

"చేస్తాడయ్యా! ఏమైనా చేస్తాడు! అది కథ. కథ కోసం దిక్కుమాలిన పనులు అనేకం చేస్తాడు!"

"మీరు కూడా ఆ పనే చేస్తారనే భయంతో, ఆందోళనతో - మిమ్మల్ని చూడగానే కెవ్వున అరిచి తన గదిలోకి పారిపోయింది!"

"ఏమిటేమిటీ? నేను కూడా ఉమకి అల్లాంటి పెళ్లి చేస్తానని భయపడిందా?" అని తలుపు దగ్గిరికి వెళ్లి అరుస్తున్నాడు -

"అమ్మా! ఉమా! నువ్వు చదివిన నవల ఉత్త చెత్తమ్మా! చెత్త నవల చదివేవ్! నీ తండ్రి ఆ తండ్రిలాంటివాడు కాదు! కాలేదు! ఒక లక్షణమైన కుర్రాడితో నీ పెళ్లి నేను ఘనంగా చేస్తానమ్మా!"

వేణు బసవరాజుకి సైగచేసేడు - తన దగ్గిరికి రమ్మన్నట్టు!

బసవరాజు గంగిరెద్దు మాదిరి గబగబా వేణు దగ్గిరికి నడిచేడు!

"పాత చింతకాయ పద్ధతుల్లో పని జరగదు! ప్రతి తండ్రీ చెప్పే డైలాగులే మీరు కూడా చెబుతున్నారు! ఈ డైలాగులు ఓదార్చడానికి నూటవుతాయే గాని - తలుపు తీయడానికి సహకరించవు!"

"ఎల్లాంటి డైలాగులు చెప్పమంటావ్?"

"కేవలం డైలాగులే కాదు! ఆ డైలాగుల్లో హామీలు కూడా వినిపించాలి!"

"అదేనయ్యా! ఆ వరసే చెప్పమంటున్నా!"

"నే చెప్పినట్టు చెప్పడం మీకు వీలుకాదేమో!"

"అవుతుంది!"

"అక్షరం పొల్లు పోకుండా చెప్పాలి!"

"ఇన్ని షరతులేమిటయ్యా బాబూ?"

"లేకపోతే ఉమ తలుపుతియ్యదు! ఆ నవల్లో కథ వస్తువు అల్లాంటిది! దాని ప్రభావంతో ఉమ మెదడు చెడిపోయింది! మీరు ఆలిస్యం చేస్తే - తలుపులు మూసివున్న ఆ గదిలో ఉమ ఏదైనా అఘాయిత్యం చేసుకోవచ్చు!"

"వేణూ!"

వేణు ఒక కాగితం తీసి బసవరాజు చేతిలో పెట్టేడు! అందులో ఏదో రాసి వుంది! రాసిన వాక్యాలు చదవకుండా అడిగేడు బసవరాజు -

"ఏమిటిది?"

"మీరు చెప్పవలసిన డైలాగులు!"

"ఎప్పుడు రాసేవు?"

"మొన్న రాసేను!"

"ఇల్లాంటి సందర్భం వస్తుందని నీకు మొన్నే తెలుసా?"

"ఖచ్చితంగా వస్తుందని తెలీదు! వచ్చే ఛాన్సుందని ఊహించేను! అందుకే - మీరు చెప్పవలసిన డైలాగులు పకడ్బందీగా తయారు చేసి సిద్ధంగా వుంచుకున్నాను!"

"నీకు ముందు చూపు చాలాఎక్కువ!"

"ముందు మీరు చెప్పవలసిన డైలాగులు చూసుకోండి!"

అని గబగబా ఉమ గదివేపు వెళ్లిపోయేడు!

ఆ గది తలుపు దగ్గిర నిలబడి - ఆ కాగితమ్మీద రాసిన డైలాగులు చదివేందుకు - జేబులోంచి కళ్లజోడు తీసేడు!

* * *






శ్రీ వెంకటేశ్వర స్వామి దేవాలయం!

ఆ ప్రాంగణంలోకి అడుగుపెట్టేడు రంగనాథం!

అక్కడికి రావాలని అతను రాలేదు!

తనకి తెలీకుండానే వచ్చేసేడు!

బహుశా - ఘంటసాల భగవద్గీత వింటూ వచ్చేడు కాబోలు!

తాను వచ్చింతర్వాత భగవద్గీత ఆగిపోయింది!

ఇంత దూరం వచ్చిం తర్వాత - వెంకన్నను చూడకుండా వెళ్లిపోతే తప్పవుతుందనే ఉద్దేశంతో - దైవదర్శనం కోసం గుళ్లోకి అడుగుపెడుతున్నాడు రంగనాథం!

* * *

ఉమ గది ముందు - మూసిన తలుపుల దగ్గర నిలబడి - వేణు యిచ్చిన కాగితంలోని అక్షరాలను శ్రద్ధగా చదువుతున్నాడు బసవరాజు

''అమ్మా ఉమా! తొందరపడి అఘాయిత్యం చేసుకోవద్దు! నువ్వు చదివింది ఒకానొక చెత్త నవల! ఆ నవల్లో తండ్రి - ఒక చెత్త తండ్రి! అతని నిర్ణయం - పరమ చెత్త నిర్ణయం! ఆ మొత్తం చెత్తనంతా చదివి మనసు పాడుచేసుకున్నావు కాబోలు! నీ తండ్రి ఆ తండ్రిలాంటి కసాయివాడు కాదు! కాలేదు! అందుచేత నీ పెళ్లి విషయంలో ఎల్లాంటి ఆందోళనా పడవద్దు! నీ పెళ్లి నీ యిష్ట ప్రకారమే జరుగుతుంది! నువ్వు ప్రేమించిన కుర్రాడితో నీ పెళ్లి చేసేందుకు నేను సిద్ధంగా వున్నాను! ఈ మాట నేను త్రికరణ శుద్ధిగా చెబుతున్నానమ్మా! పంచభూతాల సాక్షిగా చెబుతున్నాను!"




బసవరాజు చదవడం పూర్తిచేసి ఆయాసపడుతుండగా - సడన్‌గా గది తలుపులు తెరుచుకున్నాయి!

ఉమ ఆ గదిలోంచి బయటకు వచ్చి - బసవరాజు పాదాల్ని తాకింది!

చిట్కా పనిచేసినందుకు బసవరాజు ఆనందించేడు!

అందువల్ల -

వేణుని క్రీగంట చూస్తో! 'థేంక్స్' అన్నాడు!

* * *

శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయంలో -

రంగనాథం హారతి కళ్లకద్దుకున్నాడు!

పూజారి యిచ్చిన కొబ్బరి చిప్పను తీసుకుని కదిలేడు!

మంటపమ్మీదికొచ్చి - మంటపం అంచున కూచున్నాడు!

కొబ్బరి చిప్పను పగలగొట్టే ప్రయత్నంలో వుండగా - 'నన్ను క్షమించరా సింగినాదం' అని వినిపించింది!

రంగనాథం ఉలికిపడ్డాడు!

ఆ శబ్దం ఎక్కడ్నించి వచ్చిందో తెలీక -

కొబ్బరిచిప్ప వేపు క్షణం పాటు చూచి - దాన్ని చెవి దగ్గర పెట్టుకున్నాడు!

"క్షమించమని అడిగింది కొబ్బరి చిప్పకాదు! నేను!"

ఆ మాటకి అటూ యిటూ చూస్తుండగా మంటపం మీదికి వస్తున్న బసవరాజు కనిపించేడు!

బసవరాజుని చూడగానే రంగనాథం గబుక్కున లేచి నించున్నాడు!

చేతులు రెండూ ముందుకు చాచి 'బసిపీ' అని ఆత్మీయంగా పిలిచేడు!

"దేవుడ్ని చూద్దామని వచ్చేనురా! ఇక్కడ నువ్వు కనిపిస్తావనుకోలేదు!" అన్నాడు బసవరాజు

"అనుకోకుండా వచ్చేను!"

"అందుకే కలుసుకున్నాం!"

"బావున్నావా?"

''ఏమడుగుతావులే! వార్తలు చదివించుకుని వాతలు పెట్టించుకున్న వాజమ్మగా బతుకున్నాను! నువ్వెట్లా వున్నావ్?"

"చూస్తూ అడుగుతావే? అకస్మాత్తుగా రవుడీ అవతారం ఎత్తి - ప్రాణమిత్రుల ఉసురు పోసుకున్నాను!"

''నువ్వు మంచివాడివేరా? నేనే దుర్మార్గుడిని! రౌడీని! నాకోసం నా ఆఫీసుకి వచ్చిన నిన్ను - ఏదో దిక్కుమాలిన వార్త ప్రభావంతో - బయటకు గెంటించిన పొగరుబోతు రౌడీ వెధవని! నాకు బుద్ధి వచ్చిందిరా సింగినాథం! ఎక్కడో ఏదో జరిగిందనే వార్త చదివి - అదే నాకూ జరుగుతుందనే సిద్ధాంతం పరమ తప్పని తెలుసుకున్నాను!"

''తనకోపమే తనకి శత్రువనే నీతివాక్యానికి నీళ్లొదిలేయడం మహా పాపమని నేను కూడా తెలుసుకున్నానురా!"

''మనం చాలా చాలా తెలుసుకున్నాంరా!"

"అందుకే గుళ్ళో కలుసుకున్నాం!"

"ఒరే సింగినాథం! వెళ్లిపోదాం! వెనక్కి వెళ్లిపోదాం!"

రంగనాథం తన వెనుక చూసుకున్నాడు!

మంటపం అంచున నిలబడినట్టు తెలుసుకుని -

"వద్దురా! బసిపీ! వెనక్కి వెళ్లలేం!"

"నా మాట విను!"

"వెనక్కి వెడితే పడిపోతాంరా!"

"ఫర్లేదు! వెనక్కి పద!"

"ఈ వయస్సులో కిందపడితే మళ్లా లేవలేం!"

"అయినా సరే! పదా వెనక్కి!"

"నా మాట విను! పడితే నడుం విరుగుతుంది! నీ దగ్గిర డబ్బుంది గనక అమెరికాలో వైద్యం చేయించుకుని హాయిగా తిరగ్గలవు! నా దగ్గిర డబ్బులేదు గనక అనకాపల్లి కూడా వెళ్లలేక మంచాన పడతా!"

బసవరాజుకి అనుమానం కలిగి అడిగేడు -

"ఏం మాటాడుతున్నావ్ నువ్వు?"

రంగనాథానిక్కూడా అనుమానం కలిగి "ఏమడుగుతున్నావ్ నువ్వు?"



అన్నాడు
"మళ్లా మన కాలేజీ రోజుల్లోకి అడుగుపెడదామంటున్నాను! నువ్వేం మాటాడుతున్నావ్?"
"మంటపం అంచున నిలబడ్డాం గదా! వెనక్కి వెడితే పడిపోతామని చెబుతున్నా!"
ఆ మాట వినగానే బసవరాజు ఒక స్థంభం దగ్గిరికి వెళ్లి - ఆ స్థంభాన్ని ఆనుకుని అన్నాడు -
"అంతేరా... అంతే! అపార్థం చేసుకోడం నీకు మొదట్నుంచీ అలవాటే!"
అప్పటికే రంగనాధం ఇంకో స్థంభాన్ని వెతుక్కోడం - అక్కడికి గబగబా వెళ్లిపోవడం జరిగింది.
అందుచేత -
అతను కూడా స్థంభాన్ని ఆసరా చేసుకుని అంటున్నాడు -
"అర్థం లేకుండా వాగడం నీకూ అలవాటే!"
ఇంకా ఏమి విసుర్లు చోటు చేసుకుని వుండేవో ఆని - సరిగ్గా అప్పుడే గుళ్లో గంట మోగింది!
ఇంకా మోగుతూనే ఉంది
ఇద్దరూ అటువేపు చూసేరు!
వేణు ఉమ కలిసి జాయింటుగా గంటకొడుతున్నారు!
ఆ పని పూర్తి కాగానే -
ఇద్దరూ జాయింటుగానే ప్రదక్షిణలు ప్రారంభించేరు!
బసవరాజు స్థంభాన్ని విడిచిపెట్టకుండా అంటున్నాడు -
"ఆ అమ్మాయి నా కూతురు! పేరు ఉమ!"
రంగనాధం కూడా స్థంబాన్ని విడిచిపెట్టకుండానే అంటున్నాడు -
"ఆ అబ్బాయి నాకు బామ్మర్ది! పేరు వేణు!"
"మీ బామ్మర్ది చమత్కారి! కాగితంలో రాసింది చదవమంటే చదివేను! దాని ఫలితం గుళ్లో గంట కొట్టడమని ఇప్పుడు తెలుస్తోంది!"
"నువ్వు చెబుతున్నదేమిటో అక్షరం కూడా అర్థం కాలేదు! అందుకే - అర్థం లేకుండా వాగడం నీకు అలవాటేనని ఇంతకు మునుపే అన్నాను!"
బసవరాజు ఏమి చెప్పేవాడోకానీ -
సడన్‌గా పాణి మంటపమెక్కేసి బసవరాజుతో అంటున్నాడు -



ఐడియా : సాయిబాబా, ఏలూరు.

"క్షమించాలి -"
"నువ్వెందుకొచ్చేవ్?" అన్నాడు బసవరాజు
"కన్నడం పేపర్లో మోడరన్ కళ్యాణం గురించి ఒక మంచి వార్త పడింది సార్! ఆ వార్త నా చేత చదివించుకుని - ఆ ప్రకారమే తమ కళ్యాణం కూడా జరగాలని - మిస్ ఉమ, మిస్టర్ వేణు దేవుడ్ని వేడుకోడానికి వచ్చేరు సార్! ఈ వార్త మీ చెవినేద్దామని -"
బసవరాజు రంగనాధంతో అంటున్నాడు -
"విన్నావా? మీ వాడూ మా అమ్మాయీ పెళ్లి చేసుకుంటార్ట!"
"ఆ మాట దేవుడ్తో కాకుండా మనతో చెప్పివుంటే బాగుండేది!"
అంతలో డాక్టర్ మురళి దంపతులు కూడా మంటపమెక్కేరు!
"మీ పెద్దవాళ్ల తరఫున మేము చిన్నవాళ్లం ఒ.కె. అనేసేం!" అన్నాడు డాక్టర్ మురళి!
"పెద్దలూ! పెద్దమనసు చేసుకుని వాళ్ల పెళ్లికి అంగీకరించండి!" అన్నది పద్మ!
చివరికి -
జానకీ అన్నపూర్ణమ్మలు కూడా మంటపమెక్కేసేరు!
"ఆడవాళ్లం! ఇంటికి దీపాల్లాంటి వాళ్లం! వాళ్ల పెళ్లికి మేమిద్దరం అంగీరించేం!" అన్నది జానకి.
"మీ మాదిరి తొందరపడే స్వభావం మాకులేదు! అంచేత మా నిర్ణయం కాదనకండి!" అన్నది అన్నపూర్ణమ్మ.
రంగడు కూడా మంటపమెక్కి అంటున్నాడు -
"అయ్యా! ఊ అనేండయ్యా! ఆళ్ల కారుకి డ్రైవరుగా కొలువు చేసుకుంటా!"
బసవరాజు రంగనాధంలు మొహామొహాలు చూసుకుంటున్నారు!
బసవరాజు రంగనాధంలు మొహామొహాలు చూసుకుంటున్నారు!
మళ్లా గుళ్లో గంటలు వినిపిస్తున్నాయి!
మళ్లా వేణు ఉమలు గంట కొడుతున్నారు!
బసవరాజు భార్యని అడిగేడు -
"ఇంతకీ వాళ్ల పెళ్లి వాళ్లే చేసుకుంటారా? మేము జరిపించాలా? అచ్చెప్పునాకు!"
"మీ అంగీకారంతోనే ముహూర్తం పెట్టుకుందాం!" అన్నది జానకి
రంగనాధం అన్నపూర్ణమ్మతో అంటున్నాడు -
"ముహూర్తాలు పెట్టుకోకుండా - అడ్వాన్సుగా గంటలు కొడుతున్నారంటే - ఇదంతా మీ తమ్ముడి నిర్వాకమని ఈజీగా అర్థమవుతోంది! స్పీడు తగ్గించుకోమని చెప్పు"
"ఎందుకు తగ్గించుకోవాలి? అచ్చెప్పునాకు!" అన్నాడు బసవరాజు!
"అంతేనంటావా?" అన్నాడు రంగనాధం!
"అంతే!" అన్నాడు బసవరాజు!
గుళ్లో వున్న బావమరిదిని ఉద్దేశించి అంటున్నాడు రంగనాధం -
"అంతేరా... బామ్మర్దీ! నీరూటే కరెక్టు!"
ఆ మాటకి అందరూ హాయిగా నవ్వుకుంటున్నారు!
ఇక సెలవు! చిత్తగించగలరు!




**(శుభం)**



# వెన్నెలకంటి మెరుపులు

## వెన్నెలకంటి పద్యాలు

మొగుడిని పెళ్ళాంగొట్టుట
తెగబడి తండ్రిని గురువును తెగలోకువగా
పొగరుగ పిల్లలు దిట్టుట
వెగటగు సినిమాల్లో జూస్తె వెన్నెలకంటీ

## వెన్నెలకంటి పదాలు



గుండెలో కొలువున్న
వెండితెర వేమన్న
ఆత్రేయ గదరన్న
ఓ వెన్నెలమ్మా



ప్రాసతో సి.నా.రె.
రాసెనా అయ్యారె
రసగంగలే జారె
ఓ వెన్నెలమ్మా

టాలీవుడ్డున ఇప్పుడు
బాలీవుడ్ భామలొచ్చి బందీజేసే
లీలలు మాయలు ముక్కున
వేలేసుకు చూడమంటి వెన్నెలకంటీ



పసిడి పలుకుల జలధి
సరస కవితాశరథి
ఆతడే దాశరథి
ఓ వెన్నెలమ్మా



పాటలో వేటూరి
పరవళ్ల గోదారి
అతనిదే రాదారి
ఓ వెన్నెలమ్మా

తలలను నరికే సీనులు
కలలో సైతం చూడగ కలవర పడతాం
అలవోకగ ఫ్యాక్షనిజము
వెలుగుట సినిమాల్లోగంటి వెన్నెలగంటీ

# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
మరియు ఘంటసాల కలర్ ఫోటో

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-13

1. ఘంటసాల, మాధవపెద్ది సత్యం కలిసి పాడిన తొలి చిత్రం?

జ: ..........................

2. వేదా దర్శకత్వంలో ఘంటసాల పాడిన చిత్రం?

జ: ..........................

3. ఒక చిత్రానికి ఘంటసాల సంగీత దర్శకత్వం. కాని నేపథ్య సంగీతం ఎస్.రాజేశ్వరరావు కూర్చారు. ఆ చిత్రం?

జ: ..........................

4. ఒక చిత్రంలో ఘంటసాల ఫోటోకు నటుడు జగ్గయ్య నమస్కరిస్తాడు. ఆ చిత్రం?

జ: ..........................

5. పామర్తి సంగీత దర్శకత్వం వహిస్తూ కీర్తిశేషులైనపుడు, ఘంటసాల ఆ చిత్రాన్ని పూర్తిచేశారు ఆ చిత్రం?

జ: ..........................

పంపినవారి పేరు : ____________________

చిరునామా : ____________________

## నిబంధనలు:

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

కూపన్‌లు 15-11-2003 లోగా చేరాలి

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

హ్యూమర్ బాక్స్

**రాజు:** చూశావా మంత్రీ సన్మానం చేస్తామనగానే ఎంతమంది కవులు వచ్చారో... మన రాజ్యంలో ఎంతమంది సరస్వతీ పుత్రులున్నారో ఇప్పటికైనా తెలిసిందా.

**మంత్రి:** మోసపోకండి మహాప్రభూ ఇది మిమ్మల్ని దివాలా తీయించటానికి శత్రు దేశం రాజులు పన్నిన కుట్ర అయియుంటుంది.



"ఇదేమిటండీ - ప్లేటు, కత్తి తీసుకుని మేడెక్కుతున్నారు"
"నీకోసం పండు వెన్నెలను కోసి తెద్దామని"





"రామాయణ, మహాభారతాలు చెప్పే నీతి ఏమిటి?"
"అన్న, తమ్ముళ్ల అనుబంధాలు కాలక్రమంలో క్షీణిస్తాయి."

**ఈ జోకులను పంపినవారు: ఎం. శిరిష, చిత్తూరు.**

"మా మమ్మీకి సామెతలంటే చాలా ఇష్టం."
"ఎలా చెప్పగలవు?"
"ఏముంది. మాడాడీ అప్పుతెచ్చిన ప్రతిసారి ఇంట్లో పప్పుకూడు చేస్తూంటుంది మరి"



"సార్! మనకు మొత్తం ఎన్ని కళలు ఉన్నాయో... చెప్పగలరా?"
"అంత కరక్టుగా చెప్పలేం!"
"ఏం?"
"మొదట్లో 64 కళలు అని అన్నారుగాని ప్రస్తుతం మన దేశ జనాభా ఎంత ఉందో అన్ని కళలు ఉన్నట్లే లెక్క ఎందుకంటే ఇప్పుడు ప్రతి మనిషి దగ్గర ఏదో ఒక కళ దాగి ఉంది మరి"



**ఈ జోకులను పంపినవారు : బి.వి.ఎస్. బాబు, తెనాలి.**

"అదేమిటమ్మా... పెళ్లయి ముణ్ణెళ్లు కాలేదు అప్పుడే అత్తింటినుండి పెట్టేబేడా సర్దుకుని వచ్చేశావ్!?" అడిగింది తల్లి.
"నేను టెన్త్ స్కూల్ ఫస్ట్‌గా పాసయ్యానా లేదా... ఇంటర్ డిస్టింక్షన్ అవునా కాదా... మరి డిగ్రీలో స్టేట్ ఫస్టే కదా" అంటూ కన్నీళ్లు పెట్టుకుంటూ చెప్పింది కూతురు.
"అవునమ్మా... నువ్వెప్పుడూ ఏ పరీక్షా తప్పలేదు... దానికీ నువ్విలా వచ్చెయ్యడానికి ఏంటమ్మా సంబంధం...!?"



"ఉందమ్మా నిన్న ఆయన్తో హాస్పటల్‌కి వెళితే డాక్టరు నేను నెల తప్పానని చెప్పి, నవ్వాడమ్మా దానికీయన ఆ డాక్టర్ని లాగి ఒక్కటిచ్చుకోకపోగా... ఇంట్లో పార్టీ అరేంజ్ చేయిస్తానన్నారు. రేపు వచ్చిన వారందరికీ ఈ విషయం చేప్తారట. ఇంతకన్న అవమానం ఏ భార్య అయినా భరిస్తుందా... అందుకే వచ్చేశాను" అంటూ చెప్పిందా అమాయకపు కూతురు.

"వద్దునాన్నా.... నాకిప్పుడే పెళ్లి వద్దూ... అయినా నాకేమంత వయసయి పోయిందని!" అంది కూతురు గారాలు పోతూ.
"నాకు తెలునమ్మా నువ్వింకా చిన్నపిల్లవేనని.... నీకు తల్లిలేని లోటు తీర్చడానికేనమ్మా ఈ ప్రయత్నం!! పెళ్లిళ్ల పేరయ్య వచ్చి వెళ్లింది అందుకే" అన్నాడు లోలోపల తెగ మురిసిపోతూ.



"మీ అన్యోన్యత చూస్తుంటే ముచ్చటేస్తోంది" అంటూ అభినందించాడు ఓ అపరిచిత వ్యక్తి ఓ జంటను చూసి.
"థాంక్సండీ... కానీ మా మధ్య మరో జంట చిక్కుముడిలా ఉన్నారు. వాళ్ళు గనక లేకపోతే మేం ఇంకా అన్యోన్యంగా వుంటాం"
"ఎవరు వాళ్ళు?"
"మా ఆవిడ.... వాళ్లాయన"



**ఈ జోకులను పంపినవారు లకనం మూర్తి, కాకినాడ.**






ఓ ఊళ్లో మంచి కోళ్లు, గ్రుడ్లు అమ్మేకోళ్ల ఫారం దగ్గరకు ఓ వ్యక్తి వచ్చి "నీ దగ్గరకోళ్ళు చాలా బలిష్టంగా బాగున్నాయి. వాటికి ఏ ఆహారం పెడ్తావు" అని అడిగాడు. అందుకా కోళ్లఫారం యజమాని దర్పంగా "బాదం పప్పు, స్వచ్ఛమైన నేయి కలిపిన దాణా పెడ్తాను" అని జవాబిచ్చాడు. దాంతో ఆ వచ్చిన వ్యక్తి "ఒహో! అలాగా! చాలాబాగుంది. నేను ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసర్ని అంత ఖరీదైన ఆహారం పెట్టడానికి ఇంత డబ్బు ఎక్కడనుంచి వచ్చిందో చెప్పు" అంటూ ఫైన్ వేశాడు. దెబ్బకి కోళ్ల వ్యాపారి జాగ్రత్త పడ్డాడు. కొద్దిరోజులు అయిన తర్వాత ఇంకో వ్యక్తి వచ్చి "కోళ్ళు బాగున్నాయి వీటికి ఏం ఆహారం పెడ్తావని అడగ్గానే "అసలు వాటికి నేను ఏం ఆహారం పెట్టను" అని అన్నాడు. దాంతో ఆ వ్యక్తి "అలా అయితే నీ మీద తప్పక చర్య తీసుకోవాల్సిందే - నేను పక్షులు, జంతువుల సంరక్షణ కార్యాలయం నుండి వచ్చాను" అని ఫైన్ వేశాడు. ఈ దెబ్బకి మరింత హడలిపోయాడు ఆ కోళ్లఫారమ్ యజమాని. మళ్లీ కొన్నాళ్లకు మరో వ్యక్తి వచ్చి కోళ్ల గురించి అడుగుతుంటే "అయ్యా! నేను రోజూ ఒకొక్క కోడికి రెండు రూపాయలు చొప్పున ఇస్తాను వాటికిష్టమైనవి మార్కెట్‌లో అవే కొనుక్కుతింటాయి" అన్నాడు ఒణికిపోతూ.

ఓసారి యమదూతలకు, దేవదూతలకు నరకం, స్వర్గం సరిహద్దు గోడవద్ద వివాదం వచ్చి ఇలా వాదులాడుకుంటున్నారు.

**దేవదూతలు :** మీ నరకంలో వాళ్ల వల్లే ఈ గోడకు డేమేజీ అయ్యింది. కాబట్టి మీరే బాగుచేయించాలి.

**యమదూతలు :** కాదు! ఇద్దరం చెరిసగం ఖర్చు భరించుదాం!

**దేవదూతలు :** "అందుకు మేం సమ్మతించం."

**యమదూతలు :** అయితే మేం కోర్టుకెళ్తాం.

**దేవదూతలు :** మీ తరపున వాదించడానికి లాయర్లెంతోమంది మీ దగ్గరున్నారని... మా దగ్గర అస్సలు ఒక్కడు కూడా లేడని... ఇదే కదా మీ ధీమా... మేం ఒప్పకోం... ఇంకో మాట చెప్పండి.




ఈ జోకులను పంపినవారు : పి.వి.రమణ, చింతలపూడి.

టీచరు తేనెటీగ పటాన్ని పిల్లలకు చూపిస్తూ "ఇది తేనెను సేకరిస్తుంది కనుక దీన్ని తేనెటీగ అంటారు" అని వివరించింది.

వెంటనే ఓ స్టూడెంట్ లేచి సీతాకోక చిలక బొమ్మను చూపించి "అయితే బట్టర్‌ఫ్లై వెన్నను సేకరిస్తుందా మేడమ్!?" అని అడిగాడు.





పెళ్లిలో పెళ్లికొడుకుకి రిస్టువాచి కట్నంగా ఇచ్చారు. కొన్నాళ్లకి అది ఆగిపోయింది. "చూడు మీ వాళ్ళు చేసిన నిర్వాహకం" అంటూ తన భార్యకు చూపించాడు.

"దీనికి 'కీ' ఇవ్వాలండీ..." అంది భార్య

"అందుకే నాకొళ్ళు మండుతుంది మీ వాళ్లంటే... వాచి ఇచ్చినవాళ్ళు కీ ఇవ్వకపోతే ఎలా?" అన్నాడా భర్తగారు.

ఒకతను రోడ్డుమీద వెలుతుండగా భారీ వర్షం మొదలైంది. తొందరగా ఇల్లు చేరుకోవాలని వడివడిగా నడకసాగించాడతను. కొంచం దూరం వెళ్లగానే కాలుజారి పడిపోయాడు. వెంటనే ఆకాశంలో మెరుపు మెరిసింది దానికతడు "ఓరి భగవంతుడా! వేళాకోళం కాకపోతే బురదలో తోసేసింది చాలక ఫోటో కూడా తీస్తావా?" అంటూ వాపోయాడు.



పట్నంలో వుద్యోగం చేస్తున్న ఒకతను తన అక్కకి ఇచ్చిన మాట ప్రకారం పల్లెటూళ్లో పుట్టిపెరిగిన ఆమె కూతుర్ని పెళ్లి చేసుకుని కాపురానికి తెచ్చుకున్నాడు. 'మొదటి రోజే వంటేం చేస్తావులే' అని హోటల్‌కి తీసుకొచ్చాడు.

"ఏం తెమ్మంటారు సార్?" అడిగాడు సర్వర్.

"మెనూ తీసుకురా!" అన్నాడు భర్త.

"వద్దు వద్దు నేను మెను తినను నేను దోసే తింటాను" అందా కొత్త పెళ్లి కూతురు గట్టిగా.



ఈ జోకులను పంపినవారు జి.బి.లక్ష్మి, హైదరాబాదు.




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యంగ్యమిది



# నేతి బీరకాయలో నెయ్యి వుండదు!

**(ఆ తెలుగు మాస్టారే. అదే చాదస్తం, అదే అమాయకత్వం. సినిమాల గురించి ఏమీ అవగాహన లేదు. కాని, అదేమిటో చూడాలని, ఈ మధ్య ఒక సినిమా షూటింగ్‌కీ, పాట రికార్డింగ్‌కీ వెళ్లారు. మాస్టారి దగ్గర చదువుకున్న శిష్యుడు ఆయన్ని తీసుకెళ్లాడు.)**



మాస్టారూ, తీసుకెళ్లిన శిష్యుడూ స్టూడియో ఫ్లోర్‌లోకి వెళ్లగానే "సైలెన్స్" అని గట్టి కేక వినిపించింది. దాన్ని పట్టుకుని మరికొన్ని గొంతులు కూడా సైలెన్స్‌మన్నాయి - కోరస్‌లో.

"ఇదేమిటోయ్ - క్లాస్ రూములో నేను అరిచినట్టే ఇక్కడా 'సైలెన్స్' అని అరుస్తున్నారు? క్లాసుకీ ఇక్కడికీ తేడా లేదా యేమిటి? ఇక్కడి వాళ్లు కూడా చెప్పినట్టు వినకుండా గోలా గత్రా చేస్తుంటారా యేమిటి?" అన్నారు తక్కువ సాయిలో గొంతు పలికిస్తూ మాస్టారు.

"కాదు మాస్టారూ! టేక్ చేస్తున్నారు, అందుకని నిశ్శబ్దంగా వుండాలి కదా" అన్నాడు శిష్యుడు.

"టేక్ చెయ్యడం ఏమిటి? టేక్ అంటే 'తీస్కో' అని కదా"

"అదే నండి- తీస్కో అంటే, "షాట్ తీస్కో" అన్న మాట"

"షాట్ అంటే దెబ్బ. దెబ్బ తీస్కో ఏమిటోయ్, "దెబ్బ కాస్కో" అని వుండాలి గాని!" అని అనుమానం వ్యక్తపరుస్తూ వుండగా మళ్లీ "సైలెన్స్!" అని వినిపించింది. "నన్నేనా యేమిటి? ఎవడికంత దమ్ము?" అంటూనే నోరు మూసేసుకున్నారు. దీపాలు వెలిగాయి. కెమెరా ముందు ఒక అమ్మాయి నించుంది. "టచప్" అని అరిచింది.

"షటప్ అందా యేమిటి?" అన్నారు మాస్టారు నెమ్మదిగా. "టచప్ మాస్టారూ, అంటే మేకప్ వేసుకుంది గదా, ఇంకోసారి అద్దుకుంటుందన్నమాట" అన్నాడు శిష్యుడు.

"అవును. అందముగా కనిపించవలె కదా. ఈ పిల్ల ఇందులో ముఖ్యపాత్రా?"

"అవును మాస్టారూ. హీరోయిన్. నాయికా పాత్రధారిణి"

"నాయిక లక్షణములన్నీ వున్నాయంటావా? జట్టు అలా విరబోసుకుంది - దువ్వుకోడానికి దువ్వెన లేదు కాబోలు - ఎవరైనా ఇవ్వవచ్చు గదా. ముఖాన బొట్టులేదు. గౌనులాంటిదేదో వేసుకుంది. అన్యమతస్తురాలి పాత్రా?" అన్నారు మాస్టారు మెల్లిగానే.

"కాదండి. ఇవాళ హీరోయిన్ల వేషధారణ ఇలాగే వుంటుంది. మాడర్న్ అన్నమాట."

అంతలో, హీరోయిన్ డైలాగ్ చెప్పింది. "...న్నకూ... ఈ పెళ్లి ఇస్టమ్ లేదు నానా.. నేనూ... రమేష్‌నే... పెరేమిస్తున్నాను... అతన్నే..." అని ఆగింది.

అసిస్టెంటు ప్రాంప్టింగ్ ఇచ్చాడు-

"పెల్లీ చేస్కుంటాను..." హీరోయిన్ చెప్పింది.

'కట్' అన్నాడు దర్శకుడు 'ఓకే' అంటూ.

దీపాలు ఆరాయి, ఫాన్లు తిరిగాయి.

"ఇదేమిటోయ్ - ఆ పిల్ల తెలుగు అలా వుంది?... తెలుగు రాదా యేమిటి?... పైగా నాటకాల్లో లాగా, ఇక్కడ కూడా ప్రాంటింగుందే-" అన్నారు మాస్టారు.

"హీరోయిన్ తెలుగు అమ్మాయి కాదు మాస్టారూ. బొంబాయి నుంచి వచ్చింది. హిందీలో రాసుకుని తెలుగులో చెప్తుంది. అందుకని అలా వుంటుంది భాష. దీన్ని మళ్లీ తెలుగు వాళ్ల చేత శుభ్రంగా చెప్పిస్తారు తర్వాత" అన్నాడు శిష్యుడు.

"అదెందుకలాగ? తెలుగు సినిమాయే కదా ఇది? తెలుగు వాళ్లు లేరా ఏమిటి - ఈ పాత్ర ధరించడానికి? వచ్చీరాని తెలుగేమిటి... ముక్కలు ముక్కలుగా చెప్పడం యేమిటి?.. ఇలా వుంటుందన్నమాట సినిమా అంటే?.... అవునూ - వాళ్ళ నాన్న ఎవరో అతనేడీ అక్కడ? అతనులేడే" అన్నారు మాస్టారు, ఏదో కనిపెట్టగలిగినట్టు.

"అతనుండ నక్కర్లేదు సార్... అతన్ని చూసి చెప్పినట్టు చూపిస్తారు. క్లోజప్ షాట్ అంటారు దీన్ని. ఇప్పుడు హీరో వస్తాడు. అతనికో క్లోజప్ తీస్తారు."

"క్లోజప్ అంటూ పళ్లు తోముకునే ముద్ద ఏదో - వస్తుందనుకుంటాను. దాంతో తోమేస్తారా వీళ్లని!?"

శిష్యుడు ఫకాలున నవ్వాడు. "ఇవ్వన్నీ సినిమా టెక్నిక్‌లోని మాటలు మాస్టారూ. వాటి అర్థాలు వేరుగా వుంటాయి. అదిగో అతనే హీరో. అతనికే ఒక షాట్ తీస్తారు. చూసి వెళదాం"

"ఇతను..హీరో! అంటే కథానాయకుడన్న మాట! ఇలా వున్నాడేం?... ఇతనూ తల దువ్వుకోలేదు పాపం! సుబ్భరంగా షేవింగ్ చేసుకుని తల దువ్వుకుని, మంచి దుస్తులు వేసుకుని రమ్మనవయ్యా - ఇదేమిటీ అవతారం!" అని మాస్టారు కోప్పడ్డారు.

"మాస్టారూ - ఇప్పుడు సినిమా హీరోలంటే అలా రఫ్‌గానే వుంటారు. మీరు ఇప్పటి సినిమాలు చూడరు. చూస్తే అర్థం అవుతుంది."

"నాకెందుకు నాయనా! నన్నిలా బతకనీ. ఒక పోతన, వేమన లాంటి చిత్రములే నాకిష్టమైనవి. అల్లసాని పెద్దన, తిమ్మన వంటి మహాకవుల జీవితములను చిత్రములుగా తియ్యమను. చూస్తాను"

అంతలో సైలెన్స్ అన్నారు. హీరో కెమెరా ముందు నిలబడి డైలాగు చెప్పాడు.

"ఇదేమిటయ్యా ఈ భాష? తెలుక్కాదే" అన్నారు మాస్టారు ఆశ్చర్యంగా చూస్తూ.

"తమిళం మాస్టారూ. అతనికి తెలుగు రాదు. తమిళ నటుడు. అంచేత, తమిళంలోనే సంభాషణలు చెప్తాడు. తర్వాత, దానికి తగ్గట్టు తెలుగు డైలాగులు రాస్తారు - డబ్బింగ్ చెప్పిస్తారు"

"డబ్బింగంటే మళ్లీ డబ్బిచ్చి చెప్పిస్తారన్న మాట. ఐనా ఇదేం కర్మోయ్ - ఆ పిల్లకి తెలుగురాదు, ఇతనికీ రాదు. ఎందుకూ వీళ్లు?

ఎందరో వున్నారు కదా మనవాళ్లు అందమైన వాళ్లు? భాషతెలిసిన వాళ్లూనూ... అబ్బెబ్బె.... నన్ను వెళ్లి చెప్పమంటావా- ఆ డైరక్టరో ఎవరో, అతనితో? లేదా, ఈ కంపెనీకి హెడ్మాస్టరెవడో చెప్పు - అతన్ని పట్టుకుని కడిగేస్తాను" అన్నారు ఆవేశంగా మాస్టారు.



శిష్యుడు శాంతపరిచాడు "వాళ్ల సినిమా. వాళ్లిష్టం. మనం చెబుతే మాత్రం వింటారా - ఇప్పుడు తండ్రి పాత్రధారి వస్తాడు - అతని షూటింగ్ చూస్తారా?"

"అతను మలయాళమా, ఇంగిలీషా?... చాల్లే పోదాం పద. అన్నట్టు పాట పాడడం, అదేదీ, దాన్ని రికార్డింగు చెయ్యడం - చూపిస్తావా?" అన్నారు మాస్టారు మెల్లిగా కదుల్తూ.

ఇద్దరూ రికార్డింగు థియేటర్‌కి వచ్చారు. లోపల కూచున్నారు. "ఏవో శబ్దాలు వినిపిస్తున్నాయి. డింగ్ డింగ్ మని.." అన్నారు మాస్టారు.

"శబ్దాలు కాదు మాస్టారూ.. ఆర్కెస్ట్రాలో కీబోర్డ్ ఫీడింగ్ జరుగుతోంది"

"ఫీడింగ్ అంటే మేత వెయ్యడమో, తినిపించడమో అంటారు... మరి, ఇదేమిటి?"

"దీని అర్థం వేరు మాస్టారూ. కావలసిన సంగీతాన్ని అందులోకి ముందుగానే ఎక్కిస్తారన్నమాట"

"ఏమిటోలే, ఈ టెక్నిక్‌లు నాకేం తెలుస్తాయి? మరి పాట పాడ్డానికి టైముందా?.. ఎవరు పాడతారీ పాట? ఘంటసాలేనా?..."

"ఇంకా ఘంటసాలేమిటి మాస్టారూ - ఆయన పోయి సంవత్సరాలయిపోతే..."

"ఓహో! అవును కదా.. మరిచిపోయాను.. మరి, ఎవరు పాడతారిప్పుడు.. అతనెవరూ, బాలసుబ్రమణ్యం...."

"ఆయన కూడా కాదండి. ఇంకొకాయన పాడతారు - వింటారు గదా"

"ఈ లోపల ఆ గీతమేదో చూడవచ్చునా... రాసిన వారెవరు?... ఆ కవిగారిని చూపించవోయ్"

శిష్యుడు పరిచయం చేసి - కవిగారి దగ్గర పాట తీసుకుని, మాస్టారికి చూపించాడు. మాస్టారు సీరియస్‌గా రెండు సార్లు చదివి - "ఏమిది?... దీని భావమేమి?..." అని అడిగారు అమాయకంగా.

"భావం అంటే... సరదాగా వుండే పాటండీ. తమరు తెలుగు పండితులు గనక..అడిగారు, అంతటి పాండిత్యం మా పాటల్లో కనిపించదు" అన్నాడా గీతరచయిత.

"ఐనా... ఏదో కొంతయినా భాష, యతి, ప్రాసలు వుండాలి కదా..."

"నువ్వెవరో నేనెవరో... నీకు కావాలి నేను... నేను కావాలి నీకు... చెట్టు చూడు... గట్టు చూడు... పట్టుపట్టు.. నన్ను వట్టు.. హేయ్ హేయ్.. హోయ్ హోయ్.. ఏమిటి? ఇది పాటా?... లేక మాటలా?... ఇదెలా పాడతారు?..." అని తీవ్రంగా అడిగారు మాస్టారు.

"ఇప్పుడు ఇలాంటి పాటలే కావాలి మాస్టారూ.. సింపుల్‌గా వుండాలి గాని... కఠిన శబ్దాలతో వుండకూడదు.... సినిమాలు చూసేవాళ్లందరికీ అర్థం కావాలి కదా." అన్నాడు గీతరచయిత.

మాస్టారు మాట్లాడలేదు. ఈలోపల "రిదిమ్ సెక్షన్" రికార్డు అవుతోంది.

"ఏమిటా బాదుళ్లు?... చెవులు బద్దలవుతున్నాయి." అన్నారు మాస్టారు.

"రిదిమ్స్. ఈ పాటకి తాళం అన్నమాట"

"ఎక్కడా సున్నితమే లేదే - ఆ పాటకి తగ్గట్టుగా వుండాలి కాబోలు!"

ఆర్కెస్ట్రా రికార్డయిందన్న తర్వాత, గాయకుడు వచ్చాడు.




"అదెలాగ? ముందుగా, వీళ్లు వాయించేసి వెళ్లి పోతారా... తర్వాత పాటగాడొచ్చి పాడతాడా... దానికీ దీనికీ పొత్తెలా కుదుర్తుందోయ్... హరికథల్లో గత్రా కూడా వాయిస్తారు, నాటకంలో కూడా హార్మోనీ కూడానే వాయిస్తారు. ఇదేమిటో - ఇది, సినిమాల్లో ముందే వాయించేసి, ఇళ్లకు పోతారా... బావుందయ్యా టెక్నిక్కూ"

గాయకుడి పాట వినిపించింది.

"నువ్వెవరోనే... నెవరో నీకు... కవ్వాలి నీకు..." అని పాడుతున్నాడు.

"సైలెన్స్... ఏమిటోయ్ అది?... 'నువ్వెవరో నేనెవరో నీకు..' అలా విరగ్గొట్టేస్తున్నాడేమిటి - ఎక్కడ ఆపాలో తెలీదా... ఆఁ?" అని శిష్యుణ్ణి దబాయించేశారు మాస్టారు.

"ట్యూనుకి... అదే, సంగీతానికి పాట రాసినప్పుడు అలాగే కుదుర్తుంది మాస్టారూ... విరుపులు అలాగే వస్తాయి..."

"మార్చుకోలేరా... పైగా కవ్వాలీ అంటాడేం అతనూ? కవాలీ పాటా ఇదీ?"

"కావాలి - అన్నదాన్నే కవ్వాలి అని పలుకుతున్నాడు... తెలుగు వాడు కాదు గదా మాస్టారూ"

మాస్టారి కళ్లూ, కనుబొమలూ కలిసిపోయాయి. నోరు వెళ్లబెట్టారు. "ఆఁ... పాడే అతనూ తెలుగువాడు కాడా? పాడ్డానికూడా తెలుగు వాళ్లు లేరా... ఏమిటయ్యా తెలుగు సినిమా అంటావు - ఒక్క తెలుగు వాడు లేడు..."

"మాకు తెలీదు మాస్టారూ. ఈ సినిమా డైరక్టరు కూడా తెలుగుకాదు. మలయాళం ఆయన. సినిమాల్లో అన్ని భాషలవాళ్లు పనిచేస్తారు మాస్టారూ"

"సంభాషణలు రాసేవాళ్లేనా తెలుగు వాళ్లా కాదా?... అదీ భాష తెలియని వాళ్లే రాస్తారా?"

"ఇంకా అంతవరకూ రాలేదులెండి. ఒక్కోసారి డైరక్టర్లు ఇంగ్లీషులో రాస్తే, అది తెలుగులోకి తర్జుమా చేస్తారు..."

'సైలెన్స్... అంతా అయోమయం, అగమ్యగోచరం... నాకెందుకులే మధ్య చూడనివాడికి" అని గొణుక్కున్నారు మేష్టారు. అంతలో పాట ఆర్కెస్ట్రాతో కలిపి వినిపించింది.

"ఒక్క అక్షరం తెలియనీయకుండా పాడుతున్నాడు. అదేమంచిదిలే - అపశబ్దాలు వినిపించవు. వాళ్లని ఇంకా గట్టిగా వాయించమను - పాట సాహిత్యం తెలియకుండా... చూడూ! నేతి బీరకాయలో నెయ్యి వుండదు, తెలుగు సినిమాలో తెలుగు వుండదు! ఇదీ కొత్త సామెత.. రాస్కో" అని బయటపడ్డారు మాస్టారు.

## ఆకాశవాణి సంగీత సమ్మేళన్ - 2003

### బ్రాడ్‌కాస్ట్ షెడ్యూల్

**10.00 P.M. To 11.00 P.M**

| | | |
|---|---|---|
| 15.11.03 | పండిట్. సమరేష్ చౌదరి | గాత్రం |
| 16.11.03 | మాంబళం ఎమ్.కె.ఎస్.శివ | నాగస్వరం |
| 17.11.03 | సుర్ రంజన్ | సరోద్ |
| 18.11.03 | కె. ఓమనకుట్టి | గాత్రం |
| 19.11.03 | షౌకత్ హుస్సేన్ | గాత్రం |
| 20.11.03 | లాల్గుడి జి.జె.ఆర్.కృష్ణన్ & లాల్గుడి విజయలక్ష్మి | వయొలిన్ |
| 21.11.03 | ఉస్తాద్ రంజాన్ ఖాన్ | సారంగి |



# బాపు విశ్వరూపం

23

హిందుస్తానీ సంగీతం పట్ల, సంగీత కారుల పట్ల తన అభిమానాన్ని వెల్లడిస్తూ 'హాసం' 9వ సంచికలో బాపూ రాసిన వ్యాసం పాఠకులకు గుర్తుండే ఉంటుంది. 1967లో దర్శకుడిగా, సినీ పరిశ్రమలో అడుగు పెట్టాక తనకు నచ్చిన సంగీతాన్ని ప్రేక్షకులకు అందించే అవకాశం కలిగిందాయనకు. ఆ అవకాశాలను ఎంత చక్కగా ఉపయోగించుకున్నారో ఆయన సినిమాలలో కొన్నిటికి సంగీతాన్ని సమకూర్చిన శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం కంటే వేరెవ్వరు విశదీకరించగలరు?

'బాలు' గారిని మేటి గాయకుడనడం కొండను అద్దంలో చూపినట్లే. బహుముఖీలుగా బయల్వెడలిన ఆయన ప్రతిభ వ్యాస రచయితగా కూడా మరొక రూపం సంతరించుకుంటోంది - మూడు భాగాలుగా ప్రచురితమవుతున్న ఈ వ్యాసంతో!



నాకు ఊహ తెలిసాక... బాపు, రమణల పరిచయం 'ఆంధ్రపత్రిక' ద్వారా జరిగింది. నాకు పన్నెండు, పదమూడు, సంవత్సరాలున్నప్పుడు పుస్తకాలు బాగా చదివేవాడిని. ఆంధ్రపత్రికలో బాపుగారి బొమ్మలను చూశాక కథను చదవాలి అనిపించేది. ఒక్కోసారి బొమ్మ ఉన్నంత బాగా కథ ఉండేది. మరొకసారి బొమ్మ ఉన్నంత బాగా కథ ఉండేది కాదు. కాని బొమ్మ మాత్రం ఎప్పుడూ బాగానే ఉండేది. 'బుడుగు' ద్వారా నాకు బాపుగారు, రమణగారు ఇంకా బాగా దగ్గరయ్యారు. (అంటే వ్యక్తిగతంగా కాదు.) 'బుడుగు'లో ఉన్న జోకులన్నీ ఈరోజుక్కూడా నాకు గుర్తున్నాయి. కుటుంబంలో అందరం కలిసినప్పుడు కానీ, లేకపోతే ఫ్రెండ్స్ అందరం కలిసినప్పుడు కానీ బుడుగు జోకులు మళ్ళీ మళ్ళీ చెప్పుకుని నవ్వుకుంటూ ఉంటాం. బాపుగారి బొమ్మ రమణగారి మాట అంత బాగా మనసులో నాటుకుపోయాయన్నమాట.

అసలు వీళ్ళిద్దరిలో ఏ ఒక్కరి గురించి విడిగా మాట్లాడాలన్నా అది అసంగతం... ధర్మం కూడా కాదు. ఎందుకంటే త్యాగరాజ కీర్తనని ఒక అద్భుతమైన గాయకుడు పాడుతుంటే విని ఆస్వాదిస్తూ కేవలం సంగీతాన్ని గురించే మాట్లాడి సాహిత్యాన్ని గురించి మాట్లాడకపోవడం ఎంత నేరమో... అలాగే ఈ ఇద్దరిలో ఏ ఒక్కరి గురించి మాత్రమే ప్రస్తావించినా కూడా అది అంత పెద్ద నేరం అవుతుందన్నమాట.

కారణజన్ములు అంటూ ఉంటారు ఆ మాట వీరికి సరిగ్గా సరిపోతుంది. బహుశా వీళ్లిద్దరూ గత జన్మలో తుంబుర నారదులు అయి వుంటారు. కలిసి జీవనయానం సాగిస్తూ... కలిసి సినిమాలు తీస్తూ... కలిసి స్నేహాన్ని పంచుకుంటూ... కలిసి కీర్తిని పంచుకుంటూ... కలిసి కష్టాన్ని పంచుకుంటూ... ఉన్నారంటే మరి ఇది పూర్వజన్మ సుకృతం కాకపోతే మరి ఏమంటారు!?

స్నేహంమంటే నాకు చాలా ఇష్టం. స్నేహితులంటే మరీ మరీ ఇష్టం. ఎందుకంటే ప్రపంచంలో అమ్మానాన్నల తరువాత... గురువు తరువాత... దేవుడికంటే ముందుకూడ - నేను ఎక్కువగా గౌరవించేది, ప్రేమించేది స్నేహితాన్నే. అలాంటి స్నేహానికి ఒక ప్రతీకగా, ఒక తార్కాణంగా అలా నిలిచిపోయేటటువంటి వ్యక్తుల గురించి మనం మననం చేసుకుంటే తప్పకుండా మొట్టమొదటి కోవలోకే వస్తారు బాపురమణ.

అలా వాళ్ళతో నా మానసిక అనుబంధం బుడుగుతోటి- ఆంధ్రపత్రికలోని బొమ్మలతోటి - ఇంకా కొంచెం ఎదిగాక 'జ్యోతి'తోటి- పెరుగుతూ వచ్చింది. నేను నా బావమరిది మేమిద్దరం మద్రాసులో చదువుకుంటూ ఉండేవాళ్ళం. నేను ఇంజనీరింగ్ ఫస్ట్ ఇయర్. వాడు ఆర్.ఐ. కాలేజీలో బి.యస్సీ. ఇద్దరం ఎగ్మూర్‌లో ఎలక్ట్రిక్ ట్రెయిన్ ఎక్కి కోడంబాకంలో దిగాలి. నెలలో మొదటివారం వచ్చిందంటే జ్యోతి పుస్తకం పట్టుకుని ఫ్లాట్‌ఫాం బెంచిమీద కూర్చుని ఆ జోకులు చూస్తూ... అందులో ఉన్న కార్టూన్లు చూస్తూ... చుట్టుప్రక్కల జనం ఉన్నారన్న సంగతి కూడా మరిచిపోయి... పగలబడి నవ్వుకుంటూండేవాళ్ళం. ఈ నేపథ్యంలో మాకు జరిగిన ఒక చిన్న అనుభవం చెపుతాను.

ఓసారి స్టేషన్‌లో కూర్చుని ఇద్దరం బాపుగారి జోకులు చదువుకుంటూ పిచ్చిపిచ్చిగా నవ్వుకుంటున్నాం. ఈలోపల ట్రెయిన్ రాబోతోంది. మా పక్కన బెంచిమీద ఒకాయన కూర్చున్నాడు. నేను ఉన్నట్టుండి 'అరేయ్... మనం చాలా బిగ్గరగా నవ్వుతున్నాం. అది మర్యాద కాదేమో! అవతలవాళ్ళు ఏమన్నా అనుకుంటారు' అని అంటే - 'వాడి బొంద. వాడికి తెలుగు తెలిస్తే... వాడికి బాపురమణల గురించి తెలిస్తే... మనతో కూడా కలిసి నవ్వుతాడు. ఈ అరవం వాడికి ఏం తెలిసి చచ్చింది' అన్నాడు మా బావమరిది. ఈలోపల ట్రెయిన్ వచ్చింది. మేమిద్దరం కలిసి కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కాం. మాతోపాటు అతను కూడా ఎక్కాడు. ట్రయిన్ కదిలాక అతను నాదగ్గరకొచ్చి 'మాస్టారూ మీరు ఆ బెంచ్ మీద మీ కర్చీఫ్ మర్చిపోయారు' అని శుద్ధమైన తెలుగులో మాట్లాడుతూ, నవ్వుతూ నా చేతికి అందించాడు. నేను బిక్కచచ్చిపోయాను. నాకంటే నా బావమరిది ఇంకా బిక్కచచ్చిపోయాడు. ఆ సంఘటన నా జీవితంలో మర్చిపోలేను.

బాపుగారి కార్టూన్లతోటి... బొమ్మలతోటి... రమణగారి కథలతోటి... జీవితాన్ని పెనవేసుకుంటూ ఉండని తెలుగువాడు ఉంటాడని కలలో కూడా ఊహించను. అలా అలా అలా పెరిగిన నా అనుభవం ఎప్పుడన్నా బాపుగారిని చూస్తానా, రమణగారిని చూస్తానా అనేటటువంటి ఒక అభిలాషతో మనసులో మరింతగా పెరగడం ప్రారంభించింది.

అలాగే బాపుగారు ఎలా ఉంటారు, రమణగారు ఎలా ఉంటారు అని నాలో నేనే ఊహించుకోవడం. సినిమాల్లో కమేడియన్స్‌లాగ ఎప్పుడూ జోకులేసుకుంటూ ఉంటారు వీళ్ళు అనుకోవడం... జరిగేది. ఎందుకంటే



ఆరోజుల్లో బాపుగారి ఫోటోగాని, రమణగారి ఫోటోగాని ఎక్కడా కనిపించేది కాదు. ఇప్పుడు కూడా ఎంతో తరిచి చూస్తే తప్ప ఎక్కడోగాని దొరకవు వాళ్ళ ఫోటోలు. ఎందుకంటే కెమెరాకు ఆమడ దూరంలో ఉంటారు వాళ్ళు... అసలు పబ్లిసిటి అంటేనే గిట్టదు కదా..!

నేను సినిమా ఇండస్ట్రీలో ప్రవేశించాక - ఇంచుమించు కొన్ని నెలల తేడాతో బాపుగారి 'సాక్షి' కూడా విడుదలయింది. 'సాక్షి సినిమా పోస్టర్లు చూసి దిగ్భ్రాంతి చెందాను. ఎందుకంటే అంతవరకు ఒక మూసలో పోసినట్టున్న పోస్టరు పబ్లిసిటీని చాలా గమ్మత్తుగా ఒక సింగిల్ లైన్ డ్రాయింగ్‌లాగ తీసుకురావడం అనేటువంటిది చాలా అద్భుతంగా అనిపించింది. అంతకు మునుపే చాలా దినపత్రికల్లో వేరే వేరే సినిమాలకు - బాపుగారు చేసిన యాడ్స్.... పబ్లిసిటీ... కార్టూన్ స్ట్రిప్స్‌లాగ వచ్చేవి. బొమ్మలు, కార్టూన్లు బాపుగారు వేసేవారు. క్యాప్షన్స్ రమణగారు వ్రాసేవారు. సినిమా కథను చెప్పక చెపుతూ దాంట్లో ఉన్నటువంటి గమ్మత్తయిన సన్నివేశాలను చూపిస్తూ పబ్లిసిటీ తమాషాగా చేసేవారు.




'సాక్షి' సినిమా పోస్టర్స్ చూసాక నిజంగానే దిగ్భ్రాంతి చెందాను. అప్పుడు నాకు భరణి అని ఒక మిత్రుడు ఉండేవాడు. అతను పోస్టర్ ఆర్టిస్టు. ఎన్నో ప్రక్రియలు చేసి పోస్టర్ పబ్లిసిటీలో గొప్ప గొప్ప ఛేంజస్ తీసుకొచ్చాడు ఆరోజుల్లో. నేను తమిళ సినిమాల్లో ప్రవేశం కావడానికి అతనే ముఖ్యమైనకారణం... అది వేరే కథ. 'బాపుగారి పోస్టర్స్ చూశావా ఎంత అద్భుతంగా ఉన్నాయో. అసలు ఇన్నాళ్ళూ ఆయన ఎందుకు మా డిపార్ట్‌మెంట్‌లోకి రాలేదో నాకు అర్థం కాలేదు' అని అన్నాడతను.

'సాక్షి' సినిమా ఫైనాన్షల్‌గా పెద్ద సక్సెస్‌కాకపోయినా తెలుగు సినిమా మీద పిపాస ఉన్నవాళ్ళు అందరూ కూడా చాలా అందమైన సినిమా అని... బాపుగారి బొమ్మంత అందమైన సినిమా అని గొప్పగా మాట్లాడుకున్నారు. ఆ సినిమాలో పాడలేకపోయాననే దుగ్ధ ఉండేది నాకు.

సాక్షి సినిమా తర్వాత ఓ గమ్మత్తయిన సంఘటన... దర్శకుడిగా బాపుగారి రెండవ సినిమా 'బంగారు పిచ్చిక'... ఈ సినిమాలో చంద్రమోహన్ వేసిన వేషం నన్ను వెయ్యమని అడిగారు... ఆ రోజుల్లో నేను చాలా సన్నగా, అందంగా ఉండేవాణ్ణి. ఇప్పట్లోలా అందంగా మందంగా లేను. సరే... వాళ్ళు అలా అడిగిన వెంటనే ఆకాశంలో ఎగురుతున్న పక్షులు ఫ్రీజ్... సముద్రంలో ఎగసిన అల ఫ్రీజ్.. అడవిలో దూకుతూ పరుగెత్తే లేళ్ళు ఫ్రీజ్... వింటున్న నేను ఫ్రీజ్...

నేనేమిటి... వేషం వెయ్యటం ఏమిటి... అనుకుని భయపడి పారిపోయాను.. ఈ తర్వాత కొన్నాళ్ళకి పాటలయితే పాడతానండి అన్నాను. సరేనని ఆ సినిమాలో పాటలు నాతో పాడించారు... బాపు రమణలతో నా తొలి పరిచయం అలా మొదలయింది.

ఇలా నేను మెల్ల మెల్లగా కాలూనుకుంటూ నేపథ్య గాయకుణ్ణి అవుతున్న సందర్భంలో 1969లో ఒకసారి బాపుగారు రమణగారు 'నను పాలింపగ నడిచి వచ్చితిరా' అన్నట్లు ఇద్దరూ రామలక్ష్మణుల లాగ మా ఇంటికొచ్చారు. వరండాలో కూర్చున్నారు. వాళ్ళు వచ్చారనగానే హడావిడిగా పడుతూ... లేస్తూ... కంగారు పడుతూ... సంతోషపడుతూ... ఎదురువెళ్ళాను. అసలు వాళ్ళు మా ఇంటికి రావడం ఏంటి అని అనుకుంటూ - ముందు అతిథి మర్యాదలన్నీ అయిన తర్వాత 'ఏంటి విశేషం మాస్టారు' అని అడిగాను. 'మేం అందాల రాముడు అనే ఓ సినిమా తీస్తున్నాం. ఘంటసాల గారు అనారోగ్యగ్రస్తులై ఉన్నారు. అందుకని మీచేత ఈ పాటలన్నీ పాడించాలి అనుకుంటున్నాం. కాని నాగేశ్వరరావుగారికి అంత నమ్మకం లేదు కొత్త కుర్రాడు కదా గాత్రం నప్పుతుందో లేదో నాకు అని ఆయన కొంచెం అనుమానాన్ని వ్యక్తీకరించారు. కాని మీరు పాడితే బాగుంటుందని మా అభిప్రాయం. మీరు ఏమీ అనుకోనంటే మాకో వరం కావాలి' అని అడిగారు. నాకు దేవుళ్ళలాంటి వాళ్ళు వచ్చి నన్ను వరం అడగడం ఏంటి!? అనుకుని 'ఏంటి మాస్టారు చెప్పండి' అన్నాను - 'మా ఆఫీసుకు వచ్చి ఆ పాటలు నేర్చుకుని ఒకసారి క్యాసెట్‌లో పుహళేంది హార్మోనియంతో వాయిస్తున్నప్పుడు పాడి ఇచ్చారంటే అది మేం నాగేశ్వరావుగారికి వినిపించి, ఈ అబ్బాయి బాగా పాడుతున్నాడని ఆయన్ని ఒప్పించి మీచేత మా సినిమాలో పాడించుకోవాలన్నది మా కోరిక' అన్నారు. ఇంతకన్న నాకు కావలసింది ఏముంది అసలు!?

నిజంగా ఎంత సంబర పడ్డానో తెలియదు. మర్నాడే వెళ్ళిపోయి అన్ని పాటలూ నేర్చుకుని క్యాసెట్‌లో పాడి రికార్డ్ చేశాం. అంతవరకూ ఈ సంతోషంలో ఉన్న నేను రికార్డింగ్ ఎప్పుడని అడగలేదు వాళ్ళని.

ఎందుకంటే అప్పటికి నేను అంత బిజీ సింగర్‌ని కాదు. రికార్డింగ్ ఎప్పుడు అని అడిగేంత ధైర్యం లేదు. సరే పాటలన్నీ మేము టేప్ చేసిన తర్వాత అప్పుడు అడిగాను బాపుగారిని రికార్డింగ్ ఎప్పుడని. 'మేము ఫలానా తారీఖు నుంచి ఫలానా తారీఖు వరకూ ఒకటే షెడ్యూల్‌లో గోదావరి ఒడ్డున తీయాలనుకుంటున్నాం. అందుకని అన్ని పాటలూ ఒకేసారి రికార్డ్ చేసుకుని లొకేషన్‌కు వెళ్లాలనుకుంటున్నాం. ఫలానా తారీఖు నుంచి ఫలానా తారీఖు వరకూ రికార్డింగ్ ఉంటుంద'ని ఒక ఆరు రోజులో, ఏడు రోజులో చెప్పారు. నా గుండెలో పెద్ద బండరాయి పడినంత బాధేసింది. కారణమేమిటంటే సరిగ్గా నా మొట్టమొదటి ఫారిన్ ట్రిప్పు ఆ టైమ్‌లోనే ఉంది. నేను సింగపూర్, మలేషియాలో ఇరవై రోజుల పాటు పన్నెండు ప్రోగ్రామ్స్ నా బృందంతో వెళ్ళి తమిళ కార్యక్రమాలు చేయడానికి అగ్రిమెంటు కుదుర్చుకుని సంతకం పెట్టి అడ్వాన్సు తీసుకున్నాను కూడా!

బాపుగారి రమణగారి సినిమా... అందులో నాగేశ్వరావుగారికి పాడుతున్నాం... ఎలాగైనా ఈ కార్యక్రమాన్ని మార్చుకోవడానికి వీలవుతుందా అని శతవిధాల ప్రయత్నించాను. రాజలింగం అని ఒకాయన ఉండేవాడు. అతను కౌలాలంపూర్ నుంచి చాలా పెద్ద పెద్ద రష్యన్ సర్కస్, జెమిని సర్కస్ (ఇక్కడున్న జెమిని కాదు. వాళ్ళది ఇంటర్నేషనల్ ఫేమస్ సర్కస్) లాంటి కార్యక్రమాలు తర్వాత ఫ్యూజన్ ఆర్టిస్టులతోటి సంగీత కార్యక్రమాలు ఏర్పాటుచేసే వ్యక్తి... నేను అప్పుడప్పుడే గళం విప్పుతున్న రోజుల్లో తమిళ ప్రోగ్రామ్స్ కోసం నన్ను ఫారిన్ తీసుకెళ్తున్నాడు. అతన్ని ఎంత బ్రతిమిలాడినా 'నువ్వు అగ్రిమెంట్ సైన్ చేశావు. అడ్వాన్స్ ఇచ్చాను. థియేటర్లు అన్నీ బుక్‌చేసి పబ్లిసిటి కూడా ఇచ్చాను. నేను ఎలా మార్చుకోవాలి' అని అన్నాడు అతను. ఈ విషయం బాపుగారికి రమణగారికి చెప్పాను.



అవాక్కయ్యారు ... అంటే అప్పటికింకా టేప్ నాగేశ్వరరావుగారికి పంపించే అవకాశం రాలేదు... షెడ్యూల్ మార్చుకోవడానికి వీలులేదు. నాగేశ్వరరావుగారి డేట్స్‌తో పని... మిగతా ఆర్టిస్టులందరూ కలిసి దాదాపు 30, 35 రోజుల్లో సినిమా షూటింగ్ ఫినిష్ చెయ్యాలి.

అలా నాకు ఆ అవకాశం చెయ్యి జారిపోయింది. కాకపోతే తమ్ముడు రామకృష్ణకు మంచి అవకాశం వచ్చిందనుకోండి. అలా మొట్టమొదట ఆ ఇద్దరు దేవుళ్ళూ వరాలు ఇవ్వడానికి మా ఇంటికి వచ్చి... ఆ వరాలను నేను అందిపుచ్చుకోకుండా శాపగ్రస్తుణ్ణి అయిన సందర్భం అలా అయిపోయిందే అని బాధపడ్డాను.

తర్వాత 'ముత్యాలముగ్గు' సినిమాలో 'గోగులు పూచె గోగులు పూచె ఓ లచ్చాగుమ్మాడి' పాట. విజయాగార్డెన్స్ (ఓల్డ్ థియేటర్)లో పాడాను. అది ఎంతమంచి పాటో అందరికి తెలిసిందే. పర్టిక్యులర్‌గా చరణాల్లో మాత్రమే నేను పాడడం... అది గజల్ స్టయిల్లో ఉండడం... కొంచెం హిందుస్తాని బాణీలో ఉండడం... బహుశా నారాయణరెడ్డిగారు, బాపుగారు, రమణగారు ఈ పాట నాకిస్తే బాగుండునని అనుకునే ఇచ్చినట్టున్నారు. కానీ నా దృష్టిలో ఈ సినిమాలో తమ్ముడు రామకృష్ణ పాడిన 'ఏదో ఏదో అన్నది' అన్న పాట చాలా మంచి పాట. అతని జీవితంలో కూడా ముఖ్యమైన పాటల్లో ఒకటిగా మిగిలిపోయే పాట. 'గోగులుపూచే' పాట పాడగానే నాకు పేమెంట్ చెక్కును తీసుకొచ్చి ఇచ్చిన వ్యక్తిని చూసి ఎవరీ హ్యాండ్సమ్ మ్యాన్, అందంగా గమ్మత్తయిన టీ షర్ట్ వేసుకుని తిరుగుతున్నాడు... ఎవరో ప్రొఫెషనల్ మేనేజరేమో అని అనుకున్నాను. ఆ తర్వాత తెలిసింది అతనే ఎమ్.వి.ఎల్. అని... ఆ సినిమా నిర్మాత అని. ఆ సందర్భంగానే ఆ ఎమ్.వి.ఎల్. అనే ఆ అద్భుతమైన మనిషితో, ఆ అద్భుతమైన రచయితతో స్నేహం కలిపే అవకాశం నాకు కలిగింది.

ఈ సినిమా తీస్తున్న సందర్భంలోనే బాపుగారిని నేను మరొక వరం అడగడానికి వెళ్ళాను. చాలా కొద్దిపాటి పరిచయంతో చొరవ తీసుకున్నాననే చెప్పాలి. నా మిత్రుడు సురేష్ అని నెల్లూరు వాస్తవ్యుడు. అతను సినిమాల్లో వేషాలు వెయ్యాలని తాపత్రయ పడుతుంటే బాపుగారి దగ్గరకు తీసుకెళ్లాను. చూసిందే తడవుగా వెంటనే అతనికి హీరోయిన్ బ్రదర్ క్యారెక్టర్ ఇచ్చారు. నేనెప్పటికి మరిచిపోలేను. సురేష్ కూడా మరిచిపోలేడు. అసలు మరిచిపోయే అవకాశమే లేదు ఎందుకంటే అతను దివంగతుడయ్యాడు. అడిగిందే తడవుగా ఆ అవకాశం అతనికి ఇవ్వడం నాకు నిజంగా ఆశ్చర్యాన్ని కలిగించింది. వారి మనసులో ఎవరన్నా ఆర్టిస్టులు ఉన్నారో లేదో నాకు తెలియదు కాని అతనికి చక్కని క్యారెక్టర్ ఇచ్చారు.

ఆ తర్వాత 'సంపూర్ణరామాయణం', 'సీతాకల్యాణం' వీటన్నిటిలో కూడా నాకు పాడే అవకాశం దొరికింది. ముఖ్యంగా నాకు దొరికిన ఇంకో అదృష్టం ఏమిటంటే - 'రామాంజనేయ యుద్ధం' బాపుగారు తీస్తున్న సందర్భంలో... మహదేవన్‌గారు ఎవైలబుల్‌గా లేక ... పుహళేందిగారు కూడా దొరక్కపోవడం వల్లనో ఏమో అందులో కొన్ని పద్యాలు నాచేత కంపోజ్ చేయించారు బాపుగారు. అది యుద్ధానికి సంబంధించినవి... ఆంజనేయుడికి రాముడికి మధ్య జరిగేటటువంటి వాగ్వివాదం. నేను కంపోజ్ చేసిన...ఆ పద్యాలు నేనూ, మాధవపెద్ది సత్యం బాబాయ్ పాడాం. అది కూడా నేను గొప్ప వరంగా భావిస్తున్నాను. నిజం చెప్పాలంటే బాపుగారి సినిమాకి సంగీతాన్ని సమకూర్చే అవకాశం మొట్టమొదటిసారి ఇలానే నాకు వచ్చింది అనుకోవాలి.

గజల్స్ పాడే మెహదీహసన్ అన్నా, గులాం అలీ అన్నా... తర్వాత సజ్జాద్ హుస్సేన్ మ్యాండొలిన్ అన్నా బాపుగారికి చాలా చాలా ఇష్టం. ఈ విధమైన పిపాస ఉండడం వల్ల ఆయన దగ్గరున్న కొన్ని వందల గంటల గజల్స్‌ని వినే అవకాశం నాకు కలిగింది. మా మిత్రబృందం ఎప్పుడొచ్చినా బాపుగారింటికి వెళ్ళేవాళ్ళం. సాయంత్రం డాబా మీద కూర్చుని ఈ పాటలు మొదలు పెట్టాక పరిసరాలు మరిచిపోయేవాళ్ళం. వాళ్ళలో కొందరు అక్కడే కునుకు తీసేవాళ్ళు, ఇంకొందరు వెళ్ళిపోయేవాళ్ళు కూడా! తెల్లవారుఝాముదాకా బాపుగారు, నేను కూర్చుని విన్న సందర్భాలు చాలా చాలా ఉన్నాయి. మరిచిపోలేనటువంటి అనుభూతి అది. ఎందుకంటే ఆ పాటలు వింటున్నప్పుడు నేను సంపాదించుకున్న జ్ఞానం ఎంతుందో చెప్పడానికి వీల్లేదు.

ముఖ్యంగా 'తూర్పు వెళ్ళే రైలు' సినిమాకు సంగీతం నన్ను మ్యూజిక్ చేయమని అడిగినప్పుడు అందులో 'చుట్టు చెంగావి చీర' పాటకి ఆయన 'రఫ్‌తా రఫ్‌తా' అనే ఒక గజల్‌లోని పల్లవి వినిపించి 'నాకు ఈ పద్ధతిలో పాట కావాలి' అని అడిగారు. అలా ఆ పాట చేయడం జరిగింది. జెమినిలో ఆ పాట రికార్డ్ చేసి బయటకొచ్చాక రమణగారు అందులో ఉన్న వయొలిన్ ప్రోగ్రెషన్స్‌ని విని 'మళ్ళీ నాకు నౌషద్‌గారి వయొలిన్ ప్రోగ్రెషన్స్ గుర్తుకొచ్చాయి' అని అనడం నేనెప్పటికీ మరిచిపోలేని కితాబు.

(వచ్చే సంచికలో... మరికొంత)



# ఒక్క మగాడు

## పాట కథా కమామిషూ



'సీతయ్య' సినిమాలో 'ఒక్కమగాడు' అనే పాట కంపోజ్ ఎలా చేశారు, ఆ పాట వెనుకాల ఉన్న కథ ఏమిటి అన్న విషయంపై సంగీత దర్శకుడు కీరవాణి అందించిన వివరాలివి.

'లాహిరి లాహిరి లాహిరిలో' సినిమా కంపోజింగ్‌కి తిరుపతి వెళ్ళి వర్క్ చేయడం జరిగింది అచ్చొచ్చిన ప్లేసని, ఆ వెంకటేశ్వరస్వామి మీదున్న భక్తితో నేను, వై.వి.యస్.చౌదరిగారు, మా అసిస్టెంట్స్ నలుగురు... మేమందరం కలిసి తిరుమల వెళ్ళి 'అన్నమయ్య' గెస్ట్‌హౌస్‌లో దిగి సెటిలయ్యాం. మర్నాడు.... అంటే చౌదరి గారికి అఫీషియల్‌గా నేను ఇచ్చిన కంపోజింగ్ డేట్స్‌లో మొదటిరోజు బయలుదేరి స్నానాలు చేసి కొండమీదున్న మయూరి హోటల్‌కి తొమ్మిదింటికి వెళ్ళి ఇడ్లీలు, పొంగల్, దోసెలు.... ఎవరి

శక్తికొలది వాళ్ళు సరదాగా తినడం... రూమ్‌కు రావడం... రూమ్‌కొచ్చేసరికి పదయ్యేది. పదింటికి కళాతపస్సు మొదలుపెట్టడం... కళాతపస్సు అంటే మీరు వేరేలా అనుకోకండి. కళాతపస్సు అంటే గురకలు పెట్టి నిద్రపోవడం అన్నమాట. డైరెక్టరు నిద్రపోతున్నాడన్నా, మ్యూజిక్ డైరెక్టరు నిద్రపోతున్నా బాధపడ్డానికి ప్రొడ్యూసరు విడిగాలేడు... ప్రొడ్యూసరూ, డైరక్టరూ వై.వి.యస్. చౌదరే. సో...బాధపడే ప్రొడ్యూసర్‌తో సహ డైరెక్టరు కూడా గురకలు పెట్టి నిద్ర.

నేను బయట సోఫాలో నిద్రపోతే - సోఫా కింద జెమినీరావు గారు. లోపల పోల్సన్ అనే గిటార్ ప్లేయర్, గణేష్ అనే అబ్బాయి.... చౌదరిగారు మంచంమీద. ఇలా ఎవరు పడితే వాళ్ళు నిద్రలు. తొమ్మిది గంటలకు స్టార్ట్ చేసిన నిద్ర పది... (ఆఫీసు అవర్స్‌లో నిద్రపోవడంలో ఇంత హాయి ఉందా అని మాకప్పుడు తెలిసి... గవర్నమెంట్ ఆఫీసర్లు జీవితం ఇంత అనుభవిస్తున్నారా అని అప్పుడు మాకు అర్థమయిందండి.) పదిన్నర... పదకొండు గంటలకు నిద్రలేవడం. అప్పుడు ఒళ్ళు విరుచుకుని 'ఆఁ చౌదరి గారు ఏంటి సంగతి?' అని అడగటం. ఇన్‌స్ట్రుమెంట్స్ ముందు కూర్చుని ట్యూన్ కంపోజ్ చేసినట్టు నటించటం. పదకొండున్నర... పన్నెండు దాకా కష్టపడి ఏదో ఓ మాదిరిగా అనుకోవడం... (ట్యూన్ ఏదీ వచ్చేది కాదండి...) పన్నెండున్నరకి రెండు మూడు జోకులు వేసుకునేసరికి మెల్లగా ఆకలి అయ్యేది.

బాపుగారు వేసిన కార్టూనొకటుంది. ఒకాయన మంచంమీద బోర్లాపడుకుని కాళ్ళు పైకెత్తిపెట్టి ఉంటాడు. డాక్టరుగారు స్టెతస్కోప్‌తో వచ్చి ఉంటాడు. 'ఏంటమ్మా మీ హస్బెండ్ కంప్లయింట్' అని డాక్టరుగారంటే - 'ఏమోనండీ లేవగానే ఆకలి అంటాడు. తినగానే నిద్ర అంటాడు' అని ఆవిడ అంటూ ఉంటుంది.

అలాగ 12:45కి ఆకలి మొదలయ్యేదండి. సరదాగా చెట్టాపట్టా లేసుకుంటూ వై.వి.ఎస్. చౌదరిగారు అనే దర్శకనిర్మాత, మేము కలిసి మళ్ళీ కారువేసుకుని మయూరికెళ్ళటం... మయూరిలో మాకు రాచమర్యాదలు ఇస్తారండి. ఎందుకంటే రాఘవేంద్రరావుగారితో మేం అసోసియేట్ అయి ఉన్నాం కదా... రాఘవేంద్రరావుగారంటే వారికి చాలా ప్రేమ. ఆయనతో రెగ్యులర్‌గా పనిచేసిన మ్యూజిక్ డైరెక్టర్‌గా నేనంటే వారికి స్పెషల్ ప్రేమ. మా బ్యాచ్ అందరికి కూడా వాళ్ళు లోపలున్న పచ్చళ్ళు అవీ తెచ్చి పెట్టడం అలా స్పెషల్ ట్రీట్‌మెంటన్న మాట. ఎందుకంటే 'అన్నమయ్య' సినిమాకు మ్యూజిక్ చేసినందుకు ఏదో చిన్న టోకెన్ ఆఫ్ రెకగ్నేషన్. అలా వాళ్ళు పెట్టిన భోజనం సుష్టుగా తిని రూమ్‌కొచ్చేసరికి రెండయ్యేది. రాగానే మళ్ళీ నిద్ర. మూడు లేక నాలుగున్నరకి లేచి టీ తాగి ఐదింటికో లేక ఐదున్నరకో మెల్లగా స్టార్ట్ చేసేవాళ్ళం.

నిజానికి 'సీతయ్య' మ్యూజిక్ కంపోజింగ్ ఫస్టు స్టార్ట్ చేసింది 'ఒక్కమగాడు' పాటతోనే... పెళ్ళి కాని ఓ అమ్మాయి తనకి ఎలాంటి భర్త కావాలో హరికృష్ణగారికి చెప్పే పాటది.

కొద్దిగా పల్లవి అనుకునే లోపల ఏడయ్యేది. 'ఏవండి మనం వెళ్ళేసరికి హోటల్స్ కట్టేస్తారేమో, అసలే పుణ్యక్షేత్రం... రద్దీ ఎక్కువగా ఉంటుంది. ఎందుకన్నా మంచిది...' అని చౌదరి అనడం. సరేనని బయలుదేరి వెళ్ళడం... మళ్ళీ సుష్టుగా ... భోజనాలు చేసేవాళ్ళు భోజనాలు, టిఫిన్లు చేసేవాళ్ళు టిఫిన్లు చేసి రూమ్‌కొచ్చేసరికి తొమ్మిదయ్యేది. 'ఏది ఏమన్నారు... ఒకసారి పాడండి...' అని చౌదరి అడగటం...దాంతో మళ్ళీ మరోమారు పాడేసరికి తొమ్మిదిన్నర అయ్యేది, మళ్ళీ నిద్ర. హైదరాబాద్ ప్రసాద్ ల్యాబ్‌లో పనిచేస్తే పదకొండు పన్నెండు అవుతుంది... కాని తిరుమలలో ఏముంది... హాయిగా నిద్రపోవడం. ఆ నిద్రపోవడం నిద్రపోవడం మళ్ళీ లేవడం పొద్దున్న ఏడింటికే.

అలా నిద్ర పోతూ ఉంటే - అమూల్యమైన సమయాన్ని వృథా చేస్తున్నామనే గిల్టీకాన్షస్‌నెస్‌తో మేం చచ్చిపోతామని భయమేసి.... ఇది నిద్ర కాదు, నిద్రలో కూడా మన మననులు ఆలోచిస్తాంటాయి కదా అని సరదాగా అనుకుని... తపస్సు అంటే సమాధి లాంటిది. సమాధి అంటే నిద్రలాంటిది. మనం ట్యూన్ గురించి ఆలోచిస్తు గురకలు పెడ్తున్నాం కాబట్టి దీన్ని మనం కళాతపస్సు అనుకుందాం అని ఆ పేరు పెట్టామండి.

సరే... మర్నాడు కూడా అదే పని... ఆ మర్నాడు నాకే భయమేసి "ఏవండి ప్రొడ్యూసర్ గారు... (ఇప్పుడు ప్రొడ్యూసర్ అనే పిలవాలండీ. డైరెక్టర్ సంగతి దేవుడెరుగు) మూడు రోజులయి పోయాయి డేట్స్ అన్నీ అయిపోతున్నాయి ఒక్క ట్యూన్ కూడా ఓకే అవటం లేదు మీకేం భయమేయటం లేదా" అంటే - "ఏముందిలెండి ఏంచేస్తాం మరి" అని కూల్‌గా అన్నాడాయన. ఎంత సీరియస్ మ్యాటరయినా కూల్‌గా డీల్ చేసే స్వభావం ఆయనది. సరే మొత్తానికి పల్లవి ఓకే. దీనికి సాకీ ఏదైనా ఉంటే బాగుంటుందని 'నీ అక్కకు మొగుడైనందుకు నీకు పెళ్ళి చేసే బాధ్యత నాది' అని 'రమ్యకృష్ణలాగ ఉంటదా'

కీరవాణిగారి వెర్షన్‌లో ఆయన చెప్పిన తమాషా సంఘటన గురించి దర్శకనిర్మాత వై.వి.యస్.చౌదరిగారిని 'హాసం' కలిసింది. 'ఒక్కమగాడు' పాట పుట్టుక గురించి ఆయన మరింత విపులంగా 'ఆ తమాషా ఇన్సిడెంట్'ని కూడా కలుపుకుని చెప్పిన వివరాలివి:

**జ**నరల్‌గా నా సినిమాలలో కథకు ఎంత ఇంపార్టెన్స్ ఇస్తానో అంతకంటే మంచి మ్యూజిక్‌కు ఇంపార్టెన్స్ ఇస్తాను. ఒక సినిమా హిట్‌గా గాని సూపర్‌హిట్‌గా కాని నిలబడాలంటే - ఆడియన్స్ సాంగ్స్‌ని రెండు, మూడుసార్లు వినటానికి వీలుగా, రెండు మూడుసార్లు చూడటానికి వీలుగా ఉండేట్టు ప్రయత్నించాలి. అప్పుడు రేంజ్ మారుతుందని నమ్మే డైరెక్టర్‌ని నేను. సో... నా ప్రతి ఫిల్మ్‌లోనూ ప్రతి సాంగ్‌కి ఒక కాన్సెప్ట్ క్రియేట్ చేస్తాను. స్టోరీని క్యారీ చేసే ఒక ఎక్స్‌ప్రెషన్‌లాగా ప్రతిసాంగ్‌ని అనుకోవటం. అనుకున్న తర్వాత సిట్యుయేషన్‌ని మ్యూజిక్ డైరెక్టర్‌కు చెప్పటం... నాకు బాగా ఇష్టమైన మ్యూజిక్ డైరెక్టర్ కీరవాణిగారు. ఎందుకంటే ఈ కాలంలో మనకున్న ది బెస్ట్ నంబర్‌వన్ మ్యూజిక్ డైరెక్టరాయన. సాహిత్యపరంగా పట్టుండి, సంగీతపరంగా అటు వెస్ట్రన్ గాని ఇటు మన కర్ణాటక మ్యూజిక్‌గాని ఏదైనా సరే నేటివిటీతో పక్కాగా చేయగల సవ్యసాచిలాంటి నేర్పరితనం ఉన్న ఏకైక మ్యూజిక్ డైరెక్టర్‌గా ఆయనంటే నాకు అభిమానం.



కీరవాణిగారితో సంతోషకరమైన విషయం ఏంటంటే- ఆయన ఒక మ్యూజిక్ డైరెక్టరు, నేను ఒక డైరెక్టర్ అనే ఫీలింగ్ మా ఇద్దరిమధ్యన ఎప్పుడూ లేదు. ఇద్దరం జస్ట్ ఫ్రెండ్స్‌లాగ. ఏదైనా టూర్‌కు వెళితే గెస్ట్‌హౌస్‌లో ఉండి సరదాగా మాట్లాడుకునే ఫ్యామిలి ఫ్రెండ్స్‌లా ఉంటాం. అంతేకాని ఈ రోజున ఈ సాంగ్ అయిపోవాలి. రేపు సాయంత్రం లోపున ఈ ట్యూన్ వచ్చేయకపోతే డేంజర్ లాంటి అండర్‌కరెంట్ టెన్షన్స్‌తో ఇంతవరకూ మేం ఏ మ్యూజిక్ సిట్టింగ్‌లోనూ కూర్చోలేదు.

అలాగే ఈ 'సీతయ్య' సాంగ్స్‌కోసం కూడా... కాన్సన్‌ట్రేషన్ రావటం కోసం ఒక పుణ్యక్షేత్రంలో దేవుని సాన్నిధ్యంలో ఉండటం వల్ల డెఫినిట్‌గా మనకి మానసిక ప్రశాంతత ఉంటుంది, ఏకాగ్రత అనేది ఉంటుంది అనే ఉద్దేశ్యంతో... నా కంపోజింగ్స్ అన్నీ జనరల్‌గా అన్నవరంలో గాని తిరుపతిలోగాని... ఇలా పుణ్యక్షేత్రాలలో చేయడం జరుగుతూంటుంది. 'సీతయ్య'కి తిరుమల వెళ్ళాం. అక్కడ అన్నమయ్య కాటేజ్‌లో బస. మయూరి హోటల్‌లో టిఫిన్స్ భోజనాలు చేయడం. నేను భోజనప్రియుణ్ణి... టిఫిన్స్ అవీ బాగా చేస్తాను... కీరవాణిగారు కూడా గుడ్ ఈటర్... ఆయన గ్యాంగ్... తబలిస్ట్ జెమినీరావుగారు గాని గిటారిస్ట్ కాని ఆయన డ్రైవర్ కాని వీళ్ళుకూడా

పాటకు మీరు మంచి సాకీ పెట్టారు కదా అలాంటిది మాకు ఒకటి ఇవ్వండి' అని అన్నారు చౌదరిగారు.

హరికృష్ణగారు నటించే పాట కనుక 'మల్లీశ్వరి'లో రామారావుగారి పాటను గుర్తు చేసుకుంటూ 'పెళ్ళీడుకొచ్చినా ఒంటిగా ఉన్నాను' అని స్టార్ట్ చేస్తే ఆ ఫ్లోలో మొత్తం పల్లవి వచ్చేసింది. మధ్య మధ్య 'సో శ్యాడ్', 'అంత స్పెషలా', 'చ్ చ్ చ్ చ్', 'నాన్చొద్దు' లాటివి అనడం అన్నీ చౌదరి కంట్రిబ్యూషన్. రికార్డయిన పాటలో నా వాయిస్ హరికృష్ణగారి వాయిస్‌లాగే వినిపించిందని చాలామంది కాంప్లిమెంట్ ఇచ్చారు.

ఈ పాట గురించి ఇంకోటి చెబుతానండి. నాలుగైదు పాటలు ఫినిష్ చేసెయ్యాలని 'సీతయ్య' కి వన్ వీక్ ప్రోగ్రాం పెట్టుకుని వెళ్ళామండి. ఓ పాట పల్లవి అయిపోయింది చాలా హ్యాపీ. "చరణాలు ఇక్కడ వద్దండి మద్రాస్‌లో చేద్దాం" అని చౌదరిగారు అనడంతో సరే మర్నాడు వేరే సాంగ్ మీద కూర్చున్నాం. అది మొదలుపెట్టగానే - 'ఒక్కమగాడు' అని చౌదరిగారు అనడం... దాంతో మైండ్ ఆ పాట మీదకి వచ్చేసేది. ఆయన మా పక్కన కూర్చుని నెయిల్ కట్టర్‌తో గోళ్ళు కట్ చేసుకోవడం... లేకపోతే తన సూట్‌కేస్ సర్దుకుంటూ... ఫైల్ తిరగేస్తూ 'ఒక్కమగాడు' అనడం. దాంతో మళ్ళీ మేం ఆ పాటలోకి డైవర్ట్ అవటం...

'చౌదరిగారూ... నేను నెక్స్ట్ సాంగ్ కంపోజ్ చేయాలంటే మీరు ఒక్కమగాడు అనటం మానేయాలి' అని అన్నాను సీరియస్‌గా. పాట అంత నచ్చబట్టి రిపీటెడ్‌గా హమ్ చేసుకుంటూ ఉన్నాడాయన. అది నా చెవిలో వినబడుతూంటే నేను నెక్స్ట్ సాంగ్‌కు ఎలా వెళ్లను!? 'చౌదరికి ఈ పాట అంత బాగా నచ్చిందన్న మాట' అని మనసులో సంతోషిస్తూనే అలా అన్నానన్నమాట. ఊరికి రాగానే ఆ పల్లవిని రాజమౌళికి వినిపిస్తే - బ్రహ్మాండంగా నచ్చిందతనికి. 'అరెరె మంచి పాట నాకు కాకుండా పోతోందే!' అని అన్నాడు కూడా.

సరే ఆ పాటకు చరిత్ర అదండి. చరణాలు మద్రాసులో మా ఇంట్లో చేశాం. పాట హైదరాబాద్‌లోని ప్రసాద్ ల్యాబ్‌లో రికార్డ్ చేశాం. ఎవరితో పాడించాలనే ప్రశ్న వచ్చింది. 'సుగుణాభి రాముడు సమరాన భీముడు' అన్నప్పుడు ... అఠాణా రాగంలో శాస్త్రీయ సంగీతం నేర్చుకున్న తెలుగింటి బాపుగారి బొమ్మలాంటి అమ్మాయి పాడినట్టు ఉండాలి. చిత్ర... తర్వాత కొంచెం చిత్రలాగ పాడగలిగే సునీత ... వీళ్ళు మైండ్‌లోకి వచ్చారు.

పబ్‌లవెంట తిరుగుతూ - జీన్స్ ప్యాంట్ తొడుక్కుని - హైదరాబాద్ హైటెక్ కల్చర్‌లో పెరిగిన - ఒకానొక మోడ్రన్ అమ్మాయి పాడినట్టు ఉండాలంటే... మన 'హేయ్‌రబ్బా' స్మిత బెటరా లేదా వసుంధరాదాసు బెటరా అని కూడా అనుకున్నాం. 'ఇద్దర్నీ పెట్టేద్దాం ఒకే హీరోయిన్‌కి' అన్నాను. "అలా వద్దండి. 'భం భం భోలే' లో మణిశర్మగారు ఎక్స్‌పర్‌మెంట్ చేసినట్టు నాకు ఇష్టంలేదు. ఒక అమ్మాయే పాడాలి" అన్నారు చౌదరిగారు. స్మిత అయితే ఎంతవరకు పాడగలదో ఎక్స్‌పర్‌మెంట్ చేస్తే తప్ప తెలియదు. చిత్రగారికి మగరాయుడిలా పాడగలిగే ఆ రఫ్‌నెస్ లేదు. ఎలా చావాలి అని తలబాదుకుని చిట్టచివరికి అనురాధా శ్రీరాం దగ్గర కన్ఫర్మ్ అయ్యాం.

ఈ అనురాధా శ్రీరాం గారు నాకు 'బొంబాయి ప్రియుడు'లో 'చందన చీరనుకట్టి' అనే పాటను పాడినప్పట్నుంచి పరిచయం. కొంచెం మోడ్రన్ కల్చర్, మన సంప్రదాయ సంగీతం... ఈ రెండింటిని సమపాళ్ళల్లో ఒంట పట్టించుకున్న సింగర్‌గా నాకు తెలుసు. సడన్‌గా అమ్మాయి పేరు చౌదరికి స్ట్రయికవ్వడం... ఆ అమ్మాయితో పాడించడం జరిగింది. షూటింగ్‌కు అర్జంటుగా కావాలంటే ముందర రప్పించి పాడించాం... అలా పాడించిన తర్వాత మళ్ళీ బాగా రుద్ది... రుద్ది... రుద్ది... మరోసారి పాడిస్తే ఆ పాటకు ఆ స్టాండర్డ్ వచ్చింది. అలా ఆ పాటని రెండుసార్లు రికార్డు చెయ్యాల్సి వచ్చింది. దీనికి **సంబంధించి ఓ తమాషా ఇన్సిడెంట్ ఉంది. అది చౌదరిగారిని అడగండి నేను చెబితే బావుండదు.**

చంద్రబోస్ ఈ పాటకి అద్భుతమైన లిరిక్స్ వ్రాసారు. 'శ్రీకృష్ణపాండవీయం'లో 'స్వాగతం సుస్వాగతం' లో లాగ కొన్ని లైన్లు దాంట్లో యాడ్ చేయడం... వాటిని చౌదరి అద్భుతంగా పిక్చరైజ్ చేయడం... ఇవన్నీ పాటను హిట్ చేశాయి. సిమ్రాన్ అయితే అదరగొట్టేసింది. "సిమ్రాన్ ఆ పాటలో చేసిన డ్యాన్స్‌కి నాకు పదిసార్లు చూడాలని ఉంది. ఆ సినిమా విసిడి దొరుకుతుందా?" అని నా వైఫ్ కాంప్లిమెంట్ ఇచ్చింది కూడా. ఈ పాట తర్వాత చాలామంది సిమ్రాన్‌కి భక్తులుగా మారిపోయారు. ఆల్‌రెడీ నా దగ్గర పనిచేసే గణేష్ అనే కుర్రాడు సిమ్రాన్‌కి వీర భక్తుడు. ఈ పాట దెబ్బతో మాతో సహా చాలామంది జోహార్లు అర్పించేశాం ఆ అమ్మాయికి. చక్కటి ఈజ్‌తో - వల్గారిటీ లేకుండా - శ్రుతి మించకుండా - చాలా అద్భుతంగా కుదిరిందీ 'ఒక్కమగాడు' పాట.

---

మాంఛి భోజనప్రియులు.

దానితోడు కంటిన్యూయస్‌గా రెయిన్ కురుస్తూనే ఉంది. అప్పుడు మనకి ఇష్టమైన తిండి తింటే ఎంత మత్తు ఆవరిస్తుందో తెలిసిన విషయమే కదా.... అలా తినటం... వచ్చి కూర్చుని మంచాల మీద పడి దొర్లడం....

కథ ప్రకారం సినిమాలో సిమ్రాన్ వేసిన బంగారం క్యారెక్టర్‌కి, హరికృష్ణగారు చేసిన సీతయ్య క్యారెక్టర్‌కి ఎలాంటి సంబంధం లేదు. సాంగ్‌లో కూడా ఆ ఎక్స్‌ప్రెషన్ రాకూడదు. తనింట్లో తలదాచుకున్న సిమ్రాన్ గురించి తెలుసుకుని... ఏ పరిస్థితుల్లో ఇలా పారిపోయి వచ్చావు అని హరికృష్ణగారు అడిగినపుడు... ఆ అమ్మాయి తనకి ఇష్టంలేని పెళ్ళి చేస్తున్నందుకు ఇంట్లోంచి పారిపోయి వచ్చాను అని చెప్పటం. అసలు ఎలాంటివాడు నీ ఊహల్లో ఉన్నాడు అని హరికృష్ణగారు అడిగినపుడు ఆ అమ్మాయి చెప్పే సన్నివేశంగా ఈ సాంగ్ అనేది అనుకోవడం జరిగింది.

ఈ బంగారం అనే క్యారెక్టర్‌కి పాత పాటలంటే మహాపిచ్చి. ఆ అమ్మాయి ఇంట్రడక్షన్ కూడా 'కనులు కనులతో కలబడితే ఆ తగవుకి ఫలమేమి' అనే సాంగ్‌తో ఓపెన్ చేశాం. 'సుమంగళి' సినిమాలో ఆ పాటకు నటించిన అక్కినేని నాగేశ్వరరావుగారిని ఇమిటేట్ చేస్తూ ఆ అమ్మాయి ఆనందం పొందడం లాంటి క్యారెక్టరైజేషన్‌తో ఆ అమ్మాయి క్యారెక్టర్‌ను ఎస్టాబ్లిష్ చేయడం జరిగింది.

ఒక అమ్మాయిని నీకు ఎలాంటివాడు కావాలి అని అడిగినపుడు... ఆ అమ్మాయి నాకు ఇలాంటి లక్షణాలున్న మనిషి కావాలి. ఇలాంటివాడు అయితే నాకు బాగుంటుంది. ఇలాంటివాడు అయితే కరెక్టుగా ఉంటుంది. ఫిజిక్ ఇలా ఉండాలి. అతని నడవడిక ఇలా ఉండాలి. అతని క్యారెక్టర్ ఇలా ఉండాలి... అనే కాన్సెప్ట్ మీద రకరకాలుగా చాలా సాంగ్స్ ఇప్పటికే వచ్చేశాయి. మనకేమో క్యారక్టర్ పరంగా సాంగ్ కావాలి. సాంగ్‌కేమో కొత్త ఎక్స్‌ప్రెషన్ కావాలి. పచ్చిగా చెప్పాలంటే - ఎలాంటి మగాడు కావాలి నీకు అంటే - ఫలానా ఒక్కమగాడు కావాలి నాకు అని ఆ అమ్మాయి చెప్పేట్టు ఎక్స్‌ప్రెషన్‌లాగ సాంగ్ చేద్దాం అని డిస్కస్ చేసుకున్నాం. ఆ అమ్మాయికి పాత పాటలంటే బాగా ఇష్టం కదా దాన్ని బేస్‌గా తీసుకుని కంపోజింగ్ చేస్తున్న టైంలో 'మల్లీశ్వరి'లోని 'ఆకాశవీధిలో' అనే సాకీని ఆలపించారు కీరవాణిగారు. ఆయన దగ్గర మెయిన్ ఎసెట్ ఏంటంటే... ఒక రకమైన కాన్సెప్ట్ ఆయనే క్రియేట్ చేస్తూంటారు. డైరెక్టర్‌తో కూర్చున్నప్పుడు ఆయన బుర్రకెక్కించుకున్న విధానంలోంచి ఆ కాన్సెప్ట్ క్రియేట్ అవుతుంది. మ్యాగ్జిమమ్ లిరిక్‌తో ట్యూన్ ఇచ్చేస్తుంటారాయన. ఈయన మ్యూజిక్ డైరెక్టర్‌గా ఉంటే సాంగ్స్ రాయడం చాలా ఈజీ.

అలా 'మల్లీశ్వరి' సాంగ్‌ని ఆయన సాకీలాగ మలచుకుని 'పెళ్ళీడుకొచ్చినా ఒంటిగా ఉన్నాను... పెనిమిటెట్లా ఉండాలో కలలు కన్నాను... ఏడతానున్నాడో వాడు ఒక్కగానొక్క మగాడు... నా ఊహలో అందగాడు..' అంటూ ఆ అమ్మాయి చెప్పేది ఆ ఇంప్రెషన్‌లో తీసుకుని ఇక్కడ్నుంచి ఫుల్ మోడ్రన్‌గా తీద్దాం. ఓల్డ్ ట్రెండ్ నుంచి కొత్త ట్రెండ్‌లోకి





ట్రాన్స్‌ఫర్మేషన్‌లాగా వచ్చినట్టు ఉంటుంది అని అనుకుంటున్నప్పుడు 'ఒక్కమగాడు' అనే ఒక వర్డ్‌ని ఆయన అన్నారు. జనరల్‌గా నాకు హార్మోనియం మీద ట్యూన్స్ చేసేవారంటే చాలా ఇష్టమండీ. కీరవాణిగారు హార్మోనియం పట్టుకుని దాంట్లో రకరకాలుగా కార్డ్స్ ప్లే చేసుకుంటూ ఎక్కడో దూరాంతరాల్లోకి వెళ్తుంటారు... అలా మర్మరింగ్ చేసుకుంటూ ఏదో ట్యూన్ ఆలాపన చేస్తున్న టైంలో ఒక్క మగాడు అనేది ఆయన నోట్లోకి వచ్చింది. అది నాకు బాగా నచ్చింది. 'ఒక్కమగాడు ఒక్కమగాడు' అని గిటార్ బిట్‌తో సహా అనేసరికి నాకు ఇంకా బాగా నచ్చింది. 'దాన్ని కీ వర్డ్‌కింద పెట్టుకుని ఏదన్నా సాంగ్ చేద్దాం సార్ మనం..., అది మాత్రం వదలొద్దు' అన్నాను. ఆయనకూడా అదే ఫీలింగ్‌లో ఉన్నారు. భలే వర్డ్ దొరికిందండి... దీన్ని ఇలా చేద్దాం అలాచేద్దాం అనుకుంటూ ఎంత ట్రై చేసినా ఎంత సేపటికీ ఏంతెగటల్లేదండి.

ఒక స్టేజికి ఏమైందంటే - జెమినీరావుగారు (తబలిస్ట్) 'మరొక రోజు అయిపోతుంది సార్ దాన్ని పట్టుకుని వేలాడితే పని జరిగేలాలేదు వేరేది ట్రై చేద్దామా' అన్నాడు. కీరవాణిగారు మాత్రం 'దానిమీదే ట్రై చేద్దాం లే ఎందుకంటే బాగుందనిపిస్తోంది' అన్నారు. సరేనని మేమిద్దరం అనుకోవడంలో ఆరోజు కూడా వేస్ట్ అయిపోయిందండి. సరదాగా మయూరిలో భోజనం చేసుకోవడం పడుకోవడం. పడుకుని అలా దొర్లుతున్న టైమ్‌లో... కీరవాణిగారు 'ఏమండి నాకో ఐడియా వచ్చింది ఎలా ఉందో చెప్పండి' అంటూ 'సుగుణాభిరాముడు సమరాన భీముడు ఎవరో ఎవరో అతగాడు ఒక్కమగాడు' అని మ్యూజిక్ బిట్‌తో పాటు రఫ్‌గా చెప్పారు. 'అబ్బా ఎక్సలెంట్‌గా ఉంది బాసూ.. బ్రహ్మాండంగా ఉంది. అదిరిపోయింది' అన్నాను. నేటివిటిలోంచి వచ్చి 'ఒక్కమగాడు' ఒకరకమైన రగ్గడ్‌గా ఓపెన్ అవుతుంది. ఒక హీరోయిజం ఉంది. అన్నిరకాలుగా ఒక పెద్ద హిట్ అయ్యే అవకాశం ఉంది. 'సుగుణాభి రాముడు సమరాన భీముడు' అనేది అటు సాఫ్ట్‌నెస్‌ని ఇటు రగ్గడ్‌నెస్ చెప్పేట్టుంది. నాకు అటు ఆ ఎడ్జ్ కావాలి ఇటు ఈ ఎడ్జ్ కావాలి. అన్ని రకాలా చెప్పే అవకాశం ఉంది. దీని ద్వారా సాంగ్‌కు ఒక కాన్సెప్ట్ క్రియేట్ అయ్యింది. అటు మెత్తగాను ఇటు రఫ్‌గాను డీల్ చేసే మల్టీడైమన్షన్... క్యారెక్టర్‌కు ఉండాలి. ఇలా అన్ని రకాల లక్షణాలు ఉండాలి అనేది నాకు బాగా నచ్చింది. మీరు మనసులో ఎంత ఆలోచించి... ఎంత మథన పడితే ఆ రెండు లైన్లు వచ్చాయో నాకు తెలియదు కాని వెరైటీగా చెప్పారు నాకు చాలా బాగా నచ్చింది అని ఆయనకు చెప్పేశాను. నాకు నచ్చిందనుకోండి బాగా ఎగ్జయిట్ అయిపోతాను. వెంటనే నా ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ వెంకటేశ్వరరావుకి నా వైఫ్ గీతకి ఫోన్ చేసి మంచి ట్యూన్ వచ్చింది ఒకసారి వినమని వారికి ఫోన్‌లో నాకు తెలిసిన పద్ధతిలో పాడి వినిపించాను.

ఎలాంటి అబ్బాయి కావాలని హరికృష్ణగారు అడిగారో ఆ లక్షణాలను వివరిస్తున్నప్పుడు కళ్ళముందున్న హరికృష్ణగారు కాకుండా నిజంగానే ఇన్ని రకాల లక్షణాలున్న మరొక మనిషిని చూపించాలి. కథలో ఆయనకు గాని ఆ అమ్మాయికి కూడా ప్రేమించుకునే ఉద్దేశ్యం లేదు కాబట్టి ఇంకో రూపం కనపడాలి. ఇప్పుడు ఎవైలబుల్‌గా వున్న హీరోలను చూపిస్తే రకరకాల ఇబ్బందులుంటాయి. వాళ్ళ ఇమేజిల పరంగా కాని... వాళ్ళ అభిమానుల నుంచి కాని రకరకాలుగా డెలికేట్ ఇష్యూ అవుతుంది. సినిమా సైడ్ నుంచి చూసినా కొంతమందికి నచ్చుతుంది కొంతమందికి నచ్చదు.

ఆ పెళ్ళీడు కొచ్చినా ఒంటిగా ఉన్నాను
అ SO SAD
ఆ పెనిమిటెట్లా ఉండాలో కలలు కన్నాను... ఊఁ...ఊఁ... ఊఁ... ఊఁ...
అ IS IT...?
ఆ ఊఁ... ఏడ తానున్నాడో వాడూ
అ: చ్ చ్ చ్ చ్ చ్
ఆ ఒక్కగానొక్క మగాడు
అ అంత స్పెషలా...?
ఆ ఊఁ... ఊఁ... ఊఁ... నా ఊహలో అందగాడు
అ నాన్చొద్దూ...
ప సుగుణాభిరాముడు... సమరాన భీముడు
ఎవరో ఎవరో అతగాడు ఒక్క మగాడు... ఒక్క మగాడు...
చెప్పిందే చేసేవాడు చేసేదే చెప్పేవాడు
ఎవరో ఎవరో అతగాడు... ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు...
చ జీన్సుప్యాంటు కట్టినా - గళ్ళ లుంగీ చుట్టినా... నీటుగాడు
జానపదుల పాటైనా జాజ్ బీటు రూటైనా... ఆటగాడు
మగువలకే మరుడు... ఔ...ఔ...ఔ... మదనుడికే గురుడు...ఏ...ఏ...ఏ...
మాటలు తను అనడు... ఔ... ఔ... ఔ... చేతలకిక ఘనుడు
ముక్కు మీద కోపం వాడు ముక్కుసూటిగ వెళ్ళేవాడు
ముక్కుతాడు నాకే వేస్తాడు...
అతల వితల సుతల సత్యభూతల భువనాలన్ని ప్రణమిల్లు పురుషుడు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు
కొమ్ములు తిరిగిన కండలు కలిగిన
కలలో మెదిలే మొనగాడు... ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు...
చ ఆకుచాటు పిందైనా ఆకసంలో చుక్కైనా... వేటగాడు...
లక్షమంది అడ్డున్నా లక్ష్యమంటూ ఏదైనా... పోటుగాడు...
మగసిరి గల రేడు... అయ్...అయ్...అయ్...
మనసున పసివాడు... ఏఁ...ఏఁ...ఏఁ...
శత మదగజ బలుడు అయ్... అయ్... అయ్... అతనికి ఎదురెవడు
పాత సినిమా హీరోలాగా సాహసాలు చేసేవాడు సాక్షాత్తూ నాకై పుట్టాడు
శాంత కరుణ రౌద్ర వీర అద్భుత శృంగారాది రస దేవదేవుడు...
ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు...
సుగుణాభిరాముడు... సమరాన భీముడు ఎవరో ఎవరో అతగాడు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు... ఆంధ్రుల తనయుడు అనితర సాధ్యుడు
నా కథ నడిపే నాయకుడు ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు...
ఒక్క మగాడు... ఒక్క మగాడు... ఒక్క మ... గా... డు...
ఒక్క ఒక్క మగాడు

నేను ఎవరికైతే వీరాభిమానినో... ఎవరివల్ల నేను సినిమాఫీల్డుకు ఇన్స్పయిర్ అయ్యి వచ్చానో... ఆ అమ్మాయి వివరించిన లక్షణాలు ఏవైతే ఉన్నాయో... ఆ లక్షణాలన్నీ కీర్తిశేషులు ఎన్.టి.ఆర్ గారికి ఉన్నాయి. పౌరాణికంలో బాగాచేశారు... సాంఘికంలో ప్రూవ్ చేసుకున్నారు జానపదంలో ఎక్సలెంట్‌గా చేశారు. ఏ సీజన్‌కి ఆ సీజన్ సినిమాలు చేసుకుంటూ వచ్చిన ఏకైక మల్టీడైమన్షన్ హీరో మన తెలుగు ఇండస్ట్రీకి రామారావుగారు. ఆయన్నే ఒక్కమగాడు కింద ప్రజెంట్ చేస్తూ ఈ సాంగ్‌ని తీస్తే ఎలా ఉంటుంది అన్న ఉద్దేశ్యంతో ప్రొసీడ్ అయ్యాం. మా ఆర్గ్యుమెంట్‌కి - క్రియేట్ చేసిన ట్యూన్‌వల్ల బాగా బలం చేకూర్చింది చరణం సెకండ్ హాఫండి. శ్రీకృష్ణపాండవీయంలో రామారావుగారి ఇంట్రడక్షనప్పుడు గ్రాంధికంతో కూడిన జయ జయ ధ్వానాలతో పొగిడే విధానం ఉంటుంది చూడండి. ఆ ఫ్రేజ్ చరణం సెకండ్‌హాఫ్‌కు పెడితే మళ్ళీ మనం అనుకున్న ఆ ఫ్యూజన్ వస్తూంది. ఇటు ఫస్టు హాఫ్ అంతా మోడ్రన్‌గా ఉండి సెకండ్ హాఫ్ అంతా నేటివిటీ అయ్యే అవకాశం ఉంటుంది. వెరైటీగా ఉంటుందని చరణంలో ఆ లైన్స్ ఫిక్స్ చేయడం జరిగింది. మేం ఎంత ఎగ్జయిట్ అయ్యామో చంద్రబోస్ అంతకన్నా ఎక్కువ ఇన్స్పయిర్ అయ్యి రాశాడండి. చంద్రబోస్ సామాన్యంగా ఒక చిన్న కుర్రాడిలా అమాయకుడిగా కనబడుతుంటాడు. కాని ఎక్స్‌ట్రార్డీనరీ టాలెంట్ ఉంది. నేను ఇంత కుముందు సీతారామశాస్త్రిగారితో కంటిన్యూయస్‌గా సాంగ్స్ రాయించాను ఒక సినిమాని నా గురువు వేటూరిగారితో రాయించాను ఇద్దరూ హైలీ టాలెంటెడ్ అయితే వాళ్ళ స్టాండర్డ్స్‌కు తగ్గకుండా చిన్న వయసులోనే ఆ రేంజ్‌లో తక్కువ టైమ్‌లో స్పీడుగా డెలివరీ చేసే మనిషి చంద్రబోస్.



అలా చంద్రబోస్ ఇన్స్పయిర్ అయ్యి ఒకరోజు రామానాయుడు స్టూడియోలో మేం షూటింగ్ చేస్తుంటే వచ్చి సాంగ్ లిరిక్స్ తీసుకొచ్చి చూపించాడు. ఆశ్చర్యపోయాను. "శాంత కరుణ రౌద్ర వీర అద్భుత శృంగారాది రసదేవదేవుడు ఒక్కమగాడు" అని ఫ్రేజ్ ఒకటి భలే పెట్టాడు. మా ఇద్దరికి ఇష్టమైన ఫ్రేజది. అలాగే 'అతల వితల సత్య భూతల..." కూడా! అన్నట్టు ఇంకో ప్రయోగం కూడా చేశాడండీ. 'ఆకుచాటు పిందైనా ఆకసంలో చుక్కైనా వేటగాడు' అంటూ క్రియను తీసేడు. కర్త ఉంది, కర్మ ఉంది. ఆకుచాటు పిందైనా ఆకసంలో చుక్కైనా కర్మ. వేటగాడేమో కర్త అన్నమాట. క్రియ అనేది లేకుండా ఒక సెంటెన్స్ ఫార్మ్ చేయడం అనేది మాకు ఎక్సలెంట్‌గా అనిపించింది. వెంటనే మ్యూజిక్ డైరెక్టర్ కీరవాణిగారికి వినిపించాం. ఆయన కూడా చాలా బాగుందన్నారు.

ఎవరితో పాడించాలనే దానిమీద మాకు పెద్ద డిస్కషన్ జరిగిందండి. ఎందుకంటే - ఫస్టు సాకీ క్లాసికల్ సింగర్ పాడాలి. 'ఒక్కమగాడు' కొంచెం మోడ్రన్‌గా ఫ్లెక్సిబుల్‌గా కావాలి. చిత్రగారి వాయిస్‌లో ఆ రగ్గ్‌డ్‌నెస్ రాదు. ఎల్.ఆర్.ఈశ్వరి టోన్‌లో మనకు తెలియని మగతనం ఉంటుంది కదండి ఆ టోన్ రావాలి. ఎలాగా అని అనుకుంటూ కన్‌ఫ్యూజ్ అవుతున్న సమయంలో క్లాసికల్ వరకూ ఒక సింగర్‌ను, రగ్గ్‌డ్‌నెస్‌కు మరొక సింగర్‌ను పెట్టి చేద్దామా అని కీరవాణిగారన్నారు. అలా అయితే ఇద్దరు హీరోయిన్లు పాడినట్టు ఉంటుందని అన్నాను. కొన్ని రోజులు కన్‌ఫ్యూజన్. ఆయన ఒక సింగర్ అనుకుంటే నేను ఇంకొకరిననుకోవటం. సరే చాలా అనుకున్నామండి కుదర్లేదు ఫైనల్‌గా షూటింగ్ డేట్ వచ్చేసింది. మాకు ఇంకా ఎవరూ దొరక్క కీరవాణిగారు ట్రాక్ పాడేశారు. మొదటిరోజు షూటింగ్ చేశామండి. సెట్‌లో మంచి కామెడీ. కీరవాణిగారి వాయిస్‌కి సిమ్రానేమో ఎక్స్‌ప్రెషన్ ఇవ్వాలి. 'ఒక్కమగాడు' అంటూ మగాడి వాయిస్ వస్తూంటే సిమ్రాన్ మాత్రం ఒక మేల్‌వాయిస్‌కి లిప్ ఇస్తున్నానే ఫీలింగ్ లేకుండా ఎక్సలెంట్ ఎక్స్‌ప్రెషన్ ఇచ్చింది. నాకే కొంచెం నవ్వులాటగా, ఇబ్బందిగా అనిపించింది. ఫుల్ సాంగ్ తీయలేదు. ఒకరోజు అయితే మ్యానేజ్ చేయగలం... బృంద చాలా ఫర్‌ఫెక్టు డ్యాన్స్ మాస్టర్. ఆమె చాలా ఎక్సలెంట్‌గా కొరియోగ్రాఫ్ చేసింది. నాకు ఏమి కావాలి ఎలాంటి మూమెంట్స్ కావాలి అని బాగా డైజెస్ట్ చేసుకుంది. ఎలాంటి సాంగ్ వై.వి.ఎస్. చౌదరి ఎక్సెప్ట్ చేస్తున్నాడు. సిమ్రాన్ బాడీలాంగ్వేజి ఎలాటి మూమెంట్స్‌ని యాక్సెప్ట్ చేస్తుంది. సాంగ్ ఎక్స్‌ప్రెషన్ ఏంటి అనేది ఆవిడకి బాగా అర్థమయింది. డ్యాన్స్ మాస్టర్, సిమ్రాన్ మేమందరం ఎట్టి పరిస్థితుల్లోనూ ఫిమేల్ వాయిస్ ఉంటే ఇంక ఎక్కువ ఎనర్జీతో ఉంటుంది ఎఫెక్ట్‌గా ఉంటుందని ఫీలయ్యాం.

అప్పుడు కీరవాణిగారు రామానాయుడు స్టూడియోలో గంగోత్రినో ఏదో రీ-రికార్డింగ్ చేస్తున్నారు. ఆయన్ని కలిసి 'అర్జంటుగా మార్చాలండి కొంచెం ఇబ్బంది అనిపిస్తోంది, షూటింగ్ చేయాలంటే కామెడీ ట్రాక్‌లా ఉంది' అని అన్నాం. ఆయన 'ఏం చేద్దాం ఏంచేద్దాం'అని అనుకుంటూంటే మైండులో అనురాధశ్రీరాం మెదిలింది. వెంటనే ఆయనకు చెబితే - 'కొన్ని రేంజ్‌లు ఆ అమ్మాయి దగ్గర రావండి. అయినా పాడించి చూద్దాం వాయిస్‌వరకూ అయితే మంచి వాయిస్ అవుతుందండి' అని ఆయనకూడా కన్విన్స్ అయ్యారు. మెయిన్ సింగర్‌గా కాకుండా షూటింగ్ పర్పస్‌కి అన్నట్టుగా ఈవెనింగ్ ఫ్లయిట్‌లో మద్రాసునుంచి ప్రత్యేకమైన టికెట్ తీసి ఆ అమ్మాయిని హైదరాబాద్ రప్పించి మిడ్‌నైట్ పదకొండున్నర పన్నెండు గంటలదాకా హింసపెట్టి సాంగ్ పాడించి మర్నాడు సాంగ్ షూట్ చేశాం. షూటింగ్ అయిపోయింది. బేతాళశవం మళ్ళీ తిరిగి చెట్టెక్కినట్టు. మళ్ళీ కొచ్చెను మొదటికొచ్చింది. ఎవరితో పాడించాలి ఎవరితో పాడించాలి అని అనుకుంటూ ఉండగా... ఒకరోజు కీరవాణి గారు 'బస్సెక్కివస్తావా' పాట కంపోజింగ్ కోసం మా ఇంటికి వచ్చారు. ఇద్దరం కలిసి వస్తుండగా మళ్ళీ ట్రాక్ క్యాసెట్ పెట్టి వినిపిస్తున్నాను. సాంగ్‌ని మళ్ళీ చాలా రోజుల తర్వాత ఇద్దరం ఫ్రెష్‌గా ఒకేసారి వినటంతో... ఆరోజు మనం అర్జంటువలన కొంచెం స్పీడుగా పాడించాం. టైమ్ తక్కువ తీసుకుని పాడించడం వల్ల కొన్ని సరిగ్గా రాలేదు ఈ వాయిసే కరెక్టు అనుకుని ఇద్దరం మెంటల్‌గా ఫిక్సు అయిపోయాం." చిన్న చిన్న కరెక్షన్ చేయించాలండి. అప్పుడు మనం రఫ్‌ట్రాక్ అనుకుని మనం రఫ్‌గానే పాడించాం టైమ్ లేదని. ఇప్పుడు ఈ అమ్మాయి వాయిస్‌తోనే పక్కాగా పాడిస్తాను" అని ఆయన కాన్ఫిడెంట్‌గా అనడం... డెసిషన్ తీసుకోవడం జరిగింది. అనురాధశ్రీరాంని రెండవసారి పిలిపించి ప్రత్యేక శ్రద్ధ తీసుకుని బాగా పాడించారాయన. అది విన్న తర్వాత మా డెసిషన్ కరెక్టు అని ఫీలయ్యాం. తర్వాత సాంగ్ ఎడిట్ చేసి చూసుకున్న తర్వాత ఇంకా ఎక్కువ ఆనందం ఫీలయ్యాం.

ఇవాళ ఆ సాంగ్ రెస్పాన్స్ ఎలా ఉంది అంటే - ఫ్యామిలీలో చిన్న ఏజి గ్రూప్ నుంచి పెద్ద ఏజ్ గ్రూప్ వరకూ ఎవరు కూర్చున్నా కూడా ఎక్కడా వల్గారిటి లేకుండా సిమ్రాన్ భలేగా డ్యాన్స్ చేసిందే... సిమ్రాన్ బాడీ లాంగ్వేజి బాగుందే అని ఫీలవ్వడం, చాలామంది ఆ సాంగ్ కోసం 4-5 టైమ్స్ సినిమాకు వెళ్ళడం అనేది కూడా నాకు థ్రిల్ కలిగించింది. నా కెరీయర్‌లోకూడా బెస్ట్ సాంగ్ అది.




**విడుదల : మయూరి ఆడియో**
**వెల : రూ. 65/-**




మానసిక ప్రశాంతతను చేకూర్చే అనుభూతులలో ఆధ్యాత్మిక అనుభవం ఒకటి. ఈ అనుభవం బలం అనిర్వచనీయమే... అయినా వ్యక్తులు ఆ అవ్యక్తానందాన్ని తమ తమ సంస్కారాలను బట్టి తమతమ శక్తుల మేరకు అవిష్కరించుకుంటూ, పంచుకుంటూ, అందుకుంటూ తృప్తిని పొందుతుంటారు. ఎంతటివారైనా సరే ఇందుకు అతీతంగా ఉండడం కష్టం.

సినీ పరిశ్రమలో అడుగిడిన రెండు మూడేళ్ళలోనే సంగీత దర్శకుడిగా ఉన్నత శిఖరారోహణనుభవాన్ని చవిచూచిన ఆర్.పి. పట్నాయక్ - ఆ విజయ పవనాలలో కన్నా ఆధ్యాత్మికతలోనే ఆత్మకు కావలసిన ప్రాణ వాయువు అందుతుందని నమ్మి ఆచరణ రూపంగా ఆవిష్కరించిన ఆ (స్వామి) చరణ రూపమే - ఓం స్వామి శరణమిదే అనే డబుల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్.

మయూరి ఆడియో ద్వారా విడుదలైన ఈ డబుల్‌ప్యాక్ ఆడియోలో అయ్యప్ప స్వామికై ఆర్పీ స్వరపరిచిన 9 స్వరరచనలున్నాయి. వీటిని చైతన్యప్రసాద్, పెద్దాడమూర్తి రాయగా సి.వి.కృష్ణమోహన్ ఈ క్యాసెట్ల రూపకల్పనకు అవసరమైన ఆర్థిక సహాయాన్ని అందించారు.

క్యాసెట్-1లో తొలిగీతం - స్వామి అయ్యప్ప జననాన్ని పూర్వాపరాలతో సహా విశదీకరించే స్వరరచన. చైతన్యప్రసాద్ లోని సాహితీ వైభవానికీగీతం ప్రతీక. గంగాధర్, ఉష, రాము, సింహ, దిలీప్, బృందం ఆలపించిన ఈ స్వరరచనకు ఉపయోగించిన వివిధ రాగాల రాగమాలికలో అఠాణా, హిందోళం, చంద్రకోస్, కన్నడ, హంసానంది, మాండ్, తిలంగ్ రాగాలున్నవని ఈ సమీక్షకుని అభిప్రాయం. ఇంతవరకు పట్నాయక్‌ను సినీగీతాల కోణంలో చూసిన వారికి ఈ స్వరరచన అతనిలోని మరో కోణాన్ని ఆవిష్కరించిందనిపిస్తుంది.

శబరిగిరీశా అయ్యప్పా అంటూ వివిధ నామాలతో అయ్యప్పస్వామిని స్తుతిస్తూ - మధ్య మధ్య 'ఓం స్వామి శరణమిదే' అనే మకుటంతో విరామాన్ని తీసుకునే - నామాలపాట ఈ క్యాసెట్‌లో రెండవ గీతం. ఆర్పీ తన బృందంతో ఆలపించిన ఈ గీతాన్ని సంకలించినది చైతన్యప్రసాద్. ఈ స్వరరచనలో కన్నడ రాగచ్ఛాయలు ఎక్కువగా కనిపిస్తాయి.

శ్రీకరం శుభకరం మకరదీపం అనే గీతాన్ని కూడా ఆర్పీ తన బృందంతో ఆలపించడం జరిగింది. పూజా సమయాలలోనే కాకుండా మామూలుగా ఉండే వేళల్లో కూడా ఆలపించుకునే అన్యధన్య గీతాల స్థాయి ఈ గీతానికి సమకూరింది. ముఖ్యంగా 'అసతోమా' అని ప్రధాన గాత్రం అంటుంటే 'సద్గమయ' అని బృందం తమ కంఠాలు కలపటం వల్ల పాటకు మరింత పటిష్టత చేకూరింది. దర్బారీ రాగచ్ఛాయలు కనిపించే ఈ గీతాన్ని ఒకటి రెండు సార్లు వింటే చాలు తర్వాత అదే మనలను వెంటాడుతూ వుంటుంది. పెద్దాడమూర్తి ఈ గీతానికి రచయిత.

'పద్దెనిమిది ఈ పద్దెనిమిది మెట్లు - మొక్కిన తొలగును చీకట్లు' అనే గీతం క్యాసెట్-2లో ఏ సైడున గల తొలిగీతం. దిలీప్ తన బృందంతో ఆలపించాడీ గీతాన్ని. సంగీతం సాహిత్యం సమపాళ్ళలో జతపడిన ఈ గీతం కూడా హాయిగా ఆలపించుకునేలా వుంది. ఒకటవ మెట్టుకి దైవం ఒకడేనని తెలిసిందని చెబుతూ రెండవ మెట్టుకి జ్ఞానం అజ్ఞానంని, మూడవ మెట్టుకు త్రికాలాలని, నాల్గవ మెట్టుకి చతుర్వేదాలని... ఇలా పంచభూతాలని పంచామృతాలని, అరిషడ్వర్గాలని, ఏడు లోకాలని, అష్టదిశలని అష్టసిద్ధులని, నవరసాలని నవచైతన్యాన్ని, దశావతారాలని - దశలని... పదవ మెట్టుదాకా ఒక్కొక్క మెట్టుకి అన్వయించుకుంటూ పెద్దాడమూర్తి రాసిన తీరు శ్రోతలను ఆకట్టుకుంటుంది.

ఆర్.పి. తన బృందంతో ఆలపించిన 'శబరి కొండపై తిరునాళ్ళు... తిరునాళ్ళు'అనే తిరునాళ్ళ పాటకు వివరణ కొంచెం అవసరం. పల్లవి ఎత్తుగడలో ఈ ట్యూన్ ఎక్కడో విన్నామే అని అనిపిస్తూ వుండగా 'స్వామి అంటే స్వామి అండి మచ్చలేనిదేవుడండి' అనే లైను రాగానే సినీ గీతాలతో పరిచయం వున్న వారెవరికైనా స్ఫురించేస్తుంది - ఈ పాట ట్యూన్ 'నిజం' సినిమాలోని 'రంగురంగుల ముగ్గుల్లు' పాటలో 'రాముడంటే రాముడయ్యో పేదవారి దేవుడయ్యో' అనే లైన్‌కి దగ్గరగా వుందని...! నిజానికి 'నిజం'లోని ఆ పాట ట్యూన్‌నే మొదట్నించి చివరి వరకు యధాతథంగా వుపయోగించుకోవడం జరిగిందిక్కడ.

ఒక సంగీత దర్శకుడు ఒకచోట ఇచ్చిన ట్యూన్‌ని ఇంకొక చోట మరో మారు ఉపయోగించడానికి కారణం - వేరే ట్యూన్‌ని చేసే చేవ లేక గాని, చెయ్యలేక గాని కాదని, ఆ ట్యూన్ మీద తనకున్న విపరీతమైన మక్కువేనని గ్రహించాలి. సినీ గీతాల్ని, చిత్రేతర గీతాల్ని సమాంతరంగా అభిమానించే శ్రోతలకు ఇలాంటి ప్రక్రియలు కొత్త కాదు. లోగడ 'మేనకోడలు' అనే సినిమాలో దాశరథి రాసిన 'తిరుమల మందిర సుందరా' అనే గీతాన్ని సుశీలతో స్వీయ సంగీత దర్శకత్వంలో పాడించిన ఘంటసాల - ఆ సంగీత సాహిత్యాలపై తనకు గల మక్కువతో ఆ పాటను తిరిగి పాడగా ఆ గీతం ప్రైవేట్ రికార్డ్‌గా రిలీజయింది. ఇవాళ బైట ఎక్కువగా వినిపించేది ఈ పాటే...! అసలు పాట సుశీల పాడిందన్న విషయమే తెలియదు చాలామందికి. అలాగే మల్లాది రామకృష్ణశాస్త్రి గారు రాసిన 'గిరిజాకళ్యాణం' యక్షగానం - మొత్తం ఘంటసాల పాడిన వెర్షన్ ఒకటుండగా సుశీల, వైదేహి, కోమల, మల్లిక్, మాధవపెద్ది సత్యం తదితర బృందంతో ఘంటసాల 'రహస్యం' చిత్రం కోసం పాడిన వెర్షన్ కూడా ఉంది.

ఇక ఈ క్యాసెట్‌లోని 'తిరునాళ్ళ' పాట విషయానికొస్తే రచనాపరంగా చైతన్యప్రసాద్ చక్కని సాహిత్యాన్ని ప్రశంసార్హమైన రీతిలో అందించాడు. ముందు పేర్కొన్న రెండు ఉదాహరణలలోనూ సంగీత సాహిత్యాల విషయంలో పెద్దగా మార్పులేదు. గాన వైవిధ్యమొక్కటే తేడా! కానీ ఇక్కడ... 'నిజం' సినిమాలో కులశేఖర్ అందించిన సాహిత్యంతో ఏమాత్రం సాన్నిహిత్యం లేని రచనా ప్రతిభను ప్రదర్శించాలి. ఈ విషయంలో చైతన్యప్రసాద్ చూపిన ప్రావీణ్యానికి ఎంతగానో మెచ్చుకోవాలి.

'లాలీ లాలి లాలీ - కరుణాలవాల లాలీ' అంటూ ఉష, బృందం పాడిన లాలిపాటను పట్నాయక్ ఇప్పటివరకూ తను చేసిన స్వరరచనలలో 'వన్ ఆఫ్ ది బెస్ట్'గా చెప్పుకోవచ్చు. యమన్ రాగంలో ఎంతో హాయిగా ట్యూన్ చేశాడీపాటని. యమన్ రాగాన్ని ఉపయోగించుకోవడంలో ఒక్కొక్క సంగీత దర్శకుడికీ ఒక్కొక్క ముద్ర వుంటుంది. 1961లో 'బాభీకి చుడియా' అనే చిత్రం ఒకటొచ్చింది. లతా మంగేష్కర్ పాడిన ప్రసిద్ధ గీతం - 'జ్యోతికలశ్ ఛల్‌కే' ఇందులోనిదే. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు సుధీర్ పడ్కే. ఈ చిత్రంలోనే ఆయన స్వరపరచిన 'లౌలగాతీ గీత్ గాతీ' అనే పాట ఇంకొకటి వుంది. రసజ్ఞ శ్రోతలెందరికో అందకుండా పోయిన అతి గొప్ప గీతమిది.

ఈ పాటలోని ఇంటర్ల్యూడ్స్‌ని - వాటిని వినిపింప జేయడానికి ఎన్నుకున్న వాద్యాలని -

**(దయచేసి 64వ పేజీలో చూడండి)**

రచన: చంద్రబోస్ (1) గానం: ఎస్.పి.చరణ్

కో: ఓహోహోహో....ఓహోహోహో....ఓహో ఓహో హో(8)
ప: ఓహో హో...హో హో..ఓహో హో...హో హో..
ముత్యాల పల్లకిలో నా కలలరాణి అదిగో
ఆకాశ వీధులలో నా కనుల వెలుగు అదిగో
పేరే స్వప్నబాల ఊరే మేఘమాల చేరువయ్యేనా ఒకనాడు
వలపుల చినుకులు కురిసిన తొలకరిలో
కో: ఓహోహోహో....ఓహోహోహో....ఓహో ఓహో హో
అ: ముత్యాల పల్లకిలో నా కలలరాణి అదిగో
చ: నేను చూసిన నయనాలు ఉషస్సులో కిరణాలు
నవ్వు తరగని అధరాలు తేనె కొలనులు
లేత చిగురుల చెక్కిళ్ళు ఉగాదిలో మావిళ్ళు
లేచి నడిచిన పాదాలు పూలమడుగులు
మెరిసిన ముంగురులు మనసుకు లంగరులు
సొగసుల భంగిమలు నా వయసుకు గింగిరులు
నేనో బ్రహ్మచారి తానో రాకుమారి ఏకమయ్యేనా ఒకనాడు
మనసులు కలిసిన మన్మథ నగరంలో
కో: ఓహోహోహో....ఓహోహోహో....ఓహో ఓహో హో
అ: ముత్యాల పల్లకిలో నా కలలరాణి అదిగో
చ: దోచుకున్నది దొరసాని సరాసరి హృదయాన్ని
గుచ్చుతున్నది గురిచూసి మల్లెబాకుని
కన్నె సొంపుల సంకెలతో ఎకా ఎకీ అల్లుకుని
నన్ను చివరికి చేసింది జన్మఖైదుని
నా మది సీమలలో ప్రేమకు ఆమనివే
నారిలోకములో చోర శిఖామణివే నేనే నీకు బందీ నీతో రాసి ఉంది
వేచి ఉంటాను వెయ్యేళ్ళు కమ్మని ఊహల కారాగారంలో...
కో: ఓహోహోహో....ఓహోహోహో....ఓహో ఓహో హో
అ: ఓహోహోహో....ఓహోహోహో....ఓహో ఓహో హో

రచన: చంద్రబోస్ (2) గానం: ఉదిత్‌నారాయణ్, చిత్ర

అ: ఏం ఒంపులు పెంచావే దుంపదెగ నీ దుంపదెగ
నాకొంపను ముంచావే దుంపదెగ నీ దుంపదెగ
పడీపడీ జతపడీ చెడీ చెడీ మతిచెడీ
నీ బిడియపు బంగాళా దుంపదెగ
ఆ: ఏం చూపులు చూశావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
ఎద దోపిడి చేవావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
విడీ విడీ మడి విడీ పడీ పడీ కలబడీ నీ గడసరి చిలకడా దుంపతెగ
అ: దుంపదెగ కొబ్బరికాయకు కోకే కడితే నీలా ఉంటుంది
పచ్చనైన పనసపండుకు పైటే కడితే నీలా ఉంటుంది
ఆ: దుంపతెగ మిరపకాయకు మీసంపెడితే నీలా ఉంటుంది
విచ్చుకున్న మొగలిపువ్వు మగాడయితే నీలా ఉంటుంది
అ: అణుబాంబుకి అందం ఉంటే నీలాగే ఉంటుంది
ఆ: తూఫానుకి తాపం వస్తే నీలాగే ఉంటుంది
అ: కరెంటు... తీగకు... నరాలే బిగిస్తే మనలాగే.. లాగే.. లాగే.. ఉంటుంది
ఆ: ఏం కూతలు కూశావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
ఎదలోతులు చూశావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
అ: పడీ పడీ జతపడీ చెడీ చెడీ మతి చెడీ నీ బిడియపు బంగాళా దుంపదెగ
ఆ: దుంపదెగ నువ్వు దొంగలా లాగకపోతే కొంగే కాదంటా
ఎప్పుడైనా నువ్వు ఎంగిలి చెయ్యకపోతే పొంగే కాదంటా
అ: దుంపదెగ నీకు సన్నగా గీటకపోతే కన్నే కాదంటా
ఎప్పుడైనా నిన్ను నున్నగా అంటకపోతే ఒళ్ళే కాదంటా
ఆ: నీ చేతికి చిక్కకపోతే చెక్కిళ్ళే కావంటా
అ: నీ ఒళ్ళో ఊరకపోతే బొబ్బిళ్ళే కావంటా
ఆ: నీ పూజ లోనా వాడకపోతే నీకోసం పూలే పూలే కావంటా
అ: ఏం మాటలు నేర్చావే దుంపదెగ నీ దుంపదెగ
రసవంటలు వారిచావే దుంపదెగ నీ దుంపదెగ
పడీ పడీ జతపడీ చెడి చెడీ మతిచెడీ
నీ బిడియపు బంగాళా దుంపదెగ
ఆ: ఏం చూపులు చూశావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
ఎద దోపిడి చేశావోయ్ దుంపదెగ నీ దుంపదెగ
విడీ విడీ మడివిడీ పడీ పడీ కలబడీ
నీ గడసరి చిలకడా దుంపదెగ





రచన: చంద్రబోస్ (3) గానం: ఎస్.పి.బాలు, చరణ్, పల్లవి

నరేష్ : మామగారూ పిల్లనచ్చింది.. చాలాబాగుంది
ఆర్.పి : అల్లుడుగారూ ఈనాడూ ప్రేమించుపెళ్లాడూ
మోనిక: డాడీ.. డాడీ.. అతను జేబుదొంగా
ముసుగుదొంగా అడవిదొంగా ఇంటిదొంగా
వీడెక్కడి మొగుడండీ...
నరేష్ : మామగారూ... ఆర్.పి : అల్లుడుగారూ..
ఆర్.పి : బాబూ... ప్రియమైన నీకు
మనసులోమాట చెప్పాలని ఉంది... ఆమె... అల్లరిపిల్ల...
నరేష్ : అంకుల్.. సాహసమే నా ఊపిరి.. గెలుపునాదే..
ఆర్.పి : పరశురాం... నీతో అమ్మాయి కాపురం
చూడాలని ఉంది... ఊ...పదండి ముందుకు
నరేష్ : ఒట్టేసి చెబుతున్నా... ఓ చినదానా..
నువ్వు నాకు నచ్చావు... నిన్నే ప్రేమిస్తా...
నినుచూడక నేను ఉండలేను మైనా
మనసంతా నువ్వే.. నిన్నే పెళ్లాడతా..
మోనిక: కోరుకున్న ప్రియుడు... జెంటిల్‌మేన్ జగదేకవీరుడు...
కాబోయే మొగుడు... జానకి రాముడు... ఒకే ఒక్కడు..
నరేష్ : నువ్వులేక నేనులేను... నువ్వేకావాలి.....
మోనిక: క్రిమినల్... కిల్లర్... ఇడియట్... ఆ ఒక్కటీ అడక్కు..
నరేష్ : మామగారు పిల్లనచ్చింది... చాలాబాగుందీ..
ఆర్.పి : అల్లుడుగారూ... ఊరికిమొనగాడు..
వీడు సామాన్యుడు కాడు..
మోనిక: డాడీ డాడీ.. అతను... మాయలోడు...
మోసగాడు... కేటుగాడు... స్టేటురౌడీ... వీడెవడండీ బాబూ..
నరేష్ : డామిట్... కథ అడ్డం తిరిగింది..
ఆర్.పి : ఓరి నీప్రేమ బంగారంకానూ... జయమ్ము నిశ్చయమ్మురా..
జయం మనదేరా... రా...
నరేష్ : ఏవండీ.. ఆవిడొచ్చింది..
ఆర్.పి : రామ్మా... చిలకమ్మా.. పాపం పసివాడు... ప్రేమికుడు...
మంగమ్మగారి మనవడు.. మన్మథుడు...
రావణుడే రాముడైతే... మనసిచ్చిచూడు
దొంగాట అంతం ఐతే... ప్రేమించిచూడు
మోనిక: అప్పుడప్పుడు... ఈ అబ్బాయి చాలా మంచోడు
అల్లరోడు... ఒకటో నెంబర్ కుర్రాడు...
ఆహ... నిజం... నువ్వునేను... ఈడుజోడు
నరేష్ : హాయ్... లైఫ్‌లో వైఫ్... నువ్వే నువ్వే
మామగారు పిల్లనచ్చింది... దీవించండి..
ఆర్.పి : అల్లుడుగారు... శుభమస్తు... కళ్యాణ ప్రాప్తిరస్తు..
మోనిక: డాడీ డాడీ... అతను.. భలేదొంగ...
మంచిదొంగ... దొంగమొగుడు...
దొంగగారూ స్వాగతం..
ఆర్.పి : సంతోషం.. ఔనూ వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు
దేవతలారా దీవించండి... శ్రావణ శుక్రవారం... శుభలగ్నం...
కన్యాదానం... మధురానగరిలో... పెళ్ళిపందిరి
గాంధీనగర్ రెండోవీధి... పెళ్ళిసందడి..
సకుటుంబ సపరివార సమేతంగా... మా ఇంటికి రండి...
ప్రేమతో... ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం.. ఒక చిన్నమాట...
పెళ్ళిరోజు... బాబాయ్ హోటల్... వివాహా భోజనంబు... రాత్రి...
శ్రీకనక మహాలక్ష్మి రికార్డింగు డాన్స్‌ట్రూపు
సందడే... సందడి...

రచన : చంద్రబోస్ **4** గానం : ఎమ్.ఎమ్.కీరవాణి, స్మిత

అ: పడక పడక పడక పడక ప్రేమలోన పడ్డందుకు
నా పంచప్రాణాలు నీమీద పెట్టినందుకు
సఖీప్రియా... సఖీప్రియా... సఖీప్రియా... సఖీప్రియా...
నన్ను వదిలిపోనని... ప్రేమ తరిగిపోదని మాటీయవా...వా
ఆ: PROMISE... PRO...MISE
కో: తుంతానన...తుంతానన...తుంతానన...తుంతానన...
అ: తామరాకు మీది నీటిబొట్టు కాను
మనసులోకి చేరి విడిచిపెట్టి పోను
ఆ: మండుటెండలోన మంచుబొమ్మకాను
మారిపోను నేను మరిచిపోను నిన్ను
అ: పూలతీగపైన నేను తేనెటీగ కానని
పూలలోన పెట్టి నిన్ను చూసుకుంటానని
పూలమాలవేసి నిన్ను ఏలుకుంటానని
మాటీయనా... ఆ..ఆ..మాటీయనా... అ: ॥పడక॥
ఆ: పేకమేడలాంటి ప్రేమ నాది కాదు
వేల జన్మలైనా కూలిపోదు చూడు
అ: మెరుపు కాంతిలాంటి మమత నాది కాదు
ఎంతకాలమైనా మలిగిపోదు చూడు
ఆ: నిన్ను చూస్తే సిగ్గుపుట్టి మాటలేవిరావని
సిగ్గు నువ్వు చిరుముతుంటె మాట మార్చబోనని
నీటిపైన రాతలాంటి మాట నాది కాదని
మాటీయనా... మాటీయనా
అ: పడక పడక పడక పడక ప్రేమలోన పడ్డందుకు
ఆ: నా పంచప్రాణాలు నీమీద పెట్టినందుకు
అ: సఖీప్రియా... ఆ: ఊ..ఊ.. అ: సఖీప్రియా... ఆ: లలాల...
నన్ను వదిలిపోనని... ప్రేమ తరిగిపోదని మాటీయవా...వా
అ: PROMISE... PRO...MISE



రచన: చంద్రబోస్ **5** గానం : రవివర్మ, కౌసల్య

ఆ: పెళ్ళంటూ చేసుకుంటే యిట్టాంటిదాన్నే
హోయ్... హోయ్... హోయ్ హోయ్
గిల్లంటూ చేసుకుంటే ఈ పిల్లదాన్నే
హోయ్.. హోయ్.. హోయ్ హోయ్
కుదురైన ముదురైన చిన్నోడికి
కలరున్న కళలున్న చినదానికి
కళ్యాణం జరిపించనీ.. నీ.. నీ.. ॥పెళ్ళంటూ॥
అ: సిగ్గు పక్కనపెట్టి సొగసు మూటలుకట్టి
చీకటింటి చాటుకురా..
ఆ: వస్తా... వాటేస్తా...
ఆ: కొంచెం ఓపికపట్టి కునుకు దూరం నెట్టి
కన్నెజాజి తోటకు రా..
అ: వస్తా... కాటేస్తా...
అ: ముందు ప్రేమాపురం పేటకు రా
ఆపై కామాపురం కోటకు రా
ఆ: ఎదలోన కాస్త చోటు చాలు
ఏచోట కైనా రెడీ.. డీ... డీ..డీ ॥పెళ్ళంటూ॥
అ: ఎంతో తాపం పుట్టి ఎడమ కన్నే కొట్టి
ముద్దుపండు విందుకురా
ఆ: వస్తా... వడ్డిస్తా...
కొంటె ఆకలితోటి కోక కంచెను దాటి
కొత్తచేను మేతకురా
అ: వస్తా... మెక్కేస్తా...
అ: ఆడ తీర్థాలన్నీ తీసుకురా వేడి నైవేద్యాలే వండుకురా
ఆ: నూరేళ్ళు నువ్వు తోడు ఉంటె
రుచులన్నీ నీవే మరి... రి... రి... రి... ॥పెళ్ళంటూ॥



రచన :చంద్రబోస్ **6** గానం : ఎస్.పి.బాలు, సునీత

అ: పలుకే బంగారమాయెనా సిగ్గంత పోయే
సరికే తెల్లారిపోయెనా
ఆ: పలుకే బంగారమాయెనా సిగ్గంత పోయే
సరికే చల్లారిపోయెనా
అ: నువ్వంటె నాకెంతో యిష్టమని
నీతోడు లేకుంటె కష్టమని
నీమీద నాకుంది లవ్వు అని
ఎవరేమి అనుకున్న గానీ - అన్న పలుకే బంగారమాయెనా
ఐ లవ్ యూ అన్న పలుకే బంగారమాయెనా
ఐ వాంట్ యూ అన్న పలుకే బంగారమాయెనా
ఆ: పంతాలు నీతోటి పట్టనని
పందాలు ఈ పూట వేయనని
అందాలు ఇమ్మంటూ అడగనని
దర్జాగా దోచుకుపోతానన్న పలుకే బంగారమాయెనా
సిగ్గంత పోయే సరికే చల్లారిపోయెనా...
అ: తెలుగు భాషలో ప్రేమిస్తే... ఆంగ్ల భాషలో లవ్ చేస్తా
ఆ: గాలి భాషలో లాలిస్తే... పూల భాషలో పూజిస్తా
అ: మౌన భాషలో మాటిస్తే... మనసు బాషలో మనువాడేస్తా
ఆ: కంటి భాషలో కబురిస్తే... కులుకు భాషలో కథలే చెబుతా
అ: ఏ భాషలేనిది సరసమని ఏకంగ సరసకు చేరమని
ఆ: చేరాక జరిగేది చెప్పకని చేసేది చేసుకు పోవాలన్న పలుకే...
చిన్న పలుకే బంగారమాయెనా... ఆ... ఆ...
అ: ఐ లవ్ యూ అన్న పలుకే...
ఆ: ఉంది ఉందని ఊరిస్తా లేదు లేదని అందిస్తా
అ: వద్దు వద్దని వాటేస్తా మధ్య మధ్యలో వదిలేస్తా
ఆ: చేదు చేదుగా తీపిస్తా బాధ బాధగా బాగుంటుందా
అ: చల్ల చల్లగా ఉడికిస్తా చాలు చాలని అడిగేస్తుంటా
ఆ: యీ మాటలన్నీ చేటు అని సయ్యాట ఒకటే సౌఖ్యమని
అ: ముద్దాటలే మొదలెట్టమని మొగుడాటకే రా... రమ్మని
అన్న పలుకే... పలుకే బంగారమాయెనా..
ఆ: పలుకే బంగారమాయెనా...
అ: పలుకే బంగారమాయెనా... ॥పంతాలు॥



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



ఎమ్.అర్జునరాజు సమర్పించు రోజా మూవీస్

# మా అల్లుడు వెరీగుడ్

గాడిద గుడ్డేంకాదు

ఇ.వి.వి. సత్యనారాయణ

ఎమ్.రామలింగరాజు-సి.వెంకటేశ్వర రావు . యం.యం. కీరవాణి

జనార్థన మహర్షి . వి. శ్రీనివాస రెడ్డి . చంద్రబోస్ . గౌతంరాజు . స్టన్‌శివ . ఇ.వి.వి. గిరి



ఎమ్.అర్జునరాజు



ఎమ్.రామలింగరాజు

## తారాగణం

రాజేంద్రప్రసాద్, నరేష్, రమ్యకృష్ణ, మౌనిక, యం.యస్.నారాయణ, ఎల్బీ శ్రీరామ్, బ్రహ్మానందం, కోవైసరళ తదితరులు

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| పాటలు | : | చంద్రబోస్ |
| మాటలు | : | జనార్ధన మహర్షి |
| డ్యాన్స్ | : | తార, కళ, రాజశేఖర్, కృష్ణారెడ్డి |
| ఫైట్స్ | : | స్టన్ శివ |
| కెమెరామెన్ | : | వి.శ్రీనివాసరెడ్డి |
| ఆర్ట్ | : | వి.శ్రీనివాసరాజు |
| ఎడిటింగ్ | : | గౌతంరాజు |
| పి.ఆర్.ఓ. | : | 'ట్రేడ్ గైడ్' వెంకటేశ్వరరావు |
| పబ్లిసిటీ | : | రాంబాబు పోస్టర్ యాడ్స్ |
| సంగీతం | : | యం.యం.కీరవాణి |
| సమర్పణ | : | ఎం.అర్జునరాజు |
| సహ నిర్మాత | : | సి.వెంకటేశ్వరరావు |
| నిర్మాత | : | యం.రామలింగరాజు |
| దర్శకత్వం | : | ఇ.వి.వి.సత్యనారాయణ |



ఇ.వి.వి.సత్యనారాయణ



యం.యం.కీరవాణి



చంద్రబోస్




# ఇండీపాప్ 'దేవకన్య'

# సునీతారావ్



ఆ గొంతులో స్పష్టమైన వ్యక్తిత్వం ధ్వనిస్తుంది... ఆ సంగీతంలో చక్కటి సందేశం దాగుంటుంది. అందుకనే ఇండీపాప్ సంగీత సాగరంలో ఆమె పుష్కర కాలంలో కేవలం ఆరు ఆల్బమ్స్‌ను మాత్రమే రూపొందించినా ఆ పేరుకు చిరస్థాయి ఖ్యాతి లభించింది. అలీషా చినాయ్, శ్వేతాశెట్టి లానే తొలితరం ఇండీపాప్ గాయని సునీతారావ్. బాల్యం నుండే ఆమెకు సంగీతంతో సంపర్కముంది. అది తల్లి ద్వారా లభించిన వరం. జర్మనీలో 1967 ఏప్రిల్ 5న డా॥ డి.కె.రావు, కోమల దంపతులకు సునీత జన్మించింది. ఆమె బాల్యంలోనే కుటుంబం భారత్‌కు తరలివచ్చింది. సునీత ప్రాథమిక విద్య ముంబాయిలోని బొంబే ఇంటర్నేషనల్ స్కూల్‌లో జరగ్గా, కాలేజీ చదువు సెయింట్ జెలీర్స్‌లో పూర్తిచేసింది. సునీత తల్లి కోమల శాస్త్రీయ సంగీతంలో దిట్ట. పిల్లలపట్ల ఆమె తన దృష్టిని కేంద్రీకరించింది కాబట్టి సరిపోయింది కానీ లేకపోతే భారతదేశంలో సంగీత ప్రపంచంలో ఆమెకు తప్పకుండా ఓ గొప్పస్థానం దక్కివుండేది. తల్లి కారణంగానే సునీతకు సంగీత అభ్యాసం అలవడింది. మైక్ లాంటిదాన్ని చేతిలో ధరించి పాటలు పాడేది. స్కూల్లో కూడా చదువుతో పాటుగా ఇతర వ్యాపకాలకు ప్రాధాన్యం ఇచ్చారు. దాంతో ఆమె అక్కడా స్టేజ్ ఎక్కి పాడటమే

## ఇలా చెబుతోంది....

✶మనల్ని మనం ప్రేమించటం ప్రధానం. అలానే మనల్ని మనం ముందు గౌరవించుకోవాలి. మన బాధ్యతల్ని గుర్తెరగాలి. ఏం చేసినా చెల్లుతుందని మాత్రం భ్రమించొద్దు.

✶మహిళలు తమ కలల్ని సాకారం చేసుకోవటం కోసం - తాము ఏర్పరచుకున్న నియమ నిబంధనలకు అనుగుణంగా జీవించాలి. తమ కోరికల సాధన కోసం కార్యాలమైనా, గృహమైనా మనస్ఫూర్తిగా పనిచేయాలి. ఓ సంపూర్ణ జీవితాన్ని వాళ్లు పొందాలి.

✶ఇది పోటీ ప్రపంచం. ఇక్కడ ఎట్టి పరిస్థితుల్లో సాధనను వదిలిపెట్టకూడదు. సంగీత దర్శకుల్ని కలవటం - ప్రదర్శనల్ని నిర్వహించటం, సంగీతాన్ని వినడం మానకూడదు. అలా చేస్తూ వుంటే ఏదో ఒకరోజు మన నిరీక్షణకు తగిన అవకాశం వస్తుంది. ముఖ్యమైన విషయం ఏమిటంటే నిరుత్సాహంతో మనం సాగే దారినుండి వైదొలగ కూడదు. లక్ష్యం వైపు సాగుతూ వుంటే గుర్తింపు, విజయం వాటంతట అవే వస్తాయి.

✶ నాకు మొదటి నుండీ రీమిక్స్‌లకంటే ఒరిజినల్ మ్యూజిక్ పట్లే ఆసక్తి ఎక్కువ. ఒక్కో సంగీత దర్శకుడు రెండు మూడు సంవత్సరాలు కష్టపడి బాణీలు తయారు చేసుకుంటే - దానికి తగ్గట్టుగా మేం కూడా మా శాయశక్తులా కృషిచేసి పాట పాడతాం. కానీ కొందరు ఈ శ్రమ మొత్తాన్ని 'రీమిక్స్' పేరుతో సునాయాసంగా సొంతం చేసుకుంటారు. వారు పేరు, డబ్బు తేలిగ్గా సంపాదిస్తుంటారు.... మరో వైపు మా ఆడియో సేల్స్ దెబ్బ తింటాయి.'

ఎంచుకుంది. అందువల్లే సునీతకి బాల్యం నుండే అభినయమూ అలవాటైంది. గాయనిగా రాణించి వుండకపోతే ఆమె గొప్ప నటి అయిపోయి వుండేదే!

జరిగేది జరగక మానదు అనే మనస్తత్వం కాదు సునీతది. ఆమె కొన్ని కలలు కన్నది. ఆ కలల్ని నిజం చేసుకోవడానికి శ్రమించింది కూడా! కర్ణాటక గాత్ర సంగీతాన్ని పి.వి.శంకర్ దగ్గర అభ్యసించింది. దానితోపాటుగా భరతనాట్యం, జాజ్ బాలేలనూ నేర్చుకుంది.

మోడలింగ్ రంగంలోకి తొలుత ప్రవేశించిన సునీతారావ్ అనేక కమర్షియల్ యాడ్స్‌కు వాయిస్ ఓవర్ ఇచ్చింది. వీల్, థమ్స్ అప్, రిచ్ కేఫ్... ఈ పట్టికకు అంతేలేదు. అయితే కేవలం గాత్ర దానంతో ఆమెలోని గాయని సంతృప్తి పడలేదు. దాంతో నటనవైపు దృష్టి సారించింది. ఇలిటా, గ్రేసీ లైటెనింగ్, బాటమ్స్ అప్ వంటి నాటకాలు, నృత్య రూపకాలలో నటించింది.

**పాప్ గాయనిగా....**

తొలిసారి జాతీయస్థాయిలో గుర్తింపు 1989లో లభించింది. లూయీస్ బాంక్స్ నేషనల్ టెలివిజన్‌లో ప్రసారమౌతున్న 'పాప్‌టైమ్' కార్యక్రమానికి సునీతారావ్‌ను ఆహ్వానించాడు. ఆ కార్యక్రమ స్ఫూర్తితోనే హిందీ పాప్ క్యాసెట్ 'సునీత సెనోరిటా'ను విడుదల చేసింది సునీతారావ్. గాయనిగా వచ్చిన గుర్తింపుతో దేశవిదేశాల్లో అనేక స్టేజ్ షోలలో ఆమె పాల్గొంది. అంతే కాదు ముమ్మరంగా నాటకాలను ప్రదర్శించింది. 1991లో సునీతారావ్ 'దువా' ఆల్బమ్‌ను విడుదల చేసింది. దానిలో పాప్ సింగర్‌గా ఆమెకు క్రేజ్, ఇమేజ్ రెండూ ఏర్పడ్డాయి.

ఆ వెంటనే వచ్చిన 'పరీ' (దేవకన్య) ఆల్బమ్‌లో నిజంగానే ఆమె ఇండీపాప్ రంగంలో అప్సరసగా వెలుగొందింది. 75 వేల ఆడియో క్యాసెట్స్ అమ్ముడుపోయాయి. 'దువా', 'పరీ' ఆల్బమ్స్ చాలాకాలం మ్యూజిక్ ఛార్ట్స్‌లో టాప్‌టెన్‌లో వున్నాయి. ఆ తర్వాత ఆల్బమ్ విడుదలకి సమయం పట్టినా ఆమె 'పరీ' పాటలు మాత్రం శ్రోతల మనసుల్లోంచి చెరిగిపోలేదు. ఈ విషయంలో సునీతారావ్ దాండియాక్వీన్ ఫాల్గుణీ పాఠక్ ధన్యవాదాలు చెప్పుకోవాల్సి వుంది. ఫాల్గుణి అప్పట్లో నవరాత్రి ఉత్సవాల్లో ఈ 'పరీ' పాటను తప్పకుండా పాడుతూ వుండేది.

భారతదేశ స్వాతంత్ర స్వర్ణోత్సవాల సందర్భంగా మెగ్నాసౌండ్ సంస్థ సునీతారావ్ ఆల్బమ్ 'ఛోడో యే ఛోటీ ఛోటీ బాత్'ను విడుదల చేసింది. ఈ తర్వాత వచ్చిన ఆల్బమ్ 'అబ్ కె బరస్' దీనిని హెచ్.ఎం.వి సంస్థ విడుదల చేసింది. ఈ మధ్య కాలంలో ఆమె బాలీవుడ్ నటుడు దలీప్ తహిల్‌తో కలిసి 'Man of La Mancha' అనే నృత్య రూపకంలో నటించింది. అలానే న్యూయార్క్‌లోని బ్రాడ్ వే స్ట్రీట్‌లోని డాన్స్ స్కూల్‌లో చేరి - లాటిన్ డాన్స్ - జాజ్ బాలేలలో అభ్యాసం చేసింది. అక్కడే వెస్ట్రన్ క్లాసిక్ సింగింగ్‌నూ నేర్చుకుంది. ఆ సమయంలోనే నేర్చుకున్న వాయిస్ అండ్ బాడీ రిలాక్సేషన్ టెక్నిక్ ఆ తర్వాత తనకెంతో ఉపయోగపడిందని - 'అబ్ కె బరస్' కోసం పాడిన కొన్ని పాటల్ని ఈ శిక్షణ తర్వాత మళ్ళీ గానం చేశానని సునీతారావ్ చెబుతోంది.

అయితే అందరు పాప్ సింగర్స్‌లానే సునీతారావ్ కూడా సినీ నేపథ్య గానం చేసింది. 'గులామ్ - ఎ - ముస్తఫా', 'దుల్హన్ హమ్ లే జాయేంగే', 'ఖిలాడియోం కా ఖిలాడీ', 'సవ్యత్', 'లావారిస్', 'కహీ ప్యార్ న హో జాయే' చిత్రాలలో పాడింది. 'లావారిస్' చిత్రంలో 'దేఖా దేఖా...' పాటను సునీతారావ్, అక్షయ్‌ఖన్నాపై చిత్రీకరించారు. పాప్ ఆల్బమ్స్‌లో వైవిధ్యమైన పాటలు తాను పాడినా - సినిమా పాటల దగ్గర కొచ్చేసరికి ఒకే కేటగిరీ పాటలకే తనను పరిమితం చేశారని - కేవలం హస్కీ వాయిస్ పాటల కోసమే సంగీత దర్శకులు తనని అప్రోచ్ అవుతున్నారని సునీతారావ్ చెబుతోంది. అయితే 'స్వాభిమాన్' టెలీ సీరియల్ కోసం పాడిన టైటిల్ సాంగ్ 'ఏక్ పల్ హై జిందగీ...' తనకెంతో ఇష్టమని సునీతారావ్ అంది.

**సంగీత కుటుంబం:**

నలుగురు పిల్లల్లో సునీతారావ్ మూడవ అమ్మాయి. 'మా ఇంట్లో ప్రతి ఒక్కరూ నన్నో చిన్నపిల్లలా చూస్తారు. నాకూ అలా చూడటం ఇష్టమే' అంటుంది సునీత. 'నా కుటుంబ సభ్యులంటే నాకెంతో ప్రేమ. వాళ్ళ ఆసరా - ప్రోత్సాహం లేకపోతే నేనీ స్థాయిలో వుండేదాన్ని కాదు' అంటుందామె. సునీతే కాదు ఆమె అక్కలు, సోదరుడు కూడా సంగీత ప్రపంచంలో మునిగి తేలిన వారే. సునీత అక్క కల్పన స్విట్జర్లాండ్‌లో స్థిరపడింది. ఇద్దరే ఇద్దరితో ఆమె ఓ మ్యూజిక్ బాండ్‌ను ఏర్పాటు చేసింది. మరో అక్క ఆర్తి. జాజ్ సంగీత సాధన చేసింది. బెంగుళూరులో స్థిరపడిన ఆమె సంగీత కార్యక్రమాలు నిర్వహిస్తుంటుంది. సునీత సోదరుడు నరసింహా గిటార్‌తో పాటుగా మరికొన్ని వాయిద్యాల మీద పట్టు సంపాదించాడు. సునీత కూడా తబలా వాయిస్తుంది. ఇటీవలే కీ-బోర్డ్ ప్లే చేయటం మొదలుపెట్టింది. ఎప్పటికైనా సంగీత దర్శకత్వం వహించాలన్నది ఆమె కోరిక.

భారత దేశంలోని ప్రధాన పట్టణాలతో పాటుగా బ్యాంకాక్, సింగపూర్, దుబాయ్, మస్కట్, అబుదబి, సౌత్ ఆఫ్రికా తదితర దేశాలలో సునీతారావ్ ప్రదర్శనలిచ్చింది. అయితే తనకిష్టమైన దేశం మాత్రం 'ఆఫ్రికా' అని, అక్కడ వీలైతే కొంత స్థలాన్ని కొంటానని సునీతారావ్ చెబుతోంది. ప్రస్తుతం పాప్‌గాయనీ గాయకుల్లో శుభాముద్గల్ గాత్రం తనకెంతో ఇష్టమని, అలానే స్నేహితులు శంకర్ మహదేవన్, పర్వేజ్ ఖాదిర్ పాటల్ని వింటానని అంది.

ప్రతిభ, పరిశ్రమ, క్రమశిక్షణ, అదృష్టం... ఇవే సక్సెస్‌ను అందిస్తాయన్నది సునీతారావ్ విశ్వాసం.

**- వి.అరుణసత్యవతి.**

| ఘంటసాల క్విజ్ - 11 విజేతలు | సరి అయిన సమాధానాలు |
|---|---|
| మొదటి బహుమతి | |
| శ్రీ వి. చంద్రశేఖరశాస్త్రి, హైదరాబాద్. | 1. అభిమానం |
| రెండవ బహుమతి | 2. పల్నాటి యుద్ధం |
| శ్రీ ఎమ్.ఆర్.బి.రషీద్, కనిగిరి. | 3. షావుకారు |
| మూడవ బహుమతి | 4. మది శారదాదేవి (జయభేరి) |
| శ్రీ జి.వి.రమణ, సంగారెడ్డి. | 5. భాగ్యదేవత |

**బహుమతులు**

మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



17

**హెచ్చరిక**

బిరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.
ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.



## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి అండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక వెంకట్రావు ఒప్పుకుంటాడు. పూజకు కూర్చున్నాక శాస్త్రికి భార్యమాటలు గుర్తుకువచ్చి బాదంపప్పు, వక్కలు తేలేదని, వాటిని తీసుకురమ్మంటాడు. శాస్త్రికి వెంకట్రావు సర్ది చెపుతుండగా లోపలినుండి సుందరి కేక పెడుతుంది.

(ఇక చదవండి)

"ఏవండోయ్, స్టౌ ఆరిపోయింది. గ్యాస్ అయిపోయినట్లుంది. ఇంకా వారం రోజులు రావల్సింది అప్పుడే ఎలా అయిపోయింది?" అన్నది.

"చూశారా, నిదర్శనం వెంటనే కనపడింది! అగ్నిదేవుడికి కోపం వచ్చింది." చెంపలను భక్తితో వటవట వాయించేసుకున్నారు శాస్త్రిగారు.

వెంకట్రావుకు భయమేసింది.

"ఉండండి... సిలెండర్ మార్చి షాపుకు వెళ్తాను." అన్నాడు వెంకట్రావు.

ఇంతలో యాదృచ్ఛికంగా కరెంట్ పోయింది.

"అయ్యయ్యో... పాపం శమించుగాక! పాపం శమించుగాక! అయ్యా వెంకట్రావు గారూ... చంద్రుడు కుడా తన ప్రతాపం చూపించాడు. వాళ్ల ఆగ్రహం మరింత పెరగక ముందే వెంటనే వెళ్ళి రెండు కిలోల వక్కలు, రెండు కిలోల బాదంపప్పు పట్రండి" ఆత్రుత అభినయించారు శాస్త్రిగారు.

"ఇది పవర్ కట్ టైమండీ. రోజూ ఇదే టైముకు పోతుంది. మళ్ళీ గంటలో వస్తుంది." నవ్వుతూ అన్నాడు వెంకట్రావు

"వాదనలు పెట్టుకోకండి. ఏదైనా అయితే ముందు మన పవరు కట్ అవుతుంది." కోపంగా అన్నది సుందరి.

వెంకట్రావు సంచి తీసుకుని బయటకు పరిగెత్తాడు. శాస్త్రిగారు కాఫీ సేవిస్తున్నారు.

"అమ్మాయ్.. వంటలన్నీ అయిపోయాయా?" అడిగారు శాస్త్రిగారు.

"కూరలన్నీ అయ్యాయండీ. ఇక గారెలు, పరమాన్నం చెయ్యాలి." చెప్పింది సుందరి.

"పరమాన్నంలో జీడిపప్పులు మాత్రం దండిగా వెయ్యి. శుక్రునికి జీడిపప్పంటే చాలా ఇష్టం. ప్రతీసారి పంటికిందికి పది పప్పులైనా రావాలా యనకు. ఆయనకు ఒకటే కన్ను కదా! నాలుగు పప్పులున్నా రెండుగానే కనిపిస్తాయి."

"అలాగే శాస్త్రిగారూ.. ముప్పావు కిలో పోస్తాను."




"బాదంపప్పు శనికి చాలా ఇష్టం. అందుకని ఎత్తుకెత్తు బాదం కూడా వెయ్యి."

"అలాగే నండీ."

వెంకట్రావు వచ్చాడు.

"శాస్త్రిగారూ ఇవిగో వక్కలు, బాదంపప్పులు, అబ్బబ్బ.. రేట్లు మండిపోతున్నాయిండీ."

"పోనివ్వండి వెంకట్రావుగారూ.. భగవంతుడు దయ ఉండాలే కానీ ఇంతకు పదింతలు సంపాదించుకోవచ్చు. పుణ్యకార్యం చేస్తున్నారు ఊరికే పోదులెండి. మీరు మడి ధోవతి కట్టుకుని వచ్చి పీట మీద కూర్చోండి." మంత్రాలు ఆరంభించారు శాస్త్రిగారు. "నేను ఎలా చెబితే అలా చెయ్యండి."




"మంత్రాలు చదవమని మాత్రం అనద్దు. నాకు నోరు తిరగదు." ముందుజాగ్రత్తగా చెప్పాడు వెంకట్రావు.

"అలాగే కానివ్వండి 'మమ' అనండి చాలు." కొనసాగించారు శాస్త్రిగారు.

రెండు మంత్రాలు చదవగానే "ఒక ఐదు రూపాయలు తాంబూలంలో పెట్టండి." అన్నారు.

ఈవిధంగా రెండు మూడు నిముషాలకొక సారి తాంబూలంలో ఐదు, పది అంటూ ఇరవై సార్లన్నారు గంటలోపలే. వెంకట్రావుకు మండిపోతున్నది. వెంకట్రావు ముఖకవళికలు గమనిస్తూనే ఉన్నారు శాస్త్రిగారు.

"అయ్యా ఏది మీ అమ్మాయి గారిని తీసుకురండి నవగ్రహాలకు శాంతి చేయిస్తాను" అన్నారు.

అనూహ్యను తెచ్చింది సుందరి.

"నేను చెయ్యను. నేను కూర్చోను మ్యావ్." అంది అనూహ్య.

"చూశారా పిల్లి ఆత్మ ఇంకా ఇక్కడే ఉంది. పాపాయిలో ప్రవేశించాలని చూస్తున్నది. బలవంతంగా కూర్చోబెట్టండి." ఆందోళన ప్రదర్శించారు శాస్త్రిగారు.

సుందరి, వెంకట్రావు దడదడలాడుతూ అనూహ్యను బలవంతంగా కూర్చోబెట్టారు. శాస్త్రిగారు పెద్దగొంతుతో కళ్ళు ఎర్రగాచేసి అనూహ్య నుదుట కుంకుమ పెట్టి "ఒసేవ్ పిల్లీ... ఇంకెప్పుడైనా మ్యావ్ అన్నావంటే తోలు వలుస్తాను. అంటావా?" అని అరిచారు.

"అనను" అన్నది అనూహ్య ఏడుస్తూ.

"అలారా దారికి.... అమ్మాయ్.. ఇంక నువ్వు వడ్డించవచ్చు" ఆదేశించారు శాస్త్రిగారు.

సుందరి ఆ ఏర్పాట్లు చేస్తుండగా శాస్త్రిగారు బియ్యం, ఆకులు, వక్కలు, చిల్లర నాణాలు రెండు కండువాలలో మూట గట్టారు.

షడ్రసోపేతంగా భోజనాలయ్యాయి.

"వెంకట్రావుగారూ శుభకార్యం చేశారు. ఘోర పాపం నుండి చవకలో బయట పడ్డారు. ఇక మళ్ళీ మళ్ళీ ఇటువంటి పాపాలు చెయ్యకుండా ఉండాలని అందుకు ఆ దైవం మీకు సర్వవేళలా సహకరించాలని ఆశీర్వదిస్తున్నాను. ఇక నా దక్షిణ సమర్పించుకున్నారంటే ఆర్థికమంత్రిగారింటికి వెళ్ళి పుష్పవతీ పూజ చేయిస్తాను" అన్నారు శాస్త్రిగారు.

"గవర్నర్లు, ముఖ్యమంత్రులు, మంత్రులు మీకు చాలామంది పెద్ద పెద్దవాళ్ళు తెలుసునండీ.. చాలా అదృష్టవంతులు." అబ్బురంగా అన్నది సుందరి.

"ఆ... ఏం లాభం తల్లీ? ఆ ఆర్థికమంత్రిగారు మహా పిసినారి. ఎప్పుడు వెళ్ళినా ఖజానా ఖాళీ.. వరల్డ్‌బ్యాంకు నుంచి లోన్ రాగానే దక్షిణ ఇస్తా అంటుంటారు. వాళ్ళను మనం ఘట్టిగా అడగలేం, ఊరుకోలేం. మీ బోటి వారే నయం.

పదో పరకో అనుకున్న దానికంటే ఎక్కువే చేతిలో పెడతారు." అన్నారు శాస్త్రిగారు.

ఇవాల్సిన దక్షిణకు వెయ్యో రెండువేలో తగ్గిద్దామని మనసులో అనుకుంటున్న వెంకట్రావుకు శాస్త్రిగారి మాటలతో పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్లయింది.

మనసులో భోరుమని ఏడుస్తూ పైకి నవ్వు నటిస్తూ ఇరవైవేల రూపాయల నోట్లను కడసారి చూసి శాస్త్రిగారికి తాంబూలంలో పెట్టి అందించాడు వెంకట్రావు.

ముగ్గురినీ ఒక నిముషం పాటు రకరకాలుగా ఆశీర్వదించారు శాస్త్రిగారు.

"మిగిలిన పదార్థాలన్నింటినీ శుభ్రమైన అరటి ఆకులలో పార్శిల్ చేసి నాకివ్వమ్మా... దేవుడి నైవేద్యాలన్నింటిని ఆవులకు తినిపించాలి. దాంతో పాపం పూర్తిగా నాశనమైపోతుంది. మా ఇంట్లో నాలుగు ఆవులున్నాయి కాబట్టి వాటికి పెడతాను. జాగ్రత్తగా వినమ్మా సుందరీ ఈ పూట వండిన పదార్థాలలో ఒక్క మెతుకు కూడా సాయంత్రానికి పనికిరాదు. ఆవు మాత్రమే తినాలి" చెప్పారు.

హతాశురాలైంది సుందరి.

"అయ్యో... బోలెడు పరమాన్నం, పులిహోర, కూరలు, గారెలు బోలెడన్ని బజ్జీలు మిగిలాయి. వాటిని చుట్టుపక్కలవారికి మాకు తెలిసిన వారికి పంపించాలనుకున్నానే" అన్నది.

"అన్నన్నన్న... ఎంత మాట! ఇది యమబాధా నివారణా శాంతి పూజ దాంట్లో మిగిలినవాటిని ఇతరులకు పంచడమంటే ఆ పాపాన్ని వారికి కూడా పంచడమే. లక్ష్మీ అవతారమైన గోవుకు మాత్రమే ఆ పాపాలను హరాయించగల శక్తి గలది. ఇంకా నయం ముందే చెప్పావు" ఏదో మహా ఉపద్రవాన్ని నివారించినవాడిలా పోజు పెట్టారు శాస్త్రిగారు.

పదార్థాలన్నింటిని ఇంటికి పట్టుకెళ్ళారు శాస్త్రిగారు.

ఊపిరి పీల్చుకున్నారు దంపతులు.

* * *

ఆ రాత్రి పడుకోబోయే ముందు సుందరి




అన్నది. "మనకేదో శని అంటుకుంది. లేకపోతే బోడిముండా ఎలుక వల్ల ఇన్నిన్ని నష్టాలా? ఆ ఎలుక కోసం మందు తేవడమేంటి? తెచ్చాంపో. ఆ మందును మన చంటి ముండ తినాలా? తిన్నది పో. కాస్త వాంతి చేయిస్తే పోయేదానికి ఆ డాక్టరు దగ్గరకు పోవడమేంటి? పోయాం పో. వాడేవో నాలుగు టాబ్లెట్లు ఇవ్వకుండా పధ్నాలుగు వేలు గుంజడమేంటి? అంతటితో ఊరుకోక మనం పిల్లిని తేవడమేంటి? తెచ్చాంపో. అది ఆడపిల్లి కావడమేంటి? అయితే అయిందిపో. అది మనింట్లో ఈనడమేంటి? ఈనింది పో. అందులో ఒక పిల్లి కూన చావడమేంటి? చచ్చింది పో. శవాన్ని చెత్తకుండీలో పారేయక ఈ శాంతేమిటి? ఈ గోల ఏంటి? ఈ డబ్బు నష్టం ఏంటి?"

"శాంతి చెయ్యకపోతే నరక బాధ అనుభవించాలి కదా మరి!" అన్నాడు వెంకట్రావు.

"ఏమో... ఈ స్వర్గ నరకాలు ఎవడు చూశాడు? ఆ శాస్త్రిగాడు చెప్పగానే మనం గంగిరెద్దులా తలలూపడమేంటి? అసలా శాస్త్రిగాడు చెప్పిన పురాణాలు, పద్యాలు అన్నీ నిజమేనా? ఏంటా పేర్లు?"

"ఎవడికి గుర్తున్నాయి? వాడు ఎంత వదిలిస్తున్నాడా అన్నదాని మీద ధ్యానపెట్టాం గానీ ఈ పేర్లన్నీ ఎవడు విన్నాడు?"

"ఏదో సామెత చెప్పినట్లు ఎమ్మే చదివిన మీకంటే ఏడో క్లాసు తప్పిన ఈ శాస్త్రిగాడే నయం. మాటలతో భయపెట్టి బోల్తా కొట్టించాడు. రోజూ రోడ్ల మీద లారీలకిందపడి ఎన్ని కుక్కలు పిల్లులు చావడం లేదు. ఆ డ్రైవర్లంతా మనలా శాంతులు గీంతులు చేయిస్తున్నారా?"

ఆ మాటలు వినగానే వెంకట్రావు ముఖం జేవురించింది. కణతల మీది నరాలు ఎర్రగా ఉబ్బాయి. పళ్ళు బిగుసుకున్నాయి.

"ఈ మాటలు ఇపుడా చెప్పేది? ఈ జ్ఞానం ఇంతకు ముందేమైంది? అప్పుడే ఇలా చెప్పి ఉంటే ఇంత డబ్బు వదుల్చుకుని ఉండేవాళ్ళం కాదు." కోపంగా అన్నాడు వెంకట్రావు.

"బాగానే ఉంది. ఆరు నెల్లు సావాసం చేసి మూలనున్న ముసలమ్మను తన్నినట్లు నా మీద ఎగురుతారేం? నేనంటే ఆడదాన్ని. మీరు పేద్ద మ.. గ్గా..ళ్ళు కదా" వెత్తి పలికింది సుందరి.

"అన్ని సలహాలు నువ్విచ్చినవే! అసలు నా బుర్రతో నన్ను ఆలోచించనిస్తేనా?" కోపంగా అన్నాడు వెంకట్రావు. "పిచ్చిగా వాగకు. పళ్ళు రాలగొడతాను."

"అంతేలెండి... దానికి నేనేగా మీకు దొరికింది." ఏడుస్తూ దుప్పటి ముసుగు తన్నింది సుందరి.

"ఛీఛీ.. ఆడదాని పెత్తనం తంబళ్ళ దొరతనం అని ఊరికే అన్నారా? జన్మలో చస్తే ఆడదాని మాట వినగూడదు." కోపంగా బయటకు వెళ్ళాడు వెంకట్రావు.

**-(ఇంకావుంది)**



నవంబరు 5 దాశరథి వర్ధంతి సందర్భంగా...



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

# దాశరథి! కవితా పయోనిధి!!



అతను బుడుగైనా ఆర్తి పొడుగు. మూర్తి చిన్నదైనా కీర్తి దొడ్డది. అతను నాటు తెలుగు గూటిలో గుట్టుగా దాగి ఒక్కపెట్టున గుక్కపట్టి గొంతువిప్పిన కవితల గిజిగాడు. నిజాం నియంతృత్వంపై తిరగబడి నల్గొండ రాజకీయ మహాసభ వేదికపై విప్లవాగ్ని ధారలు కురిపించిన బాలకవి వీరుడు.

'మా నిజాం రాజు జన్మజన్మాల బూజు' అని కన్ను తెరిచి తెలంగాణ కన్ను తెరిచేలా ఎలుగెత్తి చాటిన మగవాడు. రాక్షసత్వపు రజాకారులకు మానవత్వపు ప్రజాకారుడై తిరగబడ్డ తెలుగు బిడ్డ. కవిగా పుట్టి కవిగా ఎదిగి కవిగా కన్ను మూసిన ఈ తెలుగు జాతి వైతాళికుడు మరెవరో కాదు. మరపురాని మధురమూర్తి శ్రీ దాశరథి కృష్ణమాచార్య!

అమాయకుడు, అమల హృదయుడు, ఆవేశపరుడు, ఆంధ్రుడు అన్న మాటలు దాశరథికి పర్యాయపదాలు. 'నీ కవితా ప్రశస్తి రజనీకర చారుమయూఖ పుంజముల్ ప్రాకెను తెల్గునాట' అని ఏనాడో డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు పంచరత్నాలతో అలంకరించిన పుంభావ సరస్వతి దాశరథి. ఆయన కన్న కల విశాలాంధ్ర! ఆయన కోరిన ఉదయం మహాంధ్రోదయం. అందుకు ఆయన ధారపోసిన కవితాధార అగ్నిధార!

'ఆంధ్ర తెలంగాణాలను విడదీయడం ఇక కృష్ణవేణమ్మకు సైతం సాధ్యం కాదు' అని ఒక సాహితీ సభలో ఆయన చేసిన ప్రసంగం ఇప్పటికీ చెవుల్లో రింగుమంటూ వుంటుంది.

సంస్కృతం, తెలుగు, ఉర్దూ భాషల్లో కవితా రచన చేయగల దిట్ట. గాలిబ్ గీతాల అనువాదం ఆయనకు ఎంతో మంచిపేరు తెచ్చిపెట్టింది. అనువాద కవితలకు మార్గదర్శకమైంది. చిత్ర కవితలు కూడా చిలిపి నానుళ్ళతో వెలయించిన సరసకవి. నిగర్వి. స్నేహశీలి.

తాను సమగ్రాంధ్ర సంస్కృతికి పట్టుగొమ్మగా నిలిచినా పట్టుకొమ్మల పట్టు చిక్కించుకుని ప్రభుత్వ కరుణాకటాక్షాలకై ప్రాకులాడలేదు. అలాగే సినిమా రంగంలో 'గ్లామర్' కోసం వచ్చి వాలనూ లేదు. పట్టు పరిశ్రమలో పట్టా పుచ్చుకున్నవాడు కాదు. కడుపులో కల్మషం లేకుండా ఘటం వాయించినట్లు కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడే స్వభావం. కొన్ని తరాల ప్రతిభా పాటవాలకు, అవి పొందవలసిన అవకాశాలకు అడ్డుతగిలి దొరవారి సత్రపు వారసత్వపు దూలాలకు, పొగచూరిన చూరులకు వ్రేలాడిన దివాంధాల జాబితాలో అతను చేరలేదు. అర్హతకు కొలతలేదు. కాని యోగ్యతకు వుంది. ఆ విధంగానే ఆస్థానకవి కాగలిగాడు. అతని ఆంధ్రసరస్వతీ ఉపాసనాబలం, ఉద్యమ జీవితం ఆస్థానానికి అతనే అర్హుడని నిరూపించాయి. 'నా తెలంగాణ కోటి రత్నాల వీణ' అన్న తెలుగు తనం ఆయనది. 'మనం జనం జనం మనం - మనం వెనక్కు నడవం జనం వెనక్కు నడవరు' అన్న మరో జార్జినిడివరు.



ఏ కవితానదికైనా సినీ సాహితీ సాగర సంగమం తప్పని పరిస్థితి ఏర్పడిన తరువాత దాశరథి 'వాగ్దానం' చిత్రంలో ఆచార్య ఆత్రేయ ఆహ్వానం మీద రంగ ప్రవేశం చేశాడు.

**'నా కంటి పాపలో నిలిచిపోరా**
**నీ వెంట లోకాలు గెలవనీరా'**

అంటూ తన సినీ కవితా ప్రస్థానం మొదలుపెట్టాడు. అందులో **'ఈనాటి పున్నమి ఏనాటి పున్నెమో'** వంటి ముద్దొచ్చే ప్రయోగాలు చేశాడు. సినీ గీతాల స్థాయిని హాయిని పెంచే మధుర కవితలు వెలయించినవాడు దాశరథి. అతనికి అక్షరస్మారక చిహ్నంగా నిలిచిపోయే పాట

**'ఏ దివిలో విరిసిన పారిజాతమో**
**ఏ కవిలో మెరిసిన ప్రేమ గీతమో'**

సత్యం స్వరకల్పనలో రసభావకల్పకమై నిలిచిపోయింది. 'వలపే వసంతములా పులకించి పూసినది' అన్న లలిత భావుకుడు. **'నడిరేయి ఏ జాములో'** అనే పాటతో ఏడుకొండలవాడిని మనసారా స్మరించుకున్న ధన్యుడు.

కవ్వించే కవాలీ పాటల రచనలో ఆరితేరిన దాశరథి తెలుగు సినిమాలో మంచి కవాలీ పాటలకు శ్రీకారం చుట్టాడు. 'నవ్వాలీ నవ్వాలీ నీ నవ్వులు నాకే యివ్వాలి' - ఇందుకు తార్కాణం. ఛందో బద్ధ కవిత్వ రచనలో 'థాంక్స్' లాంటి నోటి తెలుగు ఆంగ్ల పదాలను వాడి రక్తి కట్టించిన కవి. అయితే ఈ ధోరణికి ఆద్యులుగా ఆరుద్రనీ, భోగరాజు నారాయణమూర్తినీ చెప్పుకోవాలి.

ఆకాశవాణి ఉద్యోగం తరువాత ఆయన పూర్తి సినీకవిగా మారిపోయాడు. కోడంబాక్కంలోని డైరెక్టర్స్ కాలనీలో ఆయన నేనూ దాదాపు పక్కపక్క ఇళ్ళలోనే వుండేవాళ్ళం. ఏదైనా తనకు నచ్చితే ఆపుకోలేని అభిమానం, ఆనందం ఆయన చూపేవాడు. 'ప్రేమబంధం'లో 'చేరేదెటకో తెలిసి చేరువకాలేమని తెలిసి' అని నేను రాసిన పాట ఆయన మన్నన పొందింది.

దాశరథి మంచి వక్త. వాగ్బాణాలు సంధించడంలో సవ్యసాచి. మంచి కథకుడు. అముద్రితంగా వున్న అనేక కథలను గురించి విని ఒకరోజు 1960లో ఆయన్ని ఆంధ్ర సచిత్ర వారపత్రికకు ఒక మంచి కథయివ్వమని అడిగాను. 'అందరూ కవితలడుగుతారు మీరేమిటి కథ అడుగుతున్నారు' అన్నాడు. మీ కథ నాకు తెలుసులెండి. యివ్వండి అన్నాను. అప్పుడు 'వీణనవ్వు' అనో 'వీణ నవ్వింది' అనో ఓ కథ యిచ్చాడు. అది నేను ప్రచురించాను.

'ఆకాశవాణి' మద్రాసు కేంద్రంలో తెలుగు సాహిత్య విభాగంలో దాశరథి పనిచేస్తున్న రోజులవి. షేక్స్‌పియర్ వాడిన Blank Verse ఛందస్సులో నేను తెలుగులో రాసిన 'సాగుతున్న యాత్ర' ఆయన విని చాలా ఆనందపడి ఇదో కొత్త ప్రయోగమని కొనసాగించమని ప్రోత్సహించాడు. శ్రీ గొల్లపూడి మారుతీరావు నిర్వహణలో ఆయనకూడా పాత్రధారిగా ఉమ, రేడియో భానుమతి, కాకరాల నటించగా తరువాత అది 'ఆకాశవాణి' మద్రాసు కేంద్రంలో ప్రసారమైంది.

విశ్వనాథ, రాయప్రోలు, జాషువా, కరుణశ్రీ వంటి ఆధునికులు, శ్రీనాథుడు, శ్రీకృష్ణదేవరాయలు, భట్టుమూర్తి, 'ఉదయనంబి విలాస' కర్త అజ్జరపు పేరయ వంటి వారిలో కానవచ్చే ఆంధ్రాభిమానం కొంతగా శ్రీశ్రీలో మరింతగా దాశరథి రచనలలో కనిపిస్తుంది.

నేను మద్రాసులోను, ఆయన హైదరాబాదులోను వున్న రోజులలో మా యిద్దరికి ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూవుండేవి. ఆకుపచ్చ సిరాతో లేత కొతిమీర ఆకులవంటి అక్షరాలతో ధీమాగా నిలిచే తలకట్లతో ఆయన తెలుగు అక్షరాలు కనువిందు చేసేవి. నేను పుట్టి పెరిగిన నా అభిమాన ప్రదేశం కృష్ణాతీరానికి వచ్చి నాతో మరి ఒకరిద్దరు నా మిత్రులతో సాహితీ సంచార గోష్టి జరపాలని ఆయనా, నేను కన్న కలలు పండలేదు. అది నాకు యిప్పటికీ తలుచుకుంటే బాధగా వుంటుంది. 'మన వెలనాటి యాత్ర కలయేనా' అనేవాడు పదేపదే.

దాశరథికి విమాన ప్రయాణమంటే చాలా భయం. అయితే మహాత్ముడంతటివాడు ఎక్కని విమానం ఎక్కడానికి మనం ఎంతవరకు అర్హులం అని సమర్థించుకుంటూ ఎదురు ప్రశ్న వేసేవాడు. ఒకసారి - ఆ రోజుల్లో ఈ ఎయిర్‌బస్సులూ బోయింగులూ కాక వైకౌంట్, డకోటా వుండేవి - వైకౌంట్‌లో దాశరథీ నేనూ ముక్త్యాల రాజాగారు మద్రాసు నుంచి హైదరాబాదు వస్తున్నాం. విమానం టేకాఫ్ అయి ఎత్తుకు దూసుకుపోతుండగా 'ఇది ఇలా వైకుంఠమందే అంత ఎత్తుకు మనని తీసుకువెళుతుంది గనుకనే 'వైకౌంట్' అన్నారేమో' అన్నాను నేను. వెంటనే పక్కనే వున్న దాశరథి ఆ మాటనకండి బాబూ నాభినుంచీ వాయువు బంధించి 'ఓం' అనుకోండి' అంటూ నాకు ధైర్యం చెప్పాడు. దాదాపు దిగేవరకు వరధ్యానంగా వున్నాడు. బహుశా హరిధ్యానంలో వుండివుంటాడు అనుకున్నాను. ఆ తరువాత చెప్పాడు ఆయన - 'మీరు వైకుంఠమంటే నాకు దడపుట్టుకొచ్చింది' అని!

కుడి అరచేయి నోటికి అడ్డుపెట్టుకుని నెమ్మదిగా మాట్లాడేవాడు. కంపోజింగులో చిన్నాపెద్దా అందరినీ 'స్మిత పూర్వాభిభాషీచ' అన్నట్టు చిరునవ్వుతో ప్రేమగా తనే పలకరించేవాడు. వినయశీలి, వేదాంతి, విప్లవకారుడు ఆయన. ఒకటి రెండు చిత్రాలలో నటుడిగానూ నటించాడు.

మాజీ రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, పాత్రికేయ మిత్రుడు మాగాపురామన్ దివంగతులైనప్పుడు సంతాప సభలో దాశరథి చేసిన అక్షరాశ్రు తర్పణం అసమాన వేదాంత జ్ఞాన దర్శనం. 'కదిలేదీ కదిలించేదీ' కవిత్వమైతే ఆనాడు గద్గదగాత్రంతో దాశరథి చేసిన ప్రసంగం ఒక కావ్యమే!

నేను పాత్రికేయుడుగా 'అసెంబ్లీ' సమావేశాల కవరేజ్‌కి హైదరాబాదు వచ్చినప్పుడు నేనే ముందుగా ఆయన దగ్గరకు పరుగెత్తేవాడను. ఆయన రేడియోస్టేషన్ నుంచి సాయంత్రం నాలుగు కాగానే 'గోపీ గోపీ హేపీ హేపీ' అని సంకేత భాషలో ఫోన్ చేసేవాడు. ఇంతకీ ఎవరీ గోపీ అనుకుంటారేమో! గోపీ హెూటల్ అని ఆరోజుల్లో ఒక మంచి ఫలహార భోజన హెూటల్ వుండేది. ఎదురెదురుగా ఆకాశవాణి, అసెంబ్లీ - ఆ పక్కనే గోపీ హెూటల్. అక్కడి ఇడ్లీలు వాటిలోకి చేసే చట్నీ హాట్‌గా సూపర్‌హిట్‌గా వుండేవి. ఆ ఫలహారం సమయంలో మళ్ళీ సాహిత్యగోష్టి! అరనిముషమైనా ఆరుగంటలైనా అదే గోష్టి. అంతకన్నా మాకు వేరే వ్యాపకం ఉండేదికాదు. ఆ రోజుల్లో ఒకసారి నేను 'ఆంధ్రప్రభ'లో 'అదిగో ద్వారక ఆలమందలవిగో' అని ఒక ఐటమ్ రాశాను. అప్పుడు శాసన సభ్యుల వసతి గృహాలు ఉండేవికావు. చాలామంది 'ద్వారకా హెూటల్'లోనే బస చేసేవారు. వారు ఉదయం అసెంబ్లీకి వెళ్ళడానికి తెల్లని ఖాదీ దుస్తులు ధరించి బస్సుకోసం బారులు తీరి టిఫినానంతర బీడా సేవనంతో పచార్లు చేస్తున్న దృశ్యాన్ని చమత్కారంగా అలా రాశాను అప్పుడు శాసనసభాపతి బి.వి.సుబ్బారెడ్డిగారు. ఆయన మంచి సాహితీవేత్త. సహృదయులు. నేను రాసినది చూసి ఆయన నన్ను ఛేంబర్‌లోకి పిలిచి 'అలారాశారేమిటి... ఇది సభాహక్కుల వ్యవహారం దాకా వస్తే యిబ్బంది పడతారు అని మందలించారు. దైవవశాత్తు అలా జరగలేదు. కానీ అది చూసి దాశరథి కడుపుబ్బనవ్వి - 'కవి సమయం యిదే కదా - కవి హృదయం తెలుసుకోవాలి కదా' అంటే 'అయ్యా రాజా కాలస్య కారణం అన్నారండీ పెద్దలు... ఏలినవారు తలుచుకుంటే ఏముంది చెప్పండి' అన్నాను. 'అది తప్పు. 'కవిఃకాలస్య కారణం' అని ఆ సూక్తిని మార్చాలి అన్నాడు దాశరథి. అంతటి కవితా వీరుడు ఆయన.

అన్నపూర్ణా వారి చిత్రాలలో 'ఖుషీ ఖుషీగా నవ్వుతూ వగైరా పాటలు 'అమరశిల్పి జక్కన' వంటి చిత్రాలలోను ఆయన రాసిన పాటలు రాశిలో తక్కువైనా వాసిలో ఎక్కువే. ప్రజాభిమానం చూరగొని ప్రజల నోళ్లలో బ్రతికేదే సినిమా పాట అయితే అటువంటి పాటలు అనేకం దాశరథి రాశాడు.

'కవితాశరథికి నవయువ
కవిదాశరథికి నిత్యకళ్యాణమగున్
రవికుల దాశరథికి వలె మా
కవికుల దాశరథి పరిధి కడలు కొను నిలన్'

అని ఆయన జన్మదినానికి నేనేదో ప్రేమ గౌరవాలతో పద్యం చెబితే వెంటనే ఆశువుగా దాశరథి తన ప్రేమని నామీద ఉత్పలమాలగా వేసి నన్ను ధన్యుణ్ణి చేశాడు. ఆ పద్యం యిది-

'ఎందరు లేరు మిత్రులు మరెందరు లేరట సాహితుల్ హితుల్
చందురువంటీ చల్లనయు సాహితి సౌహితి గుత్తగొన్నవా
రెందరు అందరన్ దిగిచి ఈ కవి డెందము హత్తుకొన్న మా
సుందరరామమూర్తికి వసుంధరలో నుపమాన మున్నదే'

'సృష్టిలో తీయనిది స్నేహమేనోయి' అని గుర్తు చేసే ఆత్మ వైతాళికుడు దాశరథి. ఆయనతో గడిపిన క్షణాలు సరస్వతీ వీక్షణాలు - నిత్య జీవితంలో విలక్షణాలు. ఈ సులక్షణ కవితాశరథికి దాశరథికి ఇవే నా తేనెకన్నీరాజనాలు -

**- వేటూరి సుందరరామమూర్తి**

## నటుడిగా దాశరథి

ప్రముఖుల చేత ఒకటో రెండో సన్నివేశాలను నటింపజేసే సంప్రదాయం చలనచిత్ర పరిశ్రమకు ఎప్పటినుంచో వుంది. అలా 'చదువుకున్న అమ్మాయిలు', 'శభాష్ పాపన్న' చిత్రాలలో దాశరథి నటించడం జరిగింది. అయితే ఈ ప్రముఖుల పేర్లు సినిమా ప్రచారానికి అదనపు ఆకర్షణగా తోడ్పడుతుందని తెలిసినా అన్నపూర్ణా వారి చదువుకున్న అమ్మాయిలు చిత్రంలో మాత్రం దాశరథి నటించిన విషయానికి అప్పట్లో పెద్దగా పబ్లిసిటీ ఇవ్వలేదు. చారిత్రక ప్రాధాన్యం కలిగిన ఈ విషయాన్ని - చదువుకున్న అమ్మాయిలు చిత్రంలో దాశరథి పాల్గొన్న సన్నివేశాన్ని - సంభాషణలు, ఫోటోలతో సహా పాఠకుల కోసం ప్రత్యేకంగా ఇక్కడ పొందుపరుస్తున్నాం.
**- ఎడిటర్**

అది మండువావున్న విశాలమైన లాడ్జి. పైనా కిందా బోలెడన్ని గదులున్నాయి. స్నానాల గది బయట కాచుకున్న వాళ్ళు బాధపడుతూనే వున్నారు. "ఒరేయ్ ఆనంద్ ! ఎంతసేపురా నీ స్నానం?" అని పొట్టివాడు గట్టిగా ప్రశ్నించాడు. "వస్తునన్నా వుండరా!" అని లోపలనుంచి జవాబు.

"ఒరేయ్ ! తొందరగా రారా" అని మరొక జీవుడు ఆక్రందించాడు. "వస్తున్నారా"

"ఏం వస్తున్నావో మేం యిక్కడ చస్తున్నాంరా తండ్రీ" అని ప్రాసతో మొరపెట్టుకున్నాడు పొట్టి కిశోరుడు.

ఎట్టకేలకు స్నానాల గదిలో తలుపులు తెరుచుకున్నాయి.



"ఒరేయ్ ! ఈ లాడ్జికంతా కలిపి ఒక్క బాత్‌రూం కదా ! నువ్వు లోపల పాడుకుంటూ కూచుంటే మా గతేం కావాలిరా?" అని సబువుగా సవాలు చేశాడు ఒక హేతువాది.

"ఒరేయ్ ! నాకేం సంగీతం మీద మోజుండి పాడుతున్నా ననుకున్నారా? ఈ గదికి తలుపుందేగాని లోపల గడియలేదు" అని చేత్తో తలుపుని చూపించి, "నీ బోటివాడు గబుక్కున తోచుకురాకుండా 'నేనూ' అనే వాణ్ణి లోపల వున్నానని తెలియచేయటానికి గాను పాడుతున్నా(నా!" అని వెల్లడించాడు ఆనంద్.



క్రొత్త సినిమాకి మొదటిరోజు మొదటి ఆటకి టిక్కెట్టు దొరికినంత ఉత్సాహంతో, మంచి సీటు చూసుకోవాలన్నంత ఆత్రుతతో పొట్టివాడు బాతురూంలోనికి నిష్క్రమించాడు. తలుపులు మూసుకొని వెనువెంటనే తెరచి ముఖం కొద్దిగా ముందుకు పెట్టి ఒక గంభీర ప్రకటన చేశాడు. "ఇదిగో అబ్బాయిలూ ! నాకు పాట రాదు. మీరు తలుపు తియ్యొద్దు. తీశారో మీ ఖర్మ !" అని పొట్టివాడు గట్టిగా వార్నింగు యిచ్చాడు.

(ఇదీ దాశరథి పాల్గొన్న సన్నివేశం. ఇందులో దాశరథి ఎవరో వేరేగా చెప్పనక్కర్లేదు కదూ!)



# దాశరథి పాటలు

**చిత్రం: రాము**
సంగీతం: ఆర్.గోవర్ధనం గానం: ఘంటసాల

సాకి: దీనుల కాపాడుటకు దేవుడే ఉన్నాడు
దేవుని నమ్మినవాడు ఎన్నడూ చెడిపోడూ
ఆకలికి అన్నము వేదనకు ఔషదం
పరమాత్మని సన్నిధికి రావే ఓ మనసా
ప: రారా క్రిష్ణయ్యా రారా క్రిష్ణయ్యా
దీనులను కాపాడ రారా క్రిష్ణయ్యా ॥రారా॥
చ: మా పాలిటి ఇలవేలుపు నీవేనయ్యా
ఎదురుచూచు కన్నులలో కదిలేవయ్యా
పేదల మొరలాలించే విభుడవు నీవే
కోరిన వరముల నొసగే వరదుడవీవే ॥పేద॥
అజ్ఞానపు చీకటికి దీపము నీవే
అన్యాయము నెదిరించే ధర్మము నీవే
నీవే క్రిష్ణా నీవే క్రిష్ణా నీవే క్రిష్ణా ॥రారా॥
చ: కుంటి వాని నడిపించే బృందావనం
గ్రుడ్డివాడు చూడగలుగు బృందావనం
మూఢునికి జ్ఞానమొసగు బృందావనం
మూగవాని పలికించే బృందావనం ॥మూఢుని॥
అందరిని ఆదరించు సన్నిధానం
అభయమిచ్చి దీవించే సన్నిధానం
సన్నిధానం దేవుని సన్నిధానం...సన్నిధానం ॥రారా॥
చ: కరుణించే చూపులతో కాంచవయ్యా
శరణొసగే కరములతో కావవయ్యా
మూగవాని పలికించి బ్రోవవయ్యా
కన్నతల్లి స్వర్గంలో మురిసేనయ్యా
నిన్నుచూచి బాధలన్ని మరిచేమయ్యా
ఆధారము నీవేరా రారా కృష్ణా ॥నిన్ను॥ ॥రారా॥

**లలిత గీతం** సంగీతం, గానం: ఘంటసాల

సాకి: ఆ రజనీకర మోహనబింబము
నీ నగుమోమును బోలునటే
కొలనిలోని నవ కమల దళమ్ములు
నీ నయనమ్ముల బోలునటే
ఎచట చూచిన ఎచట వెదిన
నీ రూపమదే కనిపించినదే
ప: తలనిండ పూదండ దాల్చినరాణి
మొలక నవ్వులతోడ మురిపించబోకే
చ: పూల వానలు కురియు మొయిలువో
మొగలి రేకులలోని సొగసువో... నా రాణి ॥తలనిండ॥
చ: నీ మాట బాటలో నిండే మందారాలు
నీ పాట తోటలో నిగిడే శృంగారాలు
నీ మేనిలో పచ్చ చేమంతి అందాలు
నీ నీలవేణిలో మెరిసే ఆకాశాలు ॥తలనిండ॥

**చిత్రం: మూగనోము**
సంగీతం: ఆర్.గోవర్ధనం గానం: ఘంటసాల

నిజమైనా కలయైనా నిరాశలో ఒకటేలే
పగలైనా రేయైనా ఎడారిలో ఒకటేలే
పదేపదే ఎవరినో పరాకుగా పిలిచేను
నా నీడే తోడై జగమంతా తిరిగేను ॥నిజ॥
గులాబినై నీ జడలో మురిశానే ఆనాడు
బికారినై నీకోసం వెతికానే ఈనాడు ॥నిజ॥
చెలి చెలి నామదిలో చితులెన్నో రగిలేను
చెలి లేని నాకేమో విషాదమే మిగిలేను ॥నిజ॥

**చిత్రం: లేతమనసులు**
సంగీతం: ఎం.ఎస్.విశ్వనాథన్ గానం: పి.బి.శ్రీనివాస్, పి.సుశీల

అ: అందాల ఓ చిలకా అందుకో నా లేఖ
నా మదిలోని కలలన్నీ ఇక చేరాలి నీదాకా
ఆ: అందాల చెలికాడా అందుకో నాలేఖ
నా కనులతో రాసాను ఈ మదిలోన దాచాను
అ: మిసమిసలాడే చిన్నదానా ఎందుకని
తళతళ లాడే వేమిటిని ॥మిసమిస॥
కురుల మోముపై వాలెనేలనో
విరులు కురులలో నవ్వెనెందుకో
అడుగుతడబడే చిలకకేలనో
పెదవి వణికెను చెలియకెందుకో ॥అందాల॥
ఆ: మిసమిసలాడే వయసోయి
తళతళలాడె కనులోయి ॥మిసమిస॥
కురులు మోముపై మరులు గొనెనులే
విరులు కురులలో సొగసు నింపెలే
అడుగు తడబడె సిగ్గు బరువుతో
పెదవి వణికెలె వలపు పిలుపుతో ॥అందాల॥
ఆ: నీవే పాఠం నేర్పితివి నీవే మార్గం చూపితివి
అ: ప్రణయ పాఠము వయసు నేర్పులే
మధుర మార్గము మనసు చూపులే
ఆ: నీవు పాడగా నేను ఆడగా
యుగము క్షణముగా గడచిపోవుగా ॥అందాల॥

**చిత్రం: మేనకోడలు**
సంగీతం: ఘంటసాల గానం: పి. సుశీల

తిరుమల మందిర సుందరా
సుమధుర కరుణా సాగరా
ఏ పేరున నిను కొలచేనురా
ఏ రూపముగా కొలిచేనురా ॥తిరు॥
పాలకడలిలో శేషశయ్యపై పవళించిన శ్రీ పతివో
వెండికొండపై నిండు మనముతో వెలిగే గౌరీపతివో
ముగ్గురమ్మలకే మూలపుటమ్మగ
భువిలో వెలసిన ఆదిశక్తివో ॥తిరు॥
కాంతులు చిందే నీ ముఖ బింబము
కాంచిన చాలును గడియైనా
నీ గుడి వాకిట దివ్వెను నేనై
నిలిచిన చాలును రేయైనా
నీ పదములపై కుసుమము నేనై
నిలిచిన చాలును క్షణమైనా ॥తిరు॥

**చిత్రం: ఒకే కుటుంబం**
సంగీతం: ఎస్.పి.కోదండపాణి గానం:ఘంటసాల

మంచిని మరచీ వంచన నేర్చీ
నరుడే ఈనాడు వానరుడైనాడూ...వానరుడైనాడు
చదువూ తెలివి పెంచాడు చంద్రలోకము జయించాడు
నీతులు చెప్పి గోతులు త్రవ్వి పాతాళానికి జారాడు
మెదడే పెరిగీ హృదయం తరిగి నరుడే ఈనాడూ
వానరుడైనాడు.... వానరుడైనాడు ॥మంచిని॥
అందరి చెమట చిందించాడు
సంపద యెంతో పెంచాడు
పంపకమంటూ వచ్చేసరికి అంతా తనదే నన్నాడు
ధనమేహెచ్చి గుణమే చచ్చి నరుడే ఈనాడూ
వానరుడైనాడు... వానరుడైనాడూ

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| **తమిళం** | | **తెలుగు** | |
|---|---|---|---|
| చిత్రం | : నానుమ్ ఒరు పెణ్ | చిత్రం | : నాదీ ఆడజన్మే |
| రచన | : కణ్ణదాసన్ | రచన | : దాశరథి |
| సంగీతం | : ఆర్.సుదర్శనం | సంగీతం | : ఆర్.సుదర్శనం |
| గానం | : టి.ఎం. సౌందరరాజన్, పి.సుశీల | గానం | : ఘంటసాల, పి.సుశీల |



అ : పూప్ పోల పూప్‌పోల పిఱక్కుమ్
పాల్ పోల పాల్ పోల శిరిక్కుమ్
ఆ : మాన్ పోల మాన్‌పోల తుళ్‌ళుమ్
తేన్ పోల ఇదయత్ తై అళ్‌ళుమ్
అ : మలర్ పోల శిరిక్కిన్‌ఱ పిళ్‌ళై
కణ్‌డు మగిళాద ఉయిరొన్ఱుమ్ ఇల్‌లై
ఆ : మడిమీదు తవళ్‌గిన్‌ఱ ముల్‌లై
మళలైచ్‌చొల్ ఇన్‌బత్‌తిన్ ఎల్‌లై
ఆ : ఉళ్‌ళాడుమ్ ఉయిరొన్ఱు కణ్‌డేన్
అవన్ ఉరువత్‌తై నాన్ ఎన్‌ఱు కాణ్‌బేన్
అ : తళ్‌ళా తళ్‌ళాడి వరువాన్
తణియాద ఇన్‌బత్‌తై తరువాన్





'నానుమ్ ఒరు పెణ్' తమిళ చిత్రంలోని ఈ పాట బాణీనే 'నాదీ ఆడజన్మే' చిత్రంలోని 'చిన్నారి పొన్నారి పువ్వు' పాట కూడా అనుసరించింది. తమిళ చిత్రంలోని గీతాన్ని కణ్ణదాసన్ రాశారు. తెలుగు పాటను రాసినవారు దాశరథి. తమిళ గీతాన్ని టి.ఎం.సౌందరరాజన్, పి.సుశీల పాడారు. తెలుగు పాటను ఘంటసాల, పి.సుశీల పాడారు. ('నానుమ్ ఒరు పెణ్' చిత్రం 'మై భీ లడ్కీ హూఁ' పేర హిందీలో నిర్మించినపుడు ఇదే సన్నివేశంకోసం 'చందాసా హోగా ఓ ప్యారా' అంటూ సాగే పాటను - పి.బి.శ్రీనివాస్, లతామంగేష్కర్ పాడారు. ఆ చిత్రంలో చిత్రగుప్త వినిపించిన సంగీతం మీద తమిళ చిత్ర సంగీత ప్రభావం బాగానే ఉన్నట్టు అనిపిస్తుంది). తెలుగు, తమిళ చిత్రాలు రెండింటికీ సంగీత దర్శకులు ఆర్.సుదర్శనం.

తమిళ గీతం ఏం చెబుతున్నదో చూద్దామా!

అతను : పువ్వులాగా (పువ్వులాగా) పుడుతుంది (పుడతాడు)
పాలలాగా (పాలలాగా) నవ్వుతుంది (నవ్వుతాడు)
ఆమె : జింకలాగా (జింకలాగా) తుళ్ళుతుంటాడు
తేనెలాగా (తేనెలాగా) మనసునే దోస్తాడు
అతను : పువ్వులాగా నవ్వే పాపాయి(ని)
చూసి ఆనందించని జీవి ఉండదు
ఆమె : లోపల కదిలే జీవిని నే కనుగొన్నాను (పొందాను)
వాడి రూపాన్ని నేను ఎపుడు చూస్తానో
అతను : తప్పటడుగులు వేస్తూ వస్తాడు
తరగని ఆనందాన్ని ఇస్తాడు

పాపాయి అనే అర్థంలో 'పువ్వులాగా పువ్వులాగా పుడుతుంది' అని మొదలయినా పాటలో పాపాయి అబ్బాయే. 'పువ్వులాగా పువ్వులాగా' 'పాలలాగా పాలలాగా' 'జింకలాగా జింకలాగా' 'తేనెలాగా తేనెలాగా' అని ఒక్కొక్క పదాన్ని రెండేసి సార్లు వాడి తమిళ రచయిత - ఆ పాపాయి సౌకుమార్యాన్నీ అందచందాలనూ వర్ణించారు.

కథానాయిక నల్లగా ఉంటుందని ఆమెను అందరూ చిన్నచూపు చూస్తుంటారు. ఆమె మనసును ఎవరూ గమనించరు. అత్తింటా ఆమెకు మొదట అటువంటి అనుభవమే ఎదరవుతుంది. అయితే భర్త ఆమెను అర్థం చేసుకుంటాడు. ఆ దంపతుల మధ్య అన్యోన్యత పెరుగుతుంది. నాయిక గర్భవతి అవుతుంది. తమ కడుపు పంటగా పుట్టబోయే ఆ బుజ్జాయి గురించి నాయికా నాయకుల కలలు ఏమిటో వివరిస్తుంది ఈ పాట.

పువ్వులాగా పుట్టిన ఆ బాబు పాలలాగా నవ్వుతాడు. జింకలాగా గంతులేస్తూ తేనెలా తీయగా ఉండి మనసునే దోస్తాడు. పువ్వులాగా నవ్వే పాపాయిని చూసి మురిసిపోని వారెవరుంటారు? తన ప్రాణానికి ప్రాణంగా తనలో రూపుదిద్దుకుంటున్న తన ముద్దుల పాపాయిని ఎప్పుడు చూడగలనో అని ఆ తల్లి ఆరాటపడుతున్నది. ఆ ఆరాటం విని ఆమె భర్త- తమ ముద్దులయ్య బుడిబుడి అడుగులు వేస్తూ నడచి వస్తాడనీ తరిగిపోని ఆనందాన్ని కలిగిస్తాడనీ ఆమెకు నచ్చచెబుతాడు.

తొలిచూలు బిడ్డ గురించి దంపతుల ఆలోచనలనూ ఆరాటాలనూ సున్నితంగా వివరిస్తుంది ఈ గీతం.

దాశరథి 'నాదీ ఆడజన్మే' కోసం రాసిన 'చిన్నారి పొన్నారి పువ్వు' పాట- తమిళగీతం ఒరవడిలోనే సాగినా కొంత భిన్నంగా కనిపిస్తుంది.

ఆ చిన్నారి పొన్నారి పువ్వు - ఆ ఇంటి పొదరింటి పువ్వట. ఆ పువ్వు విరబూసి నవ్వుతుందట. తనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులను చూసి నవ్వుతుందట. తమిళగీతం పల్లవిలో కనిపించే పాల నవ్వు, జింక తుళ్లింత, తేనె తీయదనం - తెలుగు పాటలో కనిపించవు. తమిళగీతం పల్లవి తొలి పంక్తిలోని పువ్వు తెలుగు పాట పల్లవి అంతటా వ్యాపించింది.

ఈ పాట గురించి దాశరథి చెప్పిన ముచ్చట ఒకటుంది.

తొలిచరణం చివర 'ఏ చింత ఏ వంతలేని పసివాడే నిజమైన మౌని'

అని ఆయన రాస్తే, డిస్ట్రిబ్యూటర్‌లలో ఒకరు " 'మౌని' అంటే ఏమిటండీ?" అని అడిగారట. "మౌనంగా ఉండేవాడు మౌని. సాధారణంగా మునులను 'మౌని' అంటారు" అన్నారట దాశరథి.

"ఏమో ఈ వాక్యం చాలా కష్టంగా ఉందండీ" అన్నారట డిస్ట్రిబ్యూటర్.

"నిజానికి ఋషులకూ మునులకూ ఏవో చింతలు ఉంటూ ఉంటాయి - సంసార బాధ్యతలు వదల్చుకున్నాక కూడా... పసివాళ్లకు అటువంటి వేవీ ఉండవు.. అందుకే అలా రాశాను," అన్నారట దాశరథి. "స్టాండర్డ్ చాలా ఎక్కువగా ఉంది... పాట అందరికీ అర్థం కావాలి కదా!" అని డిస్ట్రిబ్యూటర్ తమ అభిప్రాయం చెప్పారు. అప్పటిదాకా బాగుందన్న తక్కినవారు - "పోనీ ఆ పంక్తులు మార్చి రాయవచ్చు కదా?" అని సలహా చెప్పారట. దాశరథి మనసు చివుక్కుమన్నా చలన చిత్రాలలో పాటలు రాసేవారు వడిగా వాడిగా రాయగలిగి ఉండాలన్న చిత్ర సూత్రం తెలిసిన వారు కనుక - రెండు నిమిషాలలో కొత్త పంక్తి ఆలోచించారు. "పసివాడు పలికేటి మాట ముత్యాల రతనాల మూట" అని, "ఇది సరిపోతుందా" అని అడిగారు. అందరూ "బాగా కుదిరింది" అన్నారు. అలా ఆ పంక్తి పాటలోకి చేరింది.

తమిళ గీతంలో నాయిక తనలో కదలాడే జీవి గురించి ప్రస్తావిస్తుంటే దాశరథి తెలుగులో 'హృదయాన కదలాడు బాబు' అని రాయడం హృదయంగమంగా ఉంది. పుట్టబోయే బిడ్డ మనసంతా నిండి ఉన్నాడు. మనసు ఆ బుల్లి పాపడి గురించి కలలు కంటున్నది. మనసులోని ఆ బాలుడు రేపోమాపో ఉయ్యాల జంపాలలూగ గలడని నాయిక ఆశిస్తున్నది.

తెలుగు పాట చివర ఉన్న నాటకీయధ్వని తమిళంలో లేదు. ఆ తల్లిదండ్రులు అన్ని కలలకంటున్నా - ఆ బాబు "కనుమూసి నిదురిస్తాడు. కలలలోనే దోగాడుతాడు" అని రాశారు దాశరథి. ఆ బాబు కలలకే పరిమితమనీ ఆ దంపతుల కల కల్ల కానున్నదనీ సూచిస్తున్నాయి ఆ పంక్తులు.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

**దాశరథి రాసిన ఆ తెలుగు పాట ఇక్కడ:**

**చిన్నారి పొన్నారి పువ్వు**
**విరబూసి విరబూసి నవ్వు**
**మన ఇంటి పొదరింటి పువ్వు**
**నిను చూసి నను చూసి నవ్వు ॥చిన్నారి॥**
**హృదయాన కదలాడు బాబు**
**రేపు ఉయ్యాల జంపాలలూగు**
**పసివాడు పలికేటిమాట**
**ముత్యాలరతనాల మూట ॥చిన్నారి॥**
**ఒడిలోన పవళించువేళ**
**నేను పాడేను ఒక జోల పాట**
**కను మూసి నిదురించు బాబు**
**కలలందు దోగాడగలడు ॥చిన్నారి॥**








## కొంటెకొశ్శెన్లు - తుంటరి జవాబులు

వి.మంజురాణి - హైదరాబాద్.

ప్ర: గవర్నమెంటు ఆఫీసుల్లో ఫైళ్ళు మురిగిపోకుండా ఉండాలంటే ఏం చేయాలంటారు?

జ: ప్రతి ఫైల్ మీదా సెంటు స్ప్రే చేస్తూ వుంటేసరి.

ప్ర: భయంకర నారీ ద్వేషి ఎలా వుంటాడు?

జ: ఎంత ఆశ్చర్యం వేసినా 'తాత' అంటూ నోరు నొక్కుంటాడే తప్ప 'అవ్వ' అనే మాటని నోట రానియ్యడు.

ప: తుమ్మితే చిరంజీవి అనాలిట... మరీ దగ్గితే!?

జ: వెంకటేష్ అనండి. ఎలాగూ ఆయనింటి పేరు దగ్గుపాటి వారు కదా...



## పేరు - రిపేరు




తొలి చూపులోనే - నువ్వునాకు నచ్చావ్

- టి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.

ఆడంతే అదోటైపు - చిక్కడు - దొరకడు
దొంగోడు - వీడే - పట్టుకోండి చూద్దాం

- పి.శరవణ, తిరువెల్లూర్



చిలిపి లిపి




Your Juice = నీరసం
Cloth Head = బట్ట తల

- డి. బెనర్జీ, శ్రీకాకుళం.

V D The = విడిది

- పి.ప్రియాంక, విశాఖపట్నం.

## ఈ రూటేవేరు




దానిమ్మ = Come Lemon
కరివేప = Elephent neem

- పి.యం. ఆచారి, మౌలాలి.

వర హాలు = స్వయంవర మండపం

- వి.మంజురాణి, హైద్రాబాద్.

## డబుల్ రోల్




వేలాడుతున్న కరెంట్ **తీగ**ల గురించి కంప్లయింట్ చేస్తే ఇవాళ్టివరకూ **అతీగతీ**యలేదు.

**- సి.వరహాల్రావ్, చందానగర్.**

నీ **సంపద** కనీసం **పద** మూడు కోట్లయినా ఉంటుంది కదా

**- విశ్వజ, రుద్రారం.**

అయి**దున్న**ర అయిపోయినా ఆ **దున్న**ని దొడ్లో కట్టకపోతే ఎలా?

**- కోనే నాగవెంకట ఆంజనేయులు, ఉక్కునగరం.**

## పేరడీ పేరేడ్



ప: నలుగురికీ వండినది నాకొక్కడికి చాలదురో
నరులెవరూ తినలేంది సింగిల్‌గా నే తింటాన్రో
జోకులు వేశారంటే
అది మీలో హ్యూమరిజం
లావని డాక్టర్లన్నా
ఇహ మారదు నా సైజం
నేను ఒక్కడిని ఒకవైపు కుంభాలోకవైపు
నేను ఒక్కడిని ఒకవైపు కుంభాలోకవైపు ॥నలుగురికీ॥
చ: మెలకువలోన భోంచేయడం నథింగ్ స్పెషల్
నిద్రలో ఉన్నా లాగించేయుట సంథింగ్ స్పెషల్
గ్లాసుడు కాఫీ తాగామంటే నథింగ్ స్పెషల్
గుండిగనంతా ఖాళీ చేస్తే సంథింగ్ స్పెషల్
ఆకలివేస్తే కేకులు తినడం నథింగ్ స్పెషల్ ॥ఆకలి॥
బేకరి మొత్తం లేపెయ్యడం సంథింగ్ స్పెషల్ ॥నలుగురికీ॥
చ: మేడ మెట్లను ఎక్కి వెళ్లడం నథింగ్ స్పెషల్
లిఫ్టు ఎక్కినా లాగకపోతే సంథింగ్ స్పెషల్
పెళ్లికి రమ్మని ఆహ్వానిస్తే నథింగ్ స్పెషల్
రావొద్దంటూ దండం పెడితే సంథింగ్ స్పెషల్
బ్రతుకుట కోసం తినడం అంటే నథింగ్ స్పెషల్
తిండి కోసమై బతికామంటే సంథింగ్ స్పెషల్

**- బి.అరుణ, నావులూరు.**

**'టక్కరిదొంగ' చిత్రంలోని 'నలుగురికీ నచ్చనిది నాకసలే నచ్చదురో' పాటకు పేరడీగా...**

## చిలిపి కవిత



ప్రేమ - సరాగాల సంపుటి
పెళ్లి - అనురాగాల సంకటి
కుటుంబమే - గుండెల మీద కుంపటి
మగడు - పిత్రార్జితం
ప్రియుడు - మిత్రార్జితం
ఇద్దరూ ఒకటైపోవడం - కష్టార్జితం
పిల్లలకు వెగటైపోవడం - నష్టార్జితం

**- డా॥ నెల్లుట్ల వెంకటేశ్వరరావు, సికింద్రాబాద్.**

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| ఆకెళ్ల దివాకర్ | = | ఆది |
| సోది మహీధర్ | = | సోమ |
| మందుల గంగా ఊర్మిళ | = | మంగళ |
| బుగ్గా ధనుంజయ | = | బుధ |
| గుడిపూడి రుక్మిణి | = | గురు |
| శుభాల చక్ర | = | శుక్ర |
| శనగల నిరంజన్ | = | శని |

**- టి. చంద్రశేఖరయ్య, రామసముద్రం.**



# స్వర సుందరి లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,

బహుభాషా కోవిదుడు, కవి, రచయిత

'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'కోసం' పాఠకుల కోసం

తన అభిమాన గాయని జీవిత చరిత్రను

అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

లతలో వున్న ఒక గొప్ప గుణం, ఆత్మాభిమానంతో కూడిన ఆత్మ విశ్వాసం. ప్రారంభ దశలోనే ఎవరుగానీ, ఎంతటి శక్తిమంతులైన వ్యక్తులు గానీ, పరిధిని మించి ప్రవర్తిస్తే, పాఠం నేర్పడం ఆమెకు ఎడమచేతి ఆట (అనగా హిందీలో - బాయేఁ హాథ్‌కా ఖేల్).-

ఆ రోజుల్లో, శ్యాంసుందర్ అనే సంగీత దర్శకుడు, గొప్ప పేరూ, పలుకుబడీ, సంపాదించుకున్న వ్యక్తి. 'లాహోర్' అనే చిత్రానికి, ఒక పాటకి శ్యామ్ సుందర్ మేటి వరస కూర్చి, పాడేందుకు, అప్పట్లో కొత్త కొత్తగా పైకి వస్తున్న లతామంగేశ్‌కర్‌నే పిలిపించారు. ఆయనకి ఒక చెడ్డ అలవాటు 'త్రాగుడు'. బాగా తాగేసి, తనని తనే మఱిచిన వేళ అందర్నీ తిట్టి, దుర్భరమైన దుర్భాషలాడడం బలమైన బలహీనత. లతా పాడేటప్పుడు ఏదైనా చిన్న వ్యత్యాసం గోచరించినా, "ఒళ్లు దగ్గిర పెట్టుకు మరీ పాడు. ఇది అల్లాటప్పా ట్యూను కాదు. శ్యాంసుందర్ స్వరపరిచినది" అని అంటూ అంతటితో ఊరుకోకుండా కొన్ని ముఱికి మాటలు కూడా వాడాడట.

దాంతో లతాకి ఒళ్లు మండుకొచ్చింది. తను ఎంత కొత్త గాయకి అయినా తనంటే అంత చులకనా అని నొచ్చుకుని మాఱుమాట్లాడకుండా, టేకు పాడకుండా వెళ్లిపోయింది. శ్యాంసుందర్ తరువాత పశ్చాత్తాపడి, ఎన్నోసార్లు కబురు పంపించినా, రానని భీష్మించుక్కూర్చుంది. తన పాటకి లత మాత్రమే సంపూర్ణ న్యాయం చెయ్యగలదని బాగా యెఱిగిన శ్యామ్‌సుందర్ లతా పాడనప్పుడు, ఈ పాటే రికార్డు చెయ్యొద్దు అని నిశ్చయించుకున్నాడు. మఱొకరి చేత పాడించమని నిర్మాత ఒత్తిడి చేసినా ఆయనకి మనస్కరించలేదు.



చివరికి నిర్మాత తనే స్వయంగా వెళ్లి, లతాని ప్రాధేయపడి, శ్యాంసుందర్ మళ్లీ అలా ప్రవర్తించకుండా వుండడానికి తను బాధ్యత వహిస్తానని హామీ యిచ్చిన పిదప లత సమ్మతించి, ఆ పాట పాడి వెళ్లింది. అది పెద్ద హిట్ సాంగ్ అయింది. అటుపిమ్మట కూడా శ్యాంసుందర్ తన ధోరణి మానకపోయేసరికి, లత మళ్లీ ఆయన సంగీతంలో పాడేందుకు తిరస్కరించింది.

శ్యాంసుందర్ అహంభావం దెబ్బతినడం వల్ల లత పాడకపోయినా తను హిట్ సాంగ్సు అందించగలనని ఋజువు చేసుకునేందుకు, మిగతా వాళ్ళ చేత

- ❖ లతా స్కూలు కెళ్లినది ఒక్కరోజు మాత్రమే, కానీ న్యూయార్క్ యూనివర్శిటీతో సహా ప్రపంచం మొత్తం మీద ఆరు యూనివర్శిటీలు ఆమెకు డాక్టరేటు ప్రదానం చేశాయి.
- ❖ రెండేళ్ల వయసులో ఆమెకు మశూచికం పోయడం వల్ల ఆ మచ్చలు అలాగే వుండిపోయాయి. ఆమెకు సైనస్ ప్రాబ్లెమ్ కూడా వుంది.
- ❖ ఆరేళ్లవయసులో ఓ పాట పాడుకుంటూ వెళుతూ కిందపడిపోయి స్పృహ పోగొట్టుకుంది. కాస్సేపటికి స్పృహ వచ్చాక పాట ఎక్కడ ఆపిందో మళ్లీ అక్కణ్నుంచే పాడింది.
- ❖ లతా ఎప్పుడూ కాలికి చెప్పులు వేసుకోకుండా పాడుతుంది
- ❖ చాలామంది సింగర్స్ 2 ఆక్టేవ్స్‌లో మాత్రమే పాడగలరు. కానీ లతా 3 ఆక్టేవ్స్‌లో పాడగలుగుతుంది.
- ❖ 1985లో టొరాంటోలో లతా ఒక ప్రదర్శన ఇచ్చింది. తృతీయప్రపంచదేశాల ఆర్టిస్టు ఒక అగ్రగామిదేశపు చారిటీ ఆర్గనైజేషన్‌కి పాడడం అదే ప్రథమం. ఆ ప్రదర్శన వల్ల ఒకటిన్నర లక్షల డాలర్ల ఆదాయం వస్తే లతా అది దానంగా ఇచ్చివేసింది.
- ❖ తన స్వీట్ వాయిస్ నిలుపుకోవడానికి లతా తరచుగా తినేది కొల్హాపురీ మిరపకాయల్ని! తన దవడ కండరాలకు ఎక్సర్‌సైజ్ ఇచ్చేది బబుల్‌గమ్ నమలడం ద్వారా!
- ❖ పాట పాడేముందు లతా స్క్రిప్టు తన భాషలో ఓ కాగితం మీద రాసుకుని పాడుతుంది. పైన 'శ్రీ' అని రాసుకోవడం ఆమె అలవాటు.
- ❖ స్వభావరీత్యా సిగ్గరి అయినా జోక్స్ చెప్పడం, మిమిక్రీ చేయడం లతా అలవాటు.

**సేకరణ - గౌరవ్ కుమార్**



పాడించారు కానీ ఆ సినిమాలు అంత విజయవంతం కాకపోయే సరికి, డీలా పడిపోయారు.

'అలీఫ్‌లైలా' అనే చిత్రానికి శ్యాంసుందర్ని బుక్ చేసుకున్న ఒక నిర్మాత లతా ఆయన సంగీతంలో పాడదని తెలిసిన మీదట, సంగీత దర్శకుడినే మార్చివేసేటందుకు పూనుకున్నాడు. ఆ విషయం తెలిసి, లత చాలా నొచ్చుకుని తన వలన ఆయన వృత్తి కుంటుపడకూడదనే సదుద్దేశ్యంతో, నిర్మాతకు కబురంపించింది. శ్యాంసుందర్‌ని మళ్లీ మ్యూజిక్ డైరెక్టర్‌గా నియమిస్తేనే తను పాడతానని చెప్పింది. నిర్మాత సరేనన్నాడు. కానీ నిస్పృహతో శ్యాంసుందర్ అప్పటికే ఫిలిం పరిశ్రమని వదిలివెళ్లి పోయాడు. కానీ లతా పట్టుబట్టడంతో నిర్మాత ఆయన్ని వెతికి తీసుకువచ్చాడు. లతా అతని సంగీతదర్శకత్వంలో పాడింది.

తనవలన యితరుల జీవితం పాడవుతుందని తెలిస్తే లత బాధపడి తన ఇష్టా యిష్టాలపై ఆధారపడిన నిర్ణయాలను మార్చుకుని, సహకరించేందుకు సిద్ధ పడిందంటే, ఆమె మనస్తత్త్వం ఎంత మెత్తనిదో విశదమౌతుంది. కాని ఆమెని గురించి, తరువాత కూడా కొన్ని విచిత్ర సందర్భాలలో, 'గొప్ప కంఠమే తప్ప గొప్ప హృదయం లేని గాయకురాల'ని లతపై అపప్రచారాలు సాగడం విషాదకరం.

ఆనాటి సంగీత దర్శకులందరూ, తమ విశిష్ట

## లతా గానలహరి

### మౌసమ్ హై...



చిత్రం : పాకీజా
రచన : కమాల్ అమ్రోహీ
సంగీతం : గులాం మొహమ్మద్
అభినయం : మీనాకుమారి

మౌసమ్ హై ఆశికానా ఏ దిల్ కహీఁసే
ఉన్‌కో ఐసే మే ఢూంఢ్‌లానా 2 ॥మౌసమ్॥
కెహనా కే రుత్‌జవాఁహై అవుర్ హమ్ తరస్ రహే హై
కాలీ ఘటాకే సాయే, బిరహన్‌కో డస్ రహే హైఁ
డర్ హై నా మార్ డాలే, సావన్‌కా క్యా ఠికానా 2 ॥మౌసమ్॥
సూరజ్ కహీఁ భీ జాయే తుమ్ ఫర్ న ధూప్ ఆయే 2
ఆ.. తుమ్‌కో పుకార్‌తే హై ఇన్ గేసువోఁ కే సాయే
ఆజావో మై బనాదూఁ పల్కోంకా శామియానా 2 ॥మౌసమ్॥
ఫిర్‌తే హైఁ హమ్ అకేలే, బాహోఁ మే కోయీ లేలే
ఆఖిర్ కోయీ కహాఁ తక్ తన్‌హాయియోఁ సే ఖేలే
దిన్ హో గయే హై జాలిమ్, రాతేహై కాతిలానా 2 ॥మౌసమ్॥
యే రాత్ యే ఖామోశీ, యే ఖ్వాబ్ యే నజారే 2
జుగ్నూ హై యా జమీ పర్ ఉతరే హుయేహైఁ తారే
బేఖ్వాబ్ మేరీ ఆంఖే మధుహోశ్ హై జమానా 2 ॥మౌసమ్॥

రచనలన్నీ లత గళస్వరంలో ఊహించుకొని మరీ రూపొందించేవారు. రమారమి, భారతదేశంలోని వివిధ ప్రాంతాల, వివిధ భాషల సంగీత సాహిత్య రచయితలు లత గళంలో తమ రచనలు 'అజరామరత్వం' సాధించాలని ఆశపడినవారే. ఆ విధంగా విభిన్న విశిష్ట ప్రాంతాల ప్రత్యేకతలతో, లతకి ఎవరికీ లభించని అవకాశాలు లభించాయి. కారణం లత గొంతులోని ప్రత్యేకత. "మొఘలేఆజం" చిత్రంలోని 'మోహె పన్‌ఘట్ పే నంద్‌లాల్' స్వరపఅచిన సందర్భాన, 'ఈ పాటని నీ చేతనే పాడించాలని సంకల్పించి రూపొందించాను. నీవు కాక మఱెవ్వరు న్యాయం చేకూర్చగలరు?' అని సాక్షాత్తూ సంగీతదర్శకసార్వభౌములు నౌషాద్‌గారే దాపరికం లేకుండా లతతో సాయించారట.

సలిల్ చౌదరీ మదన్‌మోహన్‌ల సరళ గీతాలు కూడా క్లిష్టమైన అంశాలు గలవి. లతతప్పితే తక్కినెవ్వరూ తమ గీతాలని పరిపూర్ణతతో ఆలపించలేరు అని నమ్మినవారు వారు. ఆ మాట లతతో విస్పష్టంగా చెప్పేవారట. సి.రామచంద్ర, ఎన్.డి.బర్మన్ హేమంత్‌కుమార్‌లు సరేసరి. లత కోసమనే విశిష్టంగా శ్రద్ధ వహించి ట్యూన్లు చేసి, ఆమె రాకకోసం వేచి వున్న సంగీత దర్శకులు వారు. ఆదిలో అనిల్‌బిశ్వాస్ ఆమె స్వరానికి ముగ్ధులై నిశ్శంకగా, నిరవరోధంగా, పదాలకి స్వరాలు సమకూర్చి, ఆమెకు ఎన్నెన్నో మంచి విషయాలు నేర్పిన కళాప్రవీణులు. ఇప్పటికీ లత గానం వల్ల కొంతమంది సంగీత దర్శకులు పైకి వచ్చారా, కాక, వారి స్వరరచనల ద్వారా ఆమె పైకి వచ్చారా అనేది అనేకమంది అభిమానులు తఱుచూ సాగించే చర్చ.

ఇన్నేళ్ల సంగీత వృత్తిలో, లతా సంగీత దర్శకురాలుగా పనిచేసిన చిత్రాలు చాలా తక్కువ. వాటిలో మరాఠీ చిత్రాలే ఎక్కువ. ఆమె మొదటిసారిగా సంగీతం అందించడానికి ఒప్పుకున్నది, ఒక మరాఠీ చిత్రానికి, అదీ ఒక మరాఠీ రచయిత చిత్ర నిర్మాతకి ఉపకారం చేసేందుకనే. ఆయన పేరు దినకర్ పాటిల్.

చాలా యిబ్బందుల్లో ఉన్న ఆయన ఒక మరాఠీ చిత్రం తీయాలని, కథ, స్క్రిప్టు తయారు చేసుకున్నా కూడా, దానికి పెట్టుబడి పెట్టేందుకు ఎవరూ ముందుకు రాలేదు. పైగా చిత్రానికి ఎలాంటి పాటలు రూపొందుతాయో దాన్ని బట్టి ఆలోచిస్తాం అన్నారు పెట్టుబడిదారులు. పాటలు రాయడం పూర్తి అయినా, వాటికి సంగీతం కుదర్చడానికి దినకర్ ఏ సంగీత దర్శకుడినీ కుదుర్చుకోలేక, కలత జెంది వుండగా, చూసి వెత చెందిన లతా ఆ పాటలకి చక్కని వరసలు కూర్చింది. అంతేకాదు, రికార్డు చేయించే బాధ్యత కూడా వహించింది. డిస్ట్రిబ్యూటర్లు వెంటనే ముందుకు వచ్చి నిర్మాతను రక్షించారు.

"రాం రాం పాహునే" అనే ఆ చిత్రం రజతోత్సవం జరుపుకుంది. అద్భుతంగా అమరిన చిత్రగీతాలు అన్నీ బహుళ జనాదరణ పొందాయి. పెట్టుబడిదారుల డిమాండ్ మేరకు నిర్మాతను ఒడ్డున పడేయడానికి ఈ సినిమాకు తన స్వంతపేరు ఉపయోగించినా, తర్వాతి చేసిన నాలుగు మరాఠీ సినిమాలకు లత తన పేరు ప్రకటించకుండా 'ఆనందఘన్' అనే పేరుతో సంగీతం నిర్వహించింది.

'మోహిత్యాంచి మంజుళ' అనే మరాఠీ

## లతా కాంప్లెక్స్‌తో

లతా పైకి రావడానికి నౌషాద్ ఎంతో సహకరించారని అందరికీ తెలుసు. ఆమె చెల్లెలు ఆశా చేత మాత్రం తప్పనిసరి పరిస్థితులలోనే పాడించారు. ఆశా వాయిస్ గురించి ఓ జర్నలిస్టు వద్ద నోరుజారి అవస్థ పడవలసివచ్చింది కూడా.

లతా ఒకలా కష్టపడి పైకివస్తే, ఆశాభోంస్లే మరొకలా కష్టపడింది. తండ్రి చిన్నప్పుడే చనిపోవడం, పెద్ద కుటుంబాన్ని మోయరావలసిరావడం లతాకు భారమయితే, వ్యక్తిగత జీవితం ఆశాపట్ల అవరోధం అయింది. 14 యేళ్ల వయస్సులో భోస్లే అనే ఒక రేషన్ ఇన్‌స్పెక్టర్ ప్రేమలో పడి, ఇంట్లో వాళ్లతో చెప్పకుండా పారిపోయి పెళ్లాడడంతో ఆమె అవస్థలు పడింది. కుటుంబానికి అప్రదిష్ట, ఆర్థికపరమైన ఇబ్బందులు తెచ్చిన చెల్లెలిపై లతాకు సానుభూతి ఉండేది కాదు.

వాళ్లిద్దరి మధ్యా పదేళ్లపాటు మాటలు లేవు. కలిసి పాడవలసిన సందర్భాలలో మైకు ఎదుట ఎడమొగం, పెడమొగంగా నిలబడేవారు. వాళ్లిద్దరూ కలిసిపాడిన మొట్టమొదటి డ్యూయెట్ 'యే రుకీ రుకీ హవాయే యే బుఝే బుఝే సితారే' (దామన్, కె.దత్తా)లో వారిద్దరి మధ్యా ఉన్న దూరం స్ఫురిస్తుంది. శంకర్-జైకిషన్ సంగీతదర్శకత్వంలో పాడిన 'యే బర్‌ఖా బహార్ సౌతన్యా కే ద్వార్' (మయూర్‌పంఖ్), 'మన్ భావన్ కే ఘర్ జాయే గోరీ' (చోరీచోరీ), 'కర్ గయా రే' (బసంత్ బహార్), 'అజీ చలే ఆవో' (హలాకూ) హేమంత్‌కుమార్ సంగీతం సమకూర్చిన 'సఖీ రీ సున్ బోలే పపీహా ఉస్ పార్' (మిస్ మేరీ) సి.రామచంద్ర 'ఓ చాంద్ జహా వో జాయే' (శార్దా) - ఇవన్నీ ఒకళ్లు మైకుకి ఎడమవైపు, మరొకరు కుడివైపు నిలబడి పాడినవే! రాజ్‌కపూర్‌తో మొహమాటం వల్ల 'జిస్ దేశ్‌మే గంగా బహ్‌తీ హై'లో 'క్యా హువా యే ముఝే క్యా హువా క్యా పతా' పాటను ఆశాతో కలిసి పాడడానికి లతా ఒప్పుకుంది. 'ఐ మేరే వతన్ కే లోగో' లతా, ఆశా ఇద్దరూ కలిసి పాడాలని ముందు వేసిన ప్లాను లతా కారణంగా సోలోగా మారిందిట!

లతా చెల్లెలయిన కారణంగా ఛాన్సులు రాకపోగా, ఆమె వాయిస్‌తో పోల్చి 'అబ్బే' అని నోరు చప్పరించేవారు. లతా కాంప్లెక్సు నుండి ఆశాను బయటపడేసిన ఖ్యాతి నయ్యర్‌దే! "ఓ సారి ఆశాచేత బడే గులాం అలీ ఖాన్ ఠుమ్రీ పాడించి ఆమెకు తెలియకుండా రికార్డు చేసి తర్వాత వినిపించాను. తన రేంజ్ చూసి తనే ఆశ్చర్యపోయింది. నీది గీతాదత్ అంత మంచి వాయిస్. కష్టపడితే లతా అంత బాగా పాడతావు అని చెప్పేవాడిని. 'రాగిణి'లో 'ఛోటా సా బాల్‌మా' వంటివి ఆమెచే పాడించి ఆమె లతాకు ఏ మాత్రం తీసిపోదని ఆమెకూ, లోకానికీ నిరూపించాను." అంటాడు నయ్యర్!

ఆమె వాయిస్‌లో వల్గారిటీ ('బాజారూపన్') పోలేదని నౌషాద్‌కు చాలాకాలం దాకా అభిప్రాయం ఉండేది. అది ఓ సారి ఇలస్ట్రేటెడ్ వీక్లీ విలేఖరి వద్ద అంటే అది ఆయన పత్రికలో వేసేశాడు. అది చూసి ఆశా గొడవ చేయడంతో నౌషాద్ నాలిక్కరుచుకోవలసి వచ్చింది. ఆ మాట కొస్తే ఆశా రంగంలోకి వచ్చిన 6 యేళ్ల తర్వాతనే నౌషాద్ తన వద్ద ఆమెకు పాడే ఛాన్సిచ్చాడు. అది కూడా లతా ఆరోగ్యం బాగా లేకపోవడం బట్టే!

లతాకు చిన్నప్పటినుండీ సైనస్ ప్రాబ్లెమ్ ఉంది. రోజూ పొద్దున లేచాక పాడి చూసుకుంటే తప్ప ఆ రోజు సైనస్ తీవ్రత ఎంతుందో తెలియదు. 75 శాతం ఫిట్‌గా ఉన్నా లతా రికార్డింగు కాన్సిల్ చేసేసేది. నూటికి నూరు శాతం పాడగలనని ఆమెకు నమ్మకం చిక్కితేనే రికార్డింగుకు వచ్చేది. 'అమర్' సినిమాకు ఇంకా రెండు పాటలు రికార్డు చేయాలనగా లతా

# బాధపడిన ఆశా



సైనస్ ప్రాబ్లెమ్ వచ్చిపడింది. ఇక గత్యంతరం లేక మొదటిసారిగా నౌషాద్ ఆశాకు కబురంపించాడు. 'ఏక్ బాత్ కహూ మేరే పియా', 'రాధా కే ప్యారే కృష్ణా కన్హాయీ' రెండుపాటలు పాడింది.

ఇది జరిగిన చాలా సంవత్సరాలకు, అంటే 1981లో 'ఉన్‌కీ ఆవాజ్ మే సే ఆజ్ తక్ బాజారూపన్ నహీ గయా' అని అనడం, తర్వాత 'అబ్బే, అది కాదు నా ఉద్దేశం' అనడం జరిగాయి.

ఒకపక్క పెద్దక్కగారు ఫ్యామిలీ కోసం త్యాగమూర్తి ఇమేజితో వెలుగొందుతూంటే ఇటు ఆశా ఇంట్లోనుంచి పారిపోవడం,ఆ తరువాత ఓపినయ్యర్‌తో సన్నిహితంగా మెలగడం, ఆ పైన వివాహితుడైన ఆర్.డి.బర్మన్‌ను పెళ్లాడడం - వంటి చర్యల ద్వారా సానుభూతి పోగొట్టుకుంది. కానీ ఆమె అక్కగారి కంటె ఎక్కువకాలం ఫీల్డులో నిలబడుతూ పాప్‌గాయనిగా కూడా ఇంకా డిమాండ్‌లో ఉందంటే దానికి కారణం, ఆమె చేసే కఠోర పరిశ్రమ.

దానికి చిన్న ఉదాహరణ - ఇంగ్లండులోని ఛానెల్ 4 వారు ఆమెను ఇంగ్లీషులో ఇంటర్వ్యూ చేస్తానన్నప్పుడు ఆమె ఇరకాటంలో పడింది. ఆమెకు ఇంగ్లీషు భాషాపరిజ్ఞానం అంతంత మాత్రమే. అందువల్ల కొన్ని రోజులపాటు రోజూ తెల్లవారుఝామున 4 గంటలకు లేచి 'ఇంగ్లీషు స్వబోధిని' చదువుకునేది. ఇంటర్వ్యూలో తడబడకుండా మాట్లాడి ఆంగ్లేయులను కూడా మెప్పించింది. 1951-60 పీరియడ్‌ను గోల్డెన్ పీరియడ్ అనుకుంటే ఆ టైములో లతా కంటె ఆశా ఎక్కువ పాటలు పాడింది.

క్యాబరే పాటలకు గొంతు ఎరువివ్వడానికి లతా ఒప్పుకోదని, ఆశాకు మాత్రం అటువంటి అభ్యంతరాలు లేవనీ అందువల్లనే ఆశాపై అటువంటి ముద్ర పడిందని అంటారు. 'మేరానామ్ జోకర్' సినిమాలో పద్మినిపై చిత్రీకరించిన 'అంగ్ లగ్‌జా బాల్‌మా' అనే శైలేంద్రగీతం అశ్లీలంగా ఉందన్న కారణంగా లతా నిరాకరించగా ఆశా పాడింది. 'సంగమ్'లో 'మై క్యా కరూ రామ్ ముఝే బుడ్డా మిల్ గయా' పాట పాడడానికి లేని అభ్యంతరం ఈ పాట విషయంలో మాత్రం ఎందుకు వచ్చినట్టు? అంటే రాజ్‌కపూర్‌తో రాయల్టీ గొడవే నంటారు విజ్ఞులు. తర్వాతి కాలంలో 'ఇంతకామ్'లో 'కైసే రహూ చుప్ కీ మైనే పీ హీ క్యా హై' పాట పాడి లతా తను ఆశా టైపు పాటలు కూడా పాడడానికి వెనుకాడనని నిరూపించింది.

**- ఎమ్బీయస్ ప్రసాద్**



- ❖ హీరోయిన్లందరిలోనూ సైరాబానుకి తన వాయిస్ బాగా నప్పుతుందని లతా అభిప్రాయం.
- ❖ భారతరత్న పొందిన మహిళలలో లతా ఆయిదవవారు. తక్కినవారు ఇందిరాగాంధీ, మదర్ థెరిసా, అరుణా అసఫాలీ, ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి, భారతరత్న,
- ❖ దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు రెండూ పొందినవారు ఇద్దరే - సత్యజిత్ రాయ్, లతా
- ❖ లతా అసలు ఇంటిపేరు హార్డికర్. లతా అసలు పేరు హేమా. వాళ్ల నాన్నగారు ముద్దుగా 'హృదయ' అని పిలిచేవారు.
- ❖ ఆమె స్వస్థలమైన గోవాలో ఇప్పటిదాకా లతా ప్రదర్శన ఇవ్వలేదు.
- ❖ మళ్లీ జన్మంటూ ఉంటే భారతదేశంలోనూ, అందునా మహారాష్ట్రలోనే పుట్టాలని లతా కోరిక. కానీ స్త్రీగా మాత్రం కాదుట!
- ❖ మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఆమె పేర నెలకొల్పిన అవార్డును అందుకున్నవారిలో అనిల్ బిశ్వాస్, నౌషాద్ అలీ, కిశోర్ కుమార్, జయదేవ్, మన్నా దే, ఆశా భోంస్లే, ఖయ్యాం వంటి ప్రముఖులున్నారు.
- ❖ లతా విషాదగీతాలకు అభినయించాలంటే గ్లిసరిన్ అక్కరలేదని నర్గీస్ ఒకసారి ప్రకటించారు. ఆ పాట వింటేనే చాలు కన్నీళ్లు జాలువారుతాయట!
- ❖ బిమల్‌రాయ్ కోరిక మేరకు సలిల్‌చౌధురి లతాకోసం ఒక క్లిష్టమైన బెంగాలీ పాట కూర్చారు. పాడుతూ లతా స్వహతప్పడంతో అందరూ ఖంగారుపడ్డారు. 'పాటలో ఉన్న మహిమ అలాటిది. విని తట్టుకోలేకపోయాను' అన్నారు లతా తర్వాత.
- ❖ రాయల్ ఆల్బర్ట్ హాలులో ప్రదర్శన ఇచ్చిన మొదటి ఇండియన్ లతా (1974)!

**సేకరణ - గౌరవ్ కుమార్**

## ఓ.పి. నయ్యర్ లతాచే పాడించని కారణం ?

గతసంచికలో పై అంశంపై శ్రీ ఎమ్బీయస్ ప్రసాద్ రాస్తూ రాజుభరతన్‌ను 'కోట్' చేశారు. కానీ నయ్యర్ నాకు స్వయంగా చెప్పినది వేరుగా ఉంది. ఆ సందర్భం పూర్వాపరాలు చెప్పకపోతే విశ్వసనీయత కుదరదు కాబట్టి -

1976 నుండి కొన్నేళ్లు నేను గుజరాత్‌లోని జామ్‌నగర్‌లో సిండికేట్ బ్యాంకు ఉద్యోగిగా పనిచేసేవాడిని. అక్కడ పాలిట్యూన్ అనే ఒక సాంస్కృతిక సంస్థ ఆర్నెల్లకొకసారి హిందీ పాటల ఉత్సవాలు నిర్వహించేది. బొంబాయినుండి ప్రఖ్యాతులయిన హిందీ గీతకారులను, సంగీతకారులను రప్పించి వారి ఆధ్వర్యంలో లోకల్ కళాకారులచే హిందీపాటలు పాడించేవారు. ఆ గాయకులలో నేనూ ఒకడిని. ఆ విధంగా అనేకమంది మహానుభావుల వద్ద పాడే అవకాశం కలిగింది.

1977లో బొంబాయివెళ్లి సంగీతదర్శకులను ఆహ్వానించే టీములో నేనూ ఉన్నాను. ఆ సందర్భంలో ఓపి నయ్యర్‌గారింట్లో ఒకరోజు ఉండి ఆయనతో అనేక విషయాలు మాట్లాడే అవకాశం చిక్కింది. సహజంగానే లతా విషయం ఆయనను అడిగాను. దానికి ఆయన చెప్పినదిది -

"'ఆస్మాన్' చిత్రనిర్మాణం జరుగుతున్న రోజులవి. అనిల్ బిశ్వాస్ స్వరపరచిన నాలుగుపాటలు రికార్డింగుకూడా అయిపోయాయి. ఒకపాట ట్యూన్ విషయంలో నిర్మాతకీ, ఆయనకీ అభిప్రాయభేదం వచ్చింది. అసలే నిక్కచ్చి మనిషయిన అనిల్ బిశ్వాస్ 'నేను పనిచేయలేనని' తేల్చి చెప్పారు. నిర్మాత మర్నాడు నన్ను పిలిపించి మళ్లీ అన్ని పాటలూ ట్యూన్ చేసి రికార్డు చేయమన్నారు. అన్ని పాటలూ లతావే కావడంతో ఆవిడ కోసం కబురు పంపారు.

ఆవిడ వచ్చి విషయం తెలిసి అనిల్ చక్కని ట్యూన్స్ చేశారనీ, వాటిని మార్చి మళ్లీ వేరే సంగీతదర్శకుడితో చేయించాల్సిన అవసరం లేదని వాదించారు. నిర్మాత పట్టు విడవకపోవడంతో కోపం వచ్చిన లతా నా సంగీతపరిజ్ఞానాన్ని ప్రశ్నించి ఇకపై నయ్యర్‌కెప్పుడూ పాడనని అన్నారు. ఆవేశంతో అన్నమాట కదా మర్చిపోతారని అంతా అనుకున్నారు కానీ అటు లతా కానీ, ఇటు నేను కానీ ఆ విషయాన్ని ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్నాం. ఇద్దరమూ కలిసి పనిచేయలేదు. కానీ లతా పాటలంటే నా కిష్టం. ముఖ్యంగా బీస్ సాల్ బాద్ లోని 'కహీ దీప్ జలే కహీ దిల్', అనుపమా లోని 'కుఛ్ దిల్ నే కహా', షినాషినాకే బుబ్లాబూ లోని 'తుమ్ క్యా జానో' వంటి పాటలు నాకు నచ్చుతాయి. నా ట్యూన్‌లన్నా ఆవిడ కిష్టమేనంటారు."

- విష్ణుభొట్ల ఉదయభాస్కర్

---

చిత్రానికై లతకి తమ్ముడు 'హృదయనాథ్' ఎసిస్టెంట్‌గా పనిచేసి సంగీత సంయోజనంలో సహకరించారు. ఆయన కంపోజ్ చేసిన బిట్లు విని "కాలానికి అనుగుణంగా నువ్వు నీ స్టయిలు మార్చుకుంటే మంచిది." అని లత సలహా యిచ్చారు. కానీ హృదయనాథ్ ఎప్పుడూ తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకునేందుకు ప్రయత్నించేవారే కాని ఇతరుల కోసం దాన్ని మార్చేసుకోగలిగే తత్త్వం వున్న వారు కారు. "నేనేది సృజించినా మనసారా, ఆత్మార్థంగా ఆలోచించి మరీ కంపోజ్ చేస్తాను. అది మార్చడం నా తరం కాదు" అని నిష్కర్షగా చెప్పేసేవారు.

ఇలాటి విషయాలలో అక్కాతమ్ముళ్లది ఇద్దరిదీ వారి తండ్రి గారిలాగానే ఒకే నిర్ణయం! ఒకే మాట! వాళ్ళనమ్మకాలు వాళ్లవే! వాటిని నిర్మొగమాటంగా అనుసరించడమే వారి కలవాటు. కనుకనే లత తమ్ముణ్ణి ఏమీ అనలేదు.

డ్రెస్సు విషయంలో కూడా హృదయనాథ్‌ది అంతా భారతీయ పద్ధతే. పాశ్చాత్య పద్ధతి ఆయనకి అంతగా నచ్చదు. సంగీతంలో కూడా భారతీయతకే అధిక ప్రాధాన్యం. ఒక ఫైవ్‌స్టార్ హోటల్‌లో 'సూట్ ధరిస్తే కాని లోపలికి ఎవర్నీ వెళ్లనీయలేము' అని ఆయన్ని అడ్డగించారు. డ్రెస్సు మార్చడానికి ఆయనా సమ్మతించలేదు. కొన్నాళ్ళ పిమ్మట ఆ హోటల్ వాళ్ళే తమ సిద్ధాంతాన్ని మార్చుకోవలసి వచ్చింది.

హృదయ్‌నాథ్ లాగే లతా కూడా భారతీయ వస్త్రాలే ధరించేందుకు ఇష్టపడతారు. ఆడంబరపు దుస్తులామెకి నచ్చవు. తను సంగీతం సమకూర్చిన చిత్రాలు చాలా బాగా విజయవంతమైనా, తరువాత ఎక్కువగా ఆమె సంగీత దర్శకత్వం నిర్వహించలేదు - కారణం, నేపథ్య గానంపైననే తన ధ్యానం సదా కేంద్రీకరించడం! ఆమె కీనాటికీ మనసులో ఒక విధమైన అసంతృప్తి. తన తండ్రి ఆశయాదేశా లనుసారంగా, శాస్త్రీయ సంగీతంలో ఇత్యోధిక శ్రద్ధ వహించి, కృషి చేసి, శాస్త్రీయ సంగీత కార్యక్రమాలు జరిపి నూతన చరిత్ర సృష్టించలేకపోవడమే ఆ స్వల్పమైన అతృప్తికి కారణం. అంతే తప్ప, అసలు లత సాధించినన్ని విజయాలూ, సాగించిన సాధనలూ అనితరసాధ్యాలు. చిత్రనేపథ్యగాన ప్రకరణంలో ఆమెది సర్వదా



సమున్నత మహోజ్జ్వల స్థానం. ఆమెది ధన్యమాన్య, అసమాన్య జీవితం. ఆమె ప్రతిభా పాటవాల పరిమాణం అసీమితం.

**(ఇంకా వుంది)**

### లతాకు నచ్చేవి

**సాహిత్యం** - చెకోవ్, టాల్‌స్టాయ్, ఖలీల్ జిబ్రాన్

**క్లాసికల్ సింగర్స్**

- ఉస్తాద్ బడేగులాం అలీ ఖాన్, ఉస్తాద్ అమీర్ ఖాన్

**ప్లేబ్యాక్ సింగర్స్** - కె.ఎల్.సైగల్, నూర్జహాన్

**దర్శకనిర్మాతలు** - గురుదత్, బిమల్‌రాయ్, సత్యజిత్ రాయ్

**సినిమాలు**

- లైమ్ లైట్, గాన్ విత్ ద విండ్, టైటానిక్, పడోసన్

సంగీతదర్శకులు - మదన్ మోహన్, సలిల్ చౌధురి, జయదేవ్

**గీతకారులు**

- శైలేంద్ర, సాహిర్ లుధియాన్వీ, మజ్రూ, నీరజ్, నక్షలాల్‌పురీ

**ఆటలు** - క్రికెట్, ఫుట్‌బాల్, టెన్నిస్

**హాబీలు** - ఫోటోగ్రఫీ, వంట

**పండగ** - దీపావళి

**వంటకాలు** - కొల్హాపురీ మటన్, ఫ్రైడ్ ఫిష్

**అలంకారం** - బంగారు గజ్జెలు

**సిటీలు** - ముంబయ్, న్యూయార్క్,

**కలర్** -తెలుపు

**జ్యూయలరీ** - డైమండ్స్,

సేకరణ - గౌరవ్ కుమార్

## 1960

# హిందీ సినీ సంగీతంలో మైలురాళ్లు-మజిలీలు

గుల్జార్ దినావిపేరుతో గీత రచయిత గుల్జార్ 'శ్రీమాన్ సత్యవాది' చిత్రం ద్వారా పరిచయం. రాజ్ కపూర్ హీరోగా నటించిన ఈ చిత్రానికి దత్తారాం సంగీత దర్శకుడు. ఈ చిత్రంలో నాలుగు పాటలు రాసినప్పటికీ 'రుత్ అల్‌బేలీ మస్త్ సమా' పాట మాత్రం బాగా పాపులర్ అయింది.



గుల్జార్

ముస్లిం సోషల్స్‌కీ, హిస్టారికల్స్‌కీ ఈ ఏడాది ప్రాచుర్యం పొందింది. బాబర్, ముగల్-ఎ-అజమ్, బర్సాత్ కి రాత్, చౌదవీఁ కా చాంద్ వంటి అద్భుతమైన చిత్రాలు ఈ సంవత్సరంలోనే తయారయ్యాయి.



ముగల్-ఎ-అజమ్ లో ఓ సన్నివేశం

అద్భుతమైన చిత్రాలు ఈ సంవత్సరంలోనే తయారయ్యాయి.

ముగల్-ఎ-అజమ్ చిత్రం నౌషాద్, షకీల్ కాంబినేషన్‌కు చక్కటి గుర్తింపు తీసుకువచ్చింది. 'మొహబ్బత్ కి ఝూఠీ కహనీ పే రోయే', లతా-షంషాద్ బేగం గానం చేసిన 'తేరీ మెహఫిల్ మేఁ కిస్మత్ ఆజ్మా కర్ హమ్ భీ దేఖేంగే' పాటలతో పాటు లతా గానం చేసిన 'ప్యార్ కియా తో డర్నా క్యా' పాటను ఎవరు మరచి పోగలరు? ఏకధాటిగా 15 గంటలపాటు గీత రచయిత, సంగీతరచయిత శ్రమించగా తయారయిందా పాట!

దర్శక నిర్మాత కె.అసిఫ్, సంగీతదర్శకుడు నౌషాద్‌లు వెళ్లి బడే గులాం అలీఖాన్ ను ఈ సినిమాకై పాటలు పాడమని అడిగారు. సినిమాలకు పాడటం ఇష్టం లేని ఖాన్ సాహెబ్ చాలా పెద్ద మొత్తాన్ని డిమాండ్ చేసి వారిని నిరుత్సాహ పరచాలని చూశారు. అయినప్పటికీ ఆ మొత్తానికి అసిఫ్ అంగీకరించటంతో 'ప్రేమ్ జోగన్ బన్కే సుందరీ', 'సుభ్ దిన్ ఆయో' అనే పాటలు పాడారు. రెండూ హిట్లే!



బడే గులాం అలీఖాన్

కాస్ట్యూమ్ డ్రామా 'కోహినూర్' చిత్రం కోసం నౌషాద్ 'దో సితారోఁ కా జమీ పర్', 'మధుబన్ మేఁ రాధికా' పాటలు స్వర పరచి శ్రోతల మనసులను కొల్లగొట్టారు.



నౌషాద్



చౌదవీఁ కా చాంద్ లో ఓ సన్నివేశం

రఫీ ఎవర్‌గ్రీన్ సాంగ్ 'చౌదవీఁ కా చాంద్' పాటను రవి స్వరపరిచారు. అదే చిత్రంలోని 'దిల్ కి కహనీ రంగ్ లాయీ హై', 'మిలీ ఖాక్ మేఁ మొహబ్బత్', 'బదలే బదలే మేరే సర్కార్ నజర్ ఆతే హై' పాటలు సూపర్ హిట్స్.

ఈ సంవత్సరమే రవి అందించిన మరో మ్యూజికల్ 'ఘూంఘట్'. 'లాగే న మోరా జీయా', 'మోరీ ఛమ్ ఛమ్' పాటలు ఈ చిత్రంలోనివే.

'బాబర్' చిత్రానికి సాధారణమైన సంగీతాన్నే ఇచ్చినప్పటికీ రోషన్ 'బర్సాత్ కి రాత్' చిత్రంలో పాటలు అదరగొట్టాడు. ముఖ్యంగా ఆ చిత్రంలోని ఖవ్వాలిలు ట్రెండ్ సెట్టర్ అయిపోయాయి. రోషన్ కెరియర్‌లో



బర్సాత్ కి రాత్ లో ఓ సన్నివేశం

చక్కటి మ్యూజికల్ హిట్స్‌లో ఒకటిగా ఈ చిత్రం శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకుంది. 'మైనే షాయద్ తుమ్హే పహలే', 'ముఝే మిల్ గయా బహానా తేరీ దీద్ కా', 'గర్‌జత్ బర్‌సాత్ సావన్ ఆయో', తో పాటు ఖవ్వాలి హిట్స్ 'జీ చాహతా హై చూమ్‌లూ', 'యే ఇష్క్ ఇష్క్ హై', 'న తో కారవా కీ తలాశ్ హై ' చక్కటి గుర్తింపు తెచ్చుకున్నాయి.ఈ సినిమాలో సాహిర్ రాసిన 'జిందగీ భర్ నహీఁ భూలేంగీ..' ను ఇన్స్పిరేషన్‌గా తీసుకొని తను 'అబ్ క్యా మిసాల్ దూ....'(ఆరతి - రఫీ - రోషన్) రాయడం జరిగిందని మజ్రూహ్ సుల్తాన్‌పురి చెప్పుకున్నారు.

-(వచ్చే సంచికలో మరికొంత)

# డబుల్ షాక్

- గొడవర్తి జానకీశ్యామసుందర్



"చిట్టిబాబుకి పెళ్ళి కుదిరింది తెలుసా!"

"అబ్బ ఎంత మంచి వార్త చెప్పావ్!!"

"అమ్మయ్య చిట్టిబాబుకి పెళ్ళి కుదిరిందా? ఇన్నాళ్ళకు మన ప్రార్థనలు ఆలకించాడు ఆ దేవుడు"

చిట్టిబాబు పెళ్ళి గురించి ఆందోళన చెందుతున్న బంధువర్గం అంతా ఇలా అనుకొని సంతోషించడంలో ఓ విశేషం ఉంది. ఓ ప్రహసనంలాగా సాగిన పెళ్ళికుమార్తె వేట చూసేవాళ్ళకి వినేవాళ్ళకి హైదరాబాద్ నగరంలో వేసవికాలపు ఎద్దడంత ఆందోళన కలిగించింది. తొలకరి జల్లులాంటి ఈ వార్త వాళ్ళ మనస్సులను సేదదీర్చడంలో ఆశ్చర్యమేమీ లేదు. ఎందుకంటే పొరబాటున "ఎలాంటి పిల్ల భార్యగా కావాలనుకుంటున్నావ్‌రా!" అని అడిగితే చిట్టిబాబు చెప్పే కోర్కెల లిస్టు విన్నవాళ్ళు "అబ్బే వీడికిప్పట్లో పెళ్ళి కుదిరేటట్లు లేదని బాధపడేవాళ్ళు" అదీ విషయం.

"ఆనందరావు, వెంకటలక్ష్మిల మూడో సంతానం ఈ చిట్టిబాబనే శాస్త్రి. చదవటానికి ఎమ్‌బియే చదివినా మానవసంబంధాలన్నీ డబ్బుతో ముడిపడే వుంటాయని గాఢంగా నమ్మే వ్యక్తి. మొదటి, రెండో సంతానమైన ఆడపిల్లల పెళ్ళిళ్ళు గవర్నమెంటు సర్వీసులో వుండగానే చేసి నిశ్చింతగా కాలుమీద కాలేసుకొని హాయిగా




కాలం వెళ్ళబుచ్చుతున్నాడు. అల్లుళ్ళిద్దరూ బుద్ధిమంతులు. ఎక్కువ కట్నం ఖర్చులేకుండానే పెళ్ళిళ్ళు చేసినందుకు ఆ రోజుల్లో ఆనందరావుని అందరూ అభినందించారు.

ఆడపిల్లల తరువాత కొంచెం ఎడంగా పుట్టిన మన హీరో చదువయ్యే టైమ్‌కి పదవీ విరమణ చేసిన ఆనందరావు, కొడుకుని పెళ్ళికొడుకుల మార్కెట్లో నెలబెట్టగానే పదవిలో వున్న రాజకీయ నాయకుడి హోదా వెలగబెట్టసాగాడు.

ఆనందరావు భార్య వెంకటలక్ష్మి సాదాసీదా మధ్యతరగతి హోదానుంచి అత్తగారి హోదాలోకెప్పుడు అడుగు పెడదామా అని ఎదురు చూస్తోంది. తమ వియ్యపురాళ్ళ మంచితనంతో తామెంత లబ్ధిపొందిందీ, కూతుళ్ళు ఎంత సుఖంగా వుందీ మర్చిపోయింది. కోడలు పిల్ల రాక్కై ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తోంది.

ఆనందరావు వెంకటలక్ష్మిల తల్లిదండ్రులిరువైపు బహు సంతాన వంతులవడంతో బంధువర్గమంతా ఆవూళ్ళోనే స్థిరపడటంతో మొత్తం మీద ఓ పాతికమంది కుటుంబాలు తలా ఓ మూలా ఉన్నారు. శుభకార్యాలకు హాజరు అయినప్పుడు వారిమాటల్లో తప్పనిసరిగా చిట్టిబాబు పెళ్ళి ప్రస్తావన వచ్చేది. ఈడూ జోడూ అయిన ఆడపిల్లల తల్లిదండ్రులు కూడా అతని కోర్కెల లిస్ట్ విని, ముందుకు మాట్లాడే సాహసం చేసేవారు కాదు.

సమాజంలో కొంతమంది అనామకులుగా వుంటారు. ప్రపంచంలోకి వచ్చాము గాబట్టి ఏదోలా జీవితమనే బండిని లాగుతుంటారు. కొద్దిమంది మాత్రం మంచి పనులు చేసి నలుగురి చేతా "శభాష్" అనిపించుకుంటూ తల్లో నాలుకలాగ వుంటారు. ఇంకోరకం వాళ్ళు గూడా అందరి నోళ్ళల్లో నానుతుంటారు. కాని ఎదుటి వాళ్ళకి మంచి చేసి గాదు. వీలైనంతగా విసిగించి, అవతలి వాళ్ళ మనశ్శాంతి పోగొడుతుంటారు.

ఇలాంటి ఎగ్రస్ట్రా క్వాలిఫికేషన్స్ ఎవరికో అనుకొంటే పొరబాటే. చిట్టిబాబు అక్షరాలా అచ్చుగుద్దినట్లుగా సరిపోతాడు ఈ రకమైన మనషులకి ప్రతీకగా.

కాలేజి చదువు ముగించుకొని ఉద్యోగాల వేటలో సిటీలో అడుగుబెట్టిన చిట్టిబాబు రూమ్‌లో బ్యాగ్‌పడేసి వూళ్ళో వున్న బంధువుల్ని పలకరించే నెపంతో వాళ్ళ ఇళ్ళమీద దాదాపు దాడిచేసినట్లుగా ప్రవర్తించాడు. మొదట్లో చుట్టపుచూపుగా వచ్చినతన్ని చాలా ఆదరంగా చూశారు. కాలక్రమాన వాళ్ళలో మార్పొంచింది. మూల కారణం చిట్టిబాబు ప్రవర్తనే. ఒక్కో బంధువింట్లో ఒక్కోవారం గడపటంతో నెల యిట్టే నిండేది.

అటు రూమ్ రెంటూ ఇటు మెస్ బిల్లు ఖర్చు రెండూ ఆదా అయ్యేవి. ఈ గడ్డు రోజుల్లో ఒక ఎక్స్‌ట్రా మనిషంటే ఎంత ఖర్చో అతనెప్పుడూ ఆలోచించేవాడు గాదు. తనకు వాళ్ళు చెయ్యటం హక్కుగా భావించేవాడు.

"ఏం వదినా! చిట్టిబాబు మీ ఇంట్లోనే వుంటున్నాడట గదా! పోన్లే కాస్త చేదోడు వాదోడుగా వుంటాడు" అన్నదొక దూరపు బంధువు.

"ఆ మా ఇంట్లోనే వుంటున్నాడు. ఏదో చిన్నవాడు మనవాడు అనుకొని సంతోషిద్దామంటే, ఏకు మేకై కూర్చొన్నాడు. మా అన్నయ్యకి ఒంట్లో నలతగా వుందని మేము బాధపడుతుంటే తనకు రాచమర్యాదలు చేయలేదని సణుగుతుంటాడు. మా ఆడబిడ్డకి దగ్గిర బంధువని వూరుకోటం తప్పితే ఇంకేమీ కాదు" వివరించింది రెండో ఆవిడ.

"నిజమే! ఆ భాగోతం మా ఇంట్లోనూ అయ్యింది. వస్తాడో రాడో తెలియదు. వేళ కాని వేళ వచ్చి కూచొంటాడు. వండిన దాంతో సర్దుకోడు. యధావిధిగా అన్నీ మొదలెట్టుకోవాల్సిందే. అల్లుడి మర్యాదలనుకో" విసుగ్గా అన్నది ఆవిడ.

"నిజమే వదినా! ఈ కరువు రోజుల్లో ఎవరి సంసారాలు వారికే భారంగా వున్నాయి. ఐదు వేళ్ళూ రెండు పూటలా నోట్లోకి వెళ్ళటం కష్టంగా వుంది. వాడికి తొందరగా ఉద్యోగమొస్తే బాగుండు మన జోలికి రాకుండా వుంటాడు" ఆవేదనగా అంది ఆ మరదలు.

"తండ్రి పంపించే డబ్బు దాచుకొని ఇలా చుట్టాలిళ్ళమీద పడి కాలక్షేపం చేస్తున్నాడు. ఎవరేమనకొంటే వాడికేమి? వాడి పనులు నాగాలేకుండా జరుగుతున్నాయి కదా! అంతే కాదు వస్తూనే ఫోన్ అందుకొని ఎడతెరిపి లేకుండా మాట్లాడుతుంటాడు. బిల్లులు ఆకాశంలో కెగురుతున్నాయి" అని ఇంకొకరు. ఇలా బంధువర్గంలో వారెవరైనా ఎక్కడ కలిసినా చిట్టిబాబు గురించే అనుకోవడం లేదా ఫోన్లలో



కూడా చర్చించుకోవడం మమూలుగా అయ్యింది.

అందరి ఆశలు ఫలించి, చిట్టిబాబుకి ఓ మోస్తరు మంచి ఉద్యోగమే వచ్చింది. తల్లిదండ్రులు కూడా రావటంతో ఓ ఇల్లు అద్దెకి తీసుకొని కాపురం పెట్టడం చకచకా జరిగిపోయాయి. ఈ విషయం తెలిసిన బాధిత బంధువర్గం హాయిగా సెలబ్రేట్ చేసుకొన్నారు.

నిరుద్యోగపర్వంలోంచి ఉద్యోగ పర్వంలో అడుగుపెట్టడానికి రెండేళ్ళు తీస్కొన్న చిట్టిబాబు, జీవిత భాగస్వామి ఎంపిక విషయంలో అంత తేలిగ్గా నిర్ణయం తీస్కొంటాడా!




పెళ్ళిచూపుల పర్వం మొదలైంది. మ్యారేజ్ బ్యూరోల్లో రెండు మూడు చోట్ల బయేడేటా యిచ్చి రావటంతో తంతుమొదలైంది. అప్పటికీ పాపం చిట్టిబాబు రిక్వైర్‌మెంట్స్ ఎక్కువగా పెట్టలేదు. కాస్త ఎర్రగా బుర్రగా వుండి బాపు బొమ్మలా వుంటే చాలన్నాడు. తల్లికి పనుల్లో చేదోడు వాదోడుగా ఉంటే చాలను కొన్నాడు. జీతం రాళ్ళు తెచ్చి తన చేతిలో పెడితే చాలన్నాడు. అంత ఫ్యాషన్‌గా కాని అంత పల్లెటూరి పిల్లగా కాని వుండకూడదని కొన్నాడు. అణకువ నిదానం ఓర్పు మెండుగా వుండాలని మాత్రం అనుకొన్నాడు. వాళ్ళ నాన్నకి మాత్రం కాబోయే వియ్యంకుడికి సమాజంలో తగినంత హోదా ఆస్థి ఉంటే చాలు అనే చిన్న కోర్కె మాత్రం ఉండేది. ఎంత అల్పమైన కోరికలో గదా!

బ్యూరోలో వివరాలిచ్చినప్పటినుండి, ఆడపిల్లల ఫోటోలున్న కవర్లు వాటిలో తదితర వివరాలు వచ్చిపడటంతో ఆనందరావు వెంకటలక్ష్మి ఫుల్ బిజీ అయిపోయారు. ఫోటోలు వివరాలు పరిశీలించి. ఫస్ట్, సెకండ్ లిస్ట్ తయారు చేశారు. వాటి ప్రకారం పెళ్ళి చూపులకెళ్ళాలని నిర్ణయించారు అదీ లాంఛనంగా పిల్లతరపు వారు వచ్చి తీసుకెళ్ళగలిగితేనే వెళ్ళాలని నిర్ణయించారు. రానూ పోనూ వాహన యోగం కల్పించిన వారింటికే మొదట వెళ్ళేదని తేల్చిచెప్పారు. అలా వెళ్ళి చూపులైన తరువాత ఇంటికొచ్చి "అమ్మాయి మరీ పొట్టి" అనో "పిల్ల తండ్రి మర్యాదలంతంత మాత్రమే" అనో "ఆటో ఛార్జీలు మన చేత ఇప్పించారు. మరీ అంత కాపీనం మనుషులేమిటో" "పెళ్ళి చూపులు ఇంత నాసిరకంగా ఏర్పాటు చేశారు. పెళ్ళెంత తూతూ మంత్రంగా జేస్తారో", 'ఆ మరీ నాసిరకం ఉద్యోగం, పై సంపాదనకేమీ ఆస్కారం లేదు" అని ఇలా చిట్టిబాబు వాడి తల్లిదండ్రులు తర్జనభర్జనలు పడి చాలా సంబంధాలు వదిలేశారు. రాను రాను సంఖ్య కూడా క్షీణించింది.




ఇలా పెళ్ళిళ్ళ మార్కెట్టులో చిట్టిబాబు నిల్చొని రెండున్నరేళ్ళు దాటింది. అతని తరువాత మార్కెట్టులోకి వచ్చిన వాళ్ళు తమకు నచ్చిన వారిని చకచకా ఎంచుకొని పెళ్ళిచేసుకొని సంసారాలు చేసుకొంటున్నారు.

"మన చిట్టికి ఒక్క సంబంధమూ కుదరటం లేదేంటండీ!'' అన్నది వెంకటలక్ష్మి ఒకరోజు ప్రొద్దున్న కాఫీల వద్ద భర్తతో.

"మన వాడికేం మగ మహారాజు. అలా తొందరపడతావేం. ఆడ పిల్లల తండ్రులు క్యూలు కట్టి మరీ వస్తారు చూస్తుండు" అన్నాడు ఆనందరావు.

"అవునే అమ్మా చూశావుగా మ్యారేజ్ బ్యూరోలో బయేడేటా యివ్వగానే ఎలా వచ్చి పడ్డాయో చూడు ఫోటోలు. మనం ఊ అనాలే కాని, ఎగిరి గంతేసి కాళ్ళు కడగటానికొస్తారు" అన్నాడు చిట్టిబాబు కాలర్ సవరించుకొంటూ.

అమెరికానుంచొచ్చిన కవర్ కొంచెం ఆశ్చర్యపడుతూ ఓపెన్ చేశాడు ఆనందరావు. తాను అమెరికాలో పెద్ద ఉద్యోగంలో వున్నానని పెళ్ళికెదిగిన చెల్లెలు ఇండియాలో వుందని ఇష్టమైతే పెళ్ళిచూపులు ఏర్పాటు చేస్తామని బయేడేటా పంపుతూ వచ్చిన ఉత్తరం చదివి తబ్బిబ్బయ్యారు ఆనందరావు దంపతులు. ఈ సంఘటన జరిగిన కొద్దిరోజులకే పంకజాన్ని చూసిరావడం జరిగింది. పెళ్ళి చూపులకే వాళ్ళు చేసిన మర్యాదలు చూసి వీళ్ళు ఉక్కిరి బిక్కిరయ్యారు. ఆ హోదా ఆర్భాటం చూస్తే కళ్ళు తిరిగినంత పనయ్యింది.

"లక్ష్మీదేవి పంకజం రూపంలో మనింటికి వస్తున్నట్లుంది" అన్నది వెంకటలక్ష్మి పొంగిపోతూ.

"నిజమే ఒక్కతే ఆడపిల్ల, పెద్ద ఇల్లూ వాకిలీ, తండ్రి రిటైర్డ్ బ్యాంక్ ఆఫీసర్. అన్న విదేశాల్లో స్థిరపడ్డాడు. ఇక్కడిదంతా అమ్మాయికే సంబరపడ్డాడు ఆనందరావు.

"చేసుకొంటే ఇలాంటి బంగారు పిచ్చుకనే చేసుకోవాలి. అంతేగాని నా ఫ్రెండ్ ప్రకాష్‌ని చూడు అయిదుగురు ఆడపిల్లల్లో ఆఖరి పిల్లను చేసుకొన్నాడు ఏరికోరి. ఇంక అచ్చట్లు ముచ్చట్లు తీర్చగలిగే తీరికా తామతూ ఎక్కడివి ఆ తల్లి తండ్రికి. ఇలా ఒక్కతే పిల్లయితే అల్లుడ్ని నెత్తిన పెట్టుకొంటారు. ఊళ్ళోనే కాబట్టి చీటికి మాటికి

వెళ్ళి నాలుగురోజులుండి రావచ్చును." అన్నాడు చిట్టిబాబు ఆశగా.

"నిజమేరా చిట్టీ! తొందరలో ముహూర్తం పెట్టించమని పెళ్ళి చాలా గ్రాండ్‌గా చెయ్యాలని, మనకివ్వాల్సిన లాంచనాలన్నీ ఓ లిస్ట్ రాసిద్దాం" అన్నది వెంకటలక్ష్మి ఉత్సాహంగా.

"అది సరే కట్నం ప్రసక్తి మనమూ తీసుకురాలేదు. వాళ్ళూ అనలేదు ఏం చేద్దాం" అన్నాడు ఆనందరావు కొడుకుతో.

"పిల్ల అన్నయ్య ఫారిన్‌లో సెటిలయ్యాడన్నారుగా. ఇంక ఇక్కడ ఉన్నదంతా పంకజానికి కాక ఇంకెవరికొస్తుంది. కట్నం అడిగామంటే మరీ లేకివాళ్ళనుకొంటారేమో. అంతా మనకే వస్తున్నప్పుడు ఇంక వేరే కట్నం ఏం అడుగుతాం" అన్నాడు చిట్టిబాబు తన ఆలోచనలు బయటపెడుతూ.

చిట్టిబాబు పెళ్ళి అట్టహాసంగా జరిగింది. బంధువర్గమంతా తరలి వచ్చి తలో గిఫ్ట్ పాకెట్ ఇచ్చారు. ముసి ముసి నవ్వుల్తో అవన్నీ అందుకొన్నాడు చిట్టిబాబు వాళ్ళందరినీ పంకజానికి పరిచయం చేస్తూ. పెళ్ళి ఖర్చంతా ఆడపెళ్ళివారిదే అవటంతో, వేరే టీ పార్టీ అనకుండా రిసెప్షన్ గూడా అక్కడే ఏర్పాటు చేశాడు చిట్టిబాబు.

అప్పగింతలు కూడా యధావిధిగా పూర్తయినాయి. మగపెళ్ళివారు తిరుగు ప్రయాణపు సన్నాహంలో ఉన్నారు.

పంకజం తండ్రీ విశ్వనాథంగారు చిట్టిబాబు చేతులు పట్టుకొని "బాబూ మా బాధ్యత నెరవేరింది. నెమ్మదస్తుడు, మంచివాడు, ఏ దురలవాట్లు లేని నీలాంటి ఉత్తముడు భర్తగా లభించటం మా పంకజం చేసుకొన్న అదృష్టం. ఏ లోకాన వున్నాడో మా అన్నయ్య ఆత్మ ఎంతో సంతోషిస్తుంది." అన్న మాటలకి ఆనందరావు, చిట్టిబాబు ఉలిక్కిపడ్డారు. ముందుగా తేరుకొన్న ఆనందరావు "ఏమిటి బావగారూ! మీరు అంటున్నదేమిటి" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును బావగారు. పంకజం మా పెద్దన్నయ్య ఆఖరి కూతురు. పై నలుగురికీ పెళ్ళిళ్ళు చేసి ఆర్థికంగా చితికిపోయిన మా అన్నయ్య అనారోగ్యంతో తీసుకొని తీసుకొని పోతూ పోతూ పంకజం పెళ్ళి బాధ్యత మా చేతిలో పెట్టాడు. మాకూ ఆడపిల్లలు లేకపోవటంతో కన్యాదానం చేద్దామని నిర్ణయించుకొన్నాము. మీ అందరి మంచి తనంతో మా కోర్కె బాధ్యత తీరాయి. ఇంక తొందరలోనే ఇక్కడి మా ఆస్థులన్నీ అమ్మేసి మా అబ్బాయి దగ్గరకు అమెరికా వెళ్ళిపోదామనుకొంటున్నాము. పంకజాన్ని మీరు చక్కగా చూస్తారన్న నమ్మకం కుదిరింది" అన్నాడు ఆయన నిశ్చింతంగా.

చిట్టిబాబుతో పాటు తల్లిదండ్రి గూడ నిర్ఘాంతపోయి ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసుకొన్నారు. ఈ పరిస్థితి అంతా అమోమయంగా వుంది. తాము వూహించింది ఒకటి జరిగింది మరొకటి. ఒక్కతే ఆడపిల్ల బోలెడంత ఆస్థితో వస్తుందనుకొంటే వ్యవహారమంతా రివర్స్ అవటంతో ఆ షాక్‌లోనే ఇంటికి చేరుకొన్నారు. ఎంతో సేపటికి కాని తేరుకోలేకపోయారు.

మర్నాడు ప్రొద్దున్న పెళ్ళికొచ్చిన ప్రెజంటేషన్స్, గిఫ్ట్స్ కవర్స్ ముందేసుకొని ఒక్కొక్కటే తెరుస్తున్నాడు చిట్టిబాబు.

"ఫిబ్రవరి ఫోన్ బిల్లు రూ.500/-"

"మార్చి నెల మెస్ బిల్లు రూ. 1000/-"

"క్రిందటేడాది లాండ్రి + కరెంటు బిల్లు రూ.600/-"

ఇలా ఒక్కోకవర్లో ఒక్కో స్లిప్ మీద పొందికైక అక్షరాలతో "చిట్టిబాబు - పంకజాలకి వివాహ శుభాకాంక్షలతో" అని వ్రాసి ఉన్నాయి.

పంకజం వాళ్ళిచ్చిన షాక్ నుంచి అప్పుడప్పుడే తేరుకొంటున్న చిట్టిబాబు బంధువిలిచ్చిన ఈ షాక్‌లో మాడిపోయిన బల్బులా ఖిన్నుడయ్యాడు. పాపం చిట్టిబాబు.

■

## రాజా ఆడియో రివ్యూ

(36వ పేజీ తరువాయి)

వాటి వరుసక్రమాన్ని - యస్.రాజేశ్వరరావు వంటి మహానుభావుడు సైతం అనుసరించారని ఈ సమీక్షకుని వ్యక్తిగతాభిప్రాయం. అలాగే 'పప్పా కెహతేహై' చిత్రం కోసం రాజేష్ రోషన్ స్వరపరచిన 'ఘర్‌సే నికల్‌తేహి - కుఛ్ దూర్ చల్‌తేహి - రస్‌తేమెహై ఉస్‌కాఘర్' అనే పాటొకటి వుంది. ఈ రెండు పాటలూ యమన్ రాగంపై ఆధారపడినవే. ఆ రెండు పాటలలోని 'జీవస్వరాలు' ఈ 'లాలీ లాలి' పాటలో తొంగి చూశాయి.

మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడు జరిగే సృజనాత్మకావిష్కరణలోని జీవకణాలలో ప్రాణశక్తి సంపూర్ణంగా వుంటుంది. ఆ ప్రాణశక్తిని సంగీతానికి అన్వయించుకుంటే జీవస్వరాలవుతాయి. సంగీత దర్శకుడిగా పట్నాయక్ నుండి ఇంత మంచి ట్యూన్ రావటానికి కారణం మానసిక ప్రశాంతతేనని... ఇదే తాదాత్మ్యతను ప్రతిసారి ఆవహింప చేసుకోగల సామర్థ్యాన్ని అతను నిరంతర నిర్మల సాధన ద్వారా సాధించగలిస్తే నాలుగు కాలాల పాటు నలుగురూ మంచిగా చెప్పుకోగల వరసలను అందించగలడని ఈ సమీక్షకుని అభిప్రాయం. ఉషకు కూడా అంతే... వయో పరిమితి రీత్యా, అనుభవాల పరిపక్వత రీత్యా తను పాడిన ఈ పాటలోని గొప్పతనం ఆమెకు వర్తమానంలో కన్నా భవిష్యత్తులోనే ఎక్కువ అర్థమయ్యే అవకాశం వుంది. ఈ పాటకు రచన పెద్దాడమూర్తి.

ఈ క్యాసెట్‌కి బీసైడున గల మూడు పాటలలో 'చేయరండి స్వామిసేవ సత్యనిష్టతో' అనే పాట వినడానికి హాయిగా వుంది. చైతన్యప్రసాద్ రాసిన ఈ పాటను శ్రీరాంకౌశిక్‌గా పేరు మార్చుకున్న రామాచారి పాడేడు. చైతన్యప్రసాద్ రాయగా రవివర్మ బృందం పాడిన 'శరణం శరణం అయ్యప్పా' అనే అయ్యప్ప కథ పాట, పెద్దాడమూర్తి రాయగా శ్రీరాంకౌశిక్ పాడిన 'అళుదాలో స్నానం చేద్దామా' అనే శబరి యాత్ర పాట - భక్తజన సముదాయంలో మాత్రమే రాణించేవి. ఈ రెండిటిలోనూ సినీగంధం అంతర్లీనంగా ఎంతోకొంత గుబాళిస్తూనే ఉంది.

ఈ రెండు క్యాసెట్లలోనూ... పాడిన కొంతమందిలో ఉచ్చారణ దోషాలు లేకపోలేదు. అవి వారు తెలిసి చేసినవి కావని... వారి పరిమితులు అంతవరకేనని... (ప్రీవియస్ కేస్ హిస్టరీ లాగ) గతంలో వారు పాడిన పాటల నుండి తెలుసుకోవచ్చు. అయితే శక్తివంచన లేకుండా నిజాయితీగానే ఈ స్వరయజ్ఞాన్ని వారు నిర్వహించారని ఈ పాటలన్నిటినీ రెండు మూడుసార్లు విన్న తర్వాత అనిపిస్తుంది.

అందుకే ఇటువంటి క్యాసెట్లను రూపొందిస్తున్నప్పుడు భాష, ఉచ్చారణ విషయంలో నిక్కర్షగా వ్యవహరించే శ్రేయోభిలాషులను పక్కనుంచుకొని వారి సలహాలను స్వీకరించటం తప్పనిసరి.

# సరిగపదమని

**కూర్పు : పి.గిరి**

**6**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ● | ● | 2 | ● | 3 | | | 4 |
| 5 | 6 | ● | 7 | | | ● | ● | |
| 8 | | ● | ● | ● | 9 | | ● | |
| | ● | ● | 10 | | | ● | 11 | |
| ● | 12 | | | ● | | ● | ● | |
| 13 | | ● | ● | 14 | | | ● | |
| | ● | 15 | 16 | ● | | ● | 17 | |
| ● | 18 | | | 19 | | 20 | ● | |
| 21 | | ● | ● | | ● | | ● | ● |

పంపినవారి పేరు :

వయసు : ______ వృత్తి :

చిరునామా : ______

______ ఫోన్: ______

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**ఆధారాలు:**

**అడ్డం:**

3. రాజేశ్వరరావు తన సంగీతంతో తెలుగు వారి మనసున మల్లెల మాల లూగించిన చిత్రం (4)
5. 'కన్నుల్లో....... .........లు కనిపించనీ గుండెల్లో గుసగుసలు వినిపించనీ' (2)
7. '............నగరి కలకత్తాపురి' (3)
8. గాజువాకపిల్లతో ఫోక్‌సాంగ్స్ ఊపుని తెచ్చినదీ'ఈ' శేఖరుడే (2)
9. .......ని మరచి వంచన నేర్చి నరుడే ఈనాడు వానరుడైనాడు (2)
10. 'గల గల గల........ హిమగిరి దరి హరిపుత్రి' ఓ నదిపై కీరవాణి పాడిన పాట (3)
11. ..... .... .....కంగారు నీకేలనే (2)
12. ............ చెలిమి ఒక కల' పి.బి.శ్రీనివాస్ పాట (3)
13. 'నా...... నిన్ను పిలిచింది గానమై వేణుగానమై' రఫీ పాడిన తెలుగు పాట (2)
14. '....... చేసే ప్రాణము పోసే ఆదేవు నీకిది వేడుకా' (3)
15. '............వలచి చెంతకు పిలచి' వీరాభిమన్యులో పాట (2)
17. 'సన్న......... తీవెలోయ్ సంపంగి పూవులోయ్' అంటూ పిల్లల గురించి భానుమతి పాడిన పాట (2)
18. 'పిల్లలు దేవుడూ చల్లని వారే' అనే పాట గల చిత్రం (6)
21. ........... మంచి రోజు పసందైన రోజు (2)

**నిలువు:**

1. 'ఊర్వశీ ఊర్వశీ టేకిటీజీ పాలసీ' అనే పాట గల చిత్రం (4)
2. రాయినైనా కాకపోతిని రామ పాదము సోకగా ........... కాకపోతిని పుణ్యచరితము పాడగా (2)
3. 'మోహన రాగమహా మూర్తి మంతమాయె' అనే పాట గల చిత్రం (8)
4. .... ..... ..... ..... హైదరాబాద్ రిక్షావాలా జిందాబాద్ (8)
6. '.......లిత రాగ సుధా రస సారం' ఎన్టీఆర్‌కి బాల మురళి పాడిన పాట (2)
10. 'కల...... కల......' అన్నమయ్య గీతం (2)
12. 'నీ నవ్వుల తెల్లదనాన్ని నాగమల్లి అప్పడిగింది' పాట గల చిత్రం (2)
13. 'రాదే చెలీ నమ్మ రాదే చెలీ ....... వారినిలా నమ్మరాదే చెలీ (2)
15. 'సీతారాముల కళ్యాణము .........ము రారండి' (2)
16. '............ తీపి చిరునామ ప్రేమ తెలుసు కోవె భామా' సింహాద్రిలో పాట (2)
18. 'లేలేలే నా రాజా .... .... నారాజా' (2)
19. '.....రేయి ఏ ఝాములో' (2)
20. 'రుక్కు రుక్కు అరె బాబా రుక్కు ఓ మై డార్లింగ్ గివ్ మి ఎ........' కమల్‌హాసన్ పాడిన పాట (2)

**పజిల్, కూపన్ 15-11-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)



31 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



16 పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



31 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




18 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

# 'సరిగపదమని-4'

## జవాబులు

**అడ్డం:** 1.అలిగిన 3.చందమామ 7.రేయి 8.వీటూరి 9.గంగా 12.సింగీతం 13.మరపు 17.శశి 18.గోదారి 19.మాడా 22.లతా 23.కృష్ణారెడ్డి

**నిలువు:** 1.అదిరేటి 2.గిల్లి 4.దరి 5.మల్లిగాడు 6.వేటూరి 10.సింగీతం 11.భైరవ 14.దాశరథి 15.అందాల 16. సోడాబుడ్డి 20.లీల 21.కృష్ణా

### కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు

డి.ఎస్.ఆర్.రవిశంకర్-మండపేట(తూ॥గో॥జిల్లా), యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, ఎన్.సారంగపాణి-అనంతపురం, వి.భాస్కర్-హైదరాబాద్, పి.పాపారావు- విశాఖపట్నం, పి.వి.ఆర్.యస్.కిరణ్‌కుమార్-నరసాపురం (ప॥గో॥జిల్లా), మునినానసౌజన్యపాయ్-కాకినాడ, శిష్టాసీతామహలక్ష్మి-హైదరాబాద్, యు.విజయశేఖరరెడ్డి-హైదరాబాద్, ఎం.పురుషోత్తమాచార్య-నల్గొండ, వి.వీణా మాధురి-హైదరాబాద్, భమిడిపాటి వెంకటేశ్వరరావు-హైదరాబాద్, పి.వి.కె.రవితేజ -హైదరాబాద్, ఆకుండికామేశ్వరరావు-రాయగడ్డ(ఒరిస్సా), ఎన్.హనుమంతరావు- చందూర్ (నల్గొండజిల్లా), ఆత్మూరిఅన్నపూర్ణ-హైదరాబాద్, కె.వేణుగోపాల్‌రెడ్డి -హైదరాబాద్, కె.నవనీత-యెలమంచిలి(విశాఖజిల్లా), ఎమ్.రామమోహనా చార్యులు-చాట్రాయి(కృష్ణాజిల్లా), చివుకులచిరంజీవి- ఒంగోలు, ఎమ్.హరిప్రసాద్- విశాఖపట్నం, బచ్చువిజయ్‌కుమార్-విశాఖపట్నం, పి.రాజరాజేశ్వరి- విజయనగరం, పానుగంటి జేమ్స్‌దేవరాజు-అచ్చంపేట (మహబూబ్‌నగర్‌జిల్లా) మేడామస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, నేమానసుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళంటౌన్, చేబోలువెంకటలక్ష్మి- విశాఖపట్నం, పి.మధుసూదనరావు-ఒంగోలు, జి.జయశ్రీ-హైదరాబాద్, ఎస్.కె.నాగేశ్వరరావు-పెనుగొండ(ప॥గో॥జిల్లా), శ్రీపాదవసుంధర-హైదరాబాద్, సి.హెచ్.విజయవాణి-కర్నూల్, సి.హెచ్.సూర్యా రావు- చీపురుపల్లి (విజయనగరం జిల్లా), కోడూరుసత్యనారాయణ-కడప, బి.కవిత- తిరుపతి, కిశోర్‌కుమార్.ఆర్ -గోదావరిఖని(కరీంనగర్‌జిల్లా), వి.ప్రతిభ-గొల్లవానితిప్ప (ప॥గో॥జిల్లా), చెవలచిన్ని కృష్ణ- జగ్గయ్యపేట(కృష్ణాజిల్లా), ఎమ్.సువర్చలశ్రీనివాస్- హైదరాబాద్, వై.రాజేష్- రాంపురం (విశాఖజిల్లా), తురుమెళ్ళనాగలక్ష్మి-నెల్లూరు, ఎస్.లక్ష్మినారాయణ- విశాఖపట్నం, ఆర్.శారదఅనసూయ-హైదరాబాద్, పి.ఎన్.ఆర్.కుమారి- విజయనగరం, ఎస్.జగన్మోహనరావు-కరీంనగర్, గేదెల రామరావు-ఏలూరు, సి.హెచ్.హేమకుమారి-హైదరాబాద్, డా॥సయ్యద్ రహమతుల్లా- పర్లాకిమిడి (ఒరిస్సా), ఎ.పి.హృదయకుమార్-నిజామాబాద్, సుంకర రమేష్‌నాయుడు-ఒంగోలు, గుమ్మాకవిత- విశాఖపట్నం, బెల్లంకొండరాంబాబు-వమిడిపాడు(గుంటూరుజిల్లా), డి.వేణుగోపాల్-అనంతపురం, గోగులమూడి శేషగిరిరావు-సంతమాగులూరు (ప్రకాశంజిల్లా), ఎమ్.వి.వి.ఎస్.గోపాలకృష్ణ- విశాఖపట్నం, కడలిఅప్పారావు-చీరాల (ప్రకాశంజిల్లా), ఆర్.నాగేశ్వరరావు- శ్రీకాకుళం, తాడిమళ్ళవెంకటశేషగిరిరావు- వుట్లచెఱువు (కృష్ణాజిల్లా), సి.ప్రకాష్‌బాబు-సూళ్ళూరుపేట(నెల్లూరుజిల్లా), వానపల్లి గంగరాజు- విశాఖపట్నం, వి.చంద్రకుమారి-హైదరాబాద్, వెల్లంకికూర్మనాథం- పర్లాకిమిడి (ఒరిస్సా), కె.వెంకటశాస్త్రి- విశాఖపట్నం, సి.హెచ్.స్వాతి-విశాఖపట్నం, పంగులూరిసత్యనారాయణ-నెల్లూరు, వై.వి.ఎస్.సత్యనారాయణ-కాకినాడ, జి.వి.రమణ-సంగారెడ్డి, జి.ఢిల్లేశ్వరరావు-ధనుపురం(శ్రీకాకుళం), ముగ్గళ్ళ రాజ్‌కుమార్-హైదరాబాద్, నందిరాజుశ్రీవాణి-హైదరాబాద్, కొడాలిసీతారామా రావు-విజయనగరం, సి.హెచ్.వెంకటరాజయ్య-సంగారెడ్డి, జె.వి.రమణ-కోవూరు (నెల్లూరుజిల్లా), సోమయజులసాయిప్రసాద్- ఒనకడిల్లీ (ఒరిస్సా), ఉషా గందమాంబ.సి.హెచ్.-పాలకొల్లు(ప॥గో॥జిల్లా), ఎ.పద్మావతి-శ్రీకాకుళం, కె.బి.కైలాస్‌నాథ్-అనంతపురం, యం.శైలకుమారి- అనంతపురం, పి.వి.పుందర్ కుమారు-బెరహంపూర్(ఒరిస్సా), నందిపాటి వెంకటేశ్వరరావు-లేమల్లెపాడు (గుంటూరుజిల్లా), మాదాబత్తులలక్ష్మి-విజయనగరం, బలుపరివిజయ్-సూగూరు (మహబూబ్‌నగర్‌జిల్లా), యల్లాపంతుల లక్ష్మిపద్మావతి- శ్రీకాకుళం, వై.కాంత్రిసాగర్ -ఏలూరు(ప॥గో॥జిల్లా), వేమసత్యప్రసాదరావు- రాజమండ్రి, వి.అన్నపూర్ణ-అత్తిలి, ములుకుట్లవెంకటనారాయణ-కాకినాడ, డా॥ఎన్.శ్యామల-నెల్లూరు, ఎమ్.మణిబాబు-హైదరాబాద్, అగస్త్యరాజు కుసుమకుమారి-ఒంగోలు, మల్లిడి విజయ భాస్కర్‌రెడ్డి- కుతుకులూరు (తూ॥గో॥జిల్లా), బందకవిసోమేశ్వరరావు-రామవరం(తూ॥గో॥జిల్లా), జె.మాధవి- హైదరాబాద్, షేక్.ఖలీల్-శ్రీశైలండ్యామ్ తూర్పు(కర్నూలుజిల్లా), సుమ-హైదరాబాద్, కె.పండరిపాదాలు-నెల్లూరు, పులిపాక వసుంధర-జైపూరు (ఒరిస్సా), పి.ఎస్.ఎన్.రాజు-శ్రీరాంనగర్ (మహబూబ్‌నగర్ జిల్లా), తెలికిచెర్ల రామకృష్ణ-విజయనగరం, పి.శ్రీనివాసరెడ్డి- నెల్లూరు, గెలివి శశికళ-నంద్యాల, ఉన్నవ లక్ష్మీనారాయణ-రాజమండ్రి, పింగళికనకవల్లి- హైదరాబాద్, ఎన్.పద్మజ-న్యూఢిల్లీ, బి.రవికిషోర్-హైదరాబాద్, చిట్టావిశ్వేశ్వరశాస్త్రి -హైదరాబాద్, రాయప్రోలు లక్ష్మీదేవి-ఒంగోలు, వి.కృష్ణవేణి-తెనాలి, వి.కృష్ణారావు-అమలాపురం(తూ॥గో॥జిల్లా), పి.మధు-విజయనగరం, పి.వి.రామదాసు-బెరహంపూర్ (ఒరిస్సా), జి.భోగేశ్వరరావు- విశాఖపట్నం, యస్.భరత్‌కుమార్-ధర్మపురి(కరీంనగర్ జిల్లా), ఈ.రాధిక- హైదరాబాద్, తాడిరంగారావు-రాజమండ్రి, కె.గీతాసరోజిని- చీరాల (ప్రకాశంజిల్లా), వెంకటసుబ్బారావుఓలేటి-విజయవాడ, తనికెళ్ళరామకృష్ణ- విజయవాడ, గరిమెళ్ళ భాగ్యశ్రీ-ఖమ్మం, కొమరవెల్లిసరస్వతి-హైదరాబాద్, బి.వి.మనోహర్‌బాబు-నవులూరు, హెచ్.లక్ష్మి-హైదరాబాద్, పి .మానస్-నెల్లూరు, జి.దిలిప్- విశాఖపట్నం, గంగరావువెంకట్రావు-సత్తెనపల్లి, ఎస్.వి.చంద్రశేఖర్-నగరి (చిత్తూరు జిల్లా), ఇవ్వగుంటశ్రీనివాసరావు-హైదరాబాద్, ముప్పిరాలశశాంక- హైదరాబాద్, పి.శ్రీనివాసారావు-హైదరాబాద్, కె.మారుతేశ్వరరావు-పరిగి (అనంతపురంజిల్లా), జి.శంకర్‌రావు-నిర్మల్ (ఆదిలాబాద్‌జిల్లా), ఎ.పి.రావు- పుత్తూరు, ఆర్.వి.పద్మావతి-హైదరాబాద్, ఎస్.నాగబాబు- హైదరాబాద్, కె.రవికుమార్-రాజమండ్రి, అనుపర్తి జయపాల్-మదనపల్లి (చిత్తూరుజిల్లా), భావరాజునీరజ-న్యూడిల్లీ, పి.విజయలక్ష్మి-సామర్లకోట (తూ॥గో॥జిల్లా), మద్దాలి మురళీకృష్ణ-నిజామాబాద్, మద్దిపాటిసూర్య-హైదరాబాద్.

### ఒక తప్పుతో వ్రాసిన వారు

సి.ఎస్.స్వామి-ఒంగోలు, జె.వంశీధర్-పిఠాపురం(తూ॥గో॥జిల్లా), మహ్మమద్‌లతీఫ్-హైదరాబాద్, న్యాయపతివిజేత-కాకినాడ, మండవఆంజనేయులు-సంతనూతలపాడు(ప్రకాశంజిల్లా), ఎమ్.సుగాత్రి-హైదరాబాద్, పోగులనాగరాజేశ్వరశర్మ-కొత్తపల్లి (కరీంనగర్‌జిల్లా), కె.వి.రమణారెడ్డి-హైదరాబాద్, వడాలరాము-పాతపట్నం (శ్రీకాకుళంజిల్లా), వి.వి.సుబ్బారావు-హైదరాబాద్, బి.వి.ఎస్.ప్రసాద్-పుల్లలపాడు (ప॥గో॥జిల్లా), కె.సౌమ్యప్రకాశ్-రాజమండ్రి, భమిడిపాటిగౌరీశంకర్-నరసన్నపేట (శ్రీకాకుళంజిల్లా), వరదాసాయికుమార్-పర్లాకిమిడి(ఒరిస్సా), పెంటకోటషర్మిళా ఋషి-విశాఖపట్నం, పి.యం.ఆచారి-హైదరాబాద్, ఎ.సరోజాదేవి-రాజమండ్రి, జి.పాండురంగశర్మ-హైదరాబాద్, మెహర్‌కుమార్‌తాటిపాముల-లింగంపల్లి (నిజామాబాద్‌జిల్లా), గంటి ఎస్.వి.ఎస్.ఎస్.రామగోపాల్-పెరూరు(తూ॥గో॥జిల్లా), వి.భార్గవి-విజయవాడ, ఎస్.టి.ముద్దుకృష్ణ-బెంగుళూరు(కర్ణాటక), దూలపల్లి వెంకటరమణ-గొల్లవిల్లి(తూ॥గో॥జిల్లా), వై.రోశిరెడ్డి-సత్తెనపల్లి, ఎం.హరికృష్ణ-హైదరాబాద్, పానాటివిజయలక్ష్మి-చిత్తూరు, నిర్మలక్రిష్ణ-తిరుపతి, జి.శ్రీదేవి- కాకినాడ, ఎస్.సి.సీతాదేవి-ఆత్రేయపురం, ప్రణవసత్యనారాయణపంతులు- నర్సాపురం, యన్.శ్రీనివాసులు-కర్నూలు, డా॥కె.ఎస్.దయానిధి-గుంటూరు, డి.మల్లిఖార్జున్-మందమర్రి(ఆదిలాబాద్‌జిల్లా), త్యాగరాజుమద్దిడి-నరసన్నపేట, ఎమ్.సుశీల-నరసన్నపేట, యు.గున్నేశ్వరరావు-పొగిరి(శ్రీకాకుళంజిల్లా), కె.వి.చార్యులు-బెంగుళూరు (కర్ణాటక), సి.వి.ఆర్-మాళికేశ్వరి-ఏలూరు (ప॥గో॥జిల్లా), కనకదండి భానుమతి-విజయనగరం.

### రెండు తప్పులతో వ్రాసిన వారు

డి.ఎన్.డికుమార్-హైదరాబాద్, ఎం.వి.యస్.లక్ష్మి-కాకినాడ, మరువాడకామేశ్వర రావు-మంచిర్యాల(ఆదిలాబాద్‌జిల్లా), సి.ఎ.నారాయణరావు-గుంతకల్లు (అనంతపురంజిల్లా), ఎమ్.నర్సయ్య-పాల్వంచ(ఖమ్మంజిల్లా), సత్తిసూర్యనారాయణ రెడ్డి-కొమరిపాలెం(తూ॥గో॥జిల్లా), పి.స్వాతిలక్ష్మి-చీపురుపల్లి(విజయనగరంజిల్లా), డి.దుర్గాప్రసాద్-సికింద్రాబాద్, బియ్యపుసాయికృష్ణ-హైదరాబాద్, మర్రివసంతలక్ష్మి-కర్నూలు, సౌమిత్రిరమణాచార్య-హైదరాబాద్, జె.పోలురాజు-కడపరాజువల్లి (ప్రకాశంజిల్లా), ఎమ్.అప్పారావు-అనకాపల్లి, జి.వి.ఉదయకుమార్-కంచికచెర్ల (కృష్ణాజిల్లా), పి.వి.సుబ్రహ్మణ్యం-సూళ్లూరుపేట(నెల్లూరుజిల్లా), జొన్నలభానుమూర్తి-భీమవరం(ప॥గో॥జిల్లా), జి.బంగారుబాబు-హైదరాబాద్, పి.నరసింహమూర్తి-హైదరాబాద్, జవ్వాంగులశ్రీనివాసరావు-సత్తెనపల్లి(గుంటూరుజిల్లా), విరివింటిశ్రీ మెక్షిత్‌శాస్త్రి, వనపర్తి(మహబూబ్‌నగర్‌జిల్లా), ఆర్.మణిప్రసాద్-బాదేపల్లి (మహబూబ్‌నగర్‌జిల్లా), కె.రమ-హైదరాబాద్, డా॥ఉప్పలవెంకటరమణజ్యాం- కడప, వి.రోహిణి-నర్సాపురం(ప॥గో॥జిల్లా), సంకోజురాజగోపాల్-మాన్‌దొడ్డి (మహబూబ్‌నగర్‌జిల్లా).

### మూడు తప్పులతో వ్రాసిన వారు

కె.శ్రీరామచంద్రమూరి-హైదరాబాద్, యం.నాగేంద్రప్ప-మల్కాజ్‌గిరి (రంగారెడ్డిజిల్లా), బి.ప్రభారిణి-పర్లాకిమిడి(ఒరిస్సా), సి.సత్యవాణి-సికింద్రాబాద్, ఇ.మల్లిఖార్జునప్రసాద్-చిత్తూరు, కర్రిరఘునాథ్-హైదరాబాద్, అవధానంలక్ష్మీమోహన్- తిరుపతి, ఎ.బాల్‌నాథ్-నిజామాబాద్, బి.రవిశంకర్-హైదరాబాద్, ఎమ్.ఎ.కె.చక్రవర్తి-నడకుదురు(తూ॥గో॥జిల్లా), కె.సరోజ-అనకాపల్లి.

దీపావళి పండగ సందర్భంగా సినీ ప్రముఖులలో కొందరు లభ్యం కాకపోవడం వల్ల 'సరిగపదమని - 4' డ్రా ఫలితాలను విజేతల అభిప్రాయాలతో సహా ఈ సంచికలో ప్రచురించలేకపోయాం. వచ్చే సంచికలో ప్రచురించటం జరుగుతుంది. - ఎడిటర్

రాజేష్ కి
'పరమశివుడు'-పరమ యిష్టమైన దేవుడు.
సుందరి -విపరీతంగా ప్రేమించే అమ్మాయి.
విన్యాస - వీరలెవల్లో అభిమానించే హీరోయిన్.





# ట్వింకిల్ ట్వింకిల్ 'లిటిల్' స్టార్...

- పులగం చిన్నారాయణ
(ఫిలిం జర్నలిస్ట్)

డిగ్రీ చదువుతుండగా క్లాస్‌మేట్ సుందరిని ఘనాతి ఘనంగా, ఘోరాతి ఘోరంగా ప్రేమించేసాడు. ఆ అమ్మాయి కూడా ఇతగాడి ప్రేమలో ఈత కూడా కొట్టలేనంత లోతుగా మునిగిపోయింది. మొత్తానికి వీరి ప్రేమ పురాణం యిద్దరిళ్లలోనూ తెలిసి యిద్దరి బుర్రలు మసాలాపెట్టి మరీ కూర వండేశారు. అయినా సరే ఆ యిద్దరూ తమ ప్రేమను త్యాగం చేసేది లేదని తెగేసి మరీ చెప్పేశారు.

దాంతో సుందరి తల్లిదండ్రులు ధైర్యంచేసి ఆమెను బలవంతంగా వాళ్ల బావకిచ్చి పెళ్లి చేసేశారు.

మెళ్లో మూడుముళ్లూ పడగానే - మునిగిపోయే తన అలవాటుని మరో యాంగిల్లో కంటిన్యూ చేయడానికి - 'పతియే ప్రత్యక్ష దైవం' అనుకుంటూ సంసారంలో మునిగి పోయింది సుందరి.

దెబ్బతో మన రాజేష్ దేవదాసు అయిపోదామనుకున్నాడు. తాగితే తన లివరు గలివరు లెవల్లో ఎన్‌లార్జ్ అయిపోతుందని భయమేసి దేవదాసు నుంచి రామదాసుకి షిఫ్ట్ అయి దేవుణ్ణి తిడితే రిజల్ట్ త్వరగా వస్తుందనిపించి ప్రతీరోజూ ఊరి చివర కోవెలకెళ్ళి శివుణ్ణి నానా శాపనార్థాలు పెట్టసాగాడు.

"నాలాంటి పరమభక్తుని కోరిక తీర్చలేని నువ్వూ ఒక దేవుడివేనా? కాదు... నువ్వు దేవుడివి కాదు.. షాబాత్ స్టోన్‌వి. నేనికనుండి నీకు బద్ధ శత్రువుని. ఇప్పటిదాకా నిన్ను మంత్రాలతో పూజించాను. యికనుండి నిన్ను తిట్లతో పూజిస్తాను. నా ప్రేయసిని నాకు కాకుండా చేసి అక్కడ గంగ-గౌరీలతో కులకడానికి నీకు మనసెలా ఒప్పింది? నేను కోరుకున్న ఒక్కదాన్ని అందించలేని నీకు యిద్దరెందుకు? వెంటనే వదిలేయ్ వాళ్లని..." అంటూ 'పరమేశా గంగ విడుము పార్వతి చాలున్' అన్న శ్రీనాథుడిని బీట్ అవుట్ చేస్తూ నోటికొచ్చినట్లు లంకించుకోవడంతో...

పరమశివుడికి కొత్త పెళ్ళాంతో దూరదర్శన్ ప్రోగ్రాం చూస్తున్న ఫీలింగొచ్చేసింది. అతన్నిలాగే నిర్లక్ష్యం చేస్తే కైలాసగిరి కాస్తా కొల్లేరు అవుతుందని భయమేసింది. స్విట్జర్లాండ్‌లో వున్న హీరోయిన్‌ని విలన్ ఆఫ్రికాకి కాకిలా ఎత్తుకుపోతుంటే లండన్‌లో హెయిర్ కట్ చేయించుకుంటున్న హీరో అమెరికాలో చిన్న చిరునవ్వు క్లోజప్ ఇచ్చి ఇండియాలో ప్రత్యక్షమైనట్లు రాజేష్ ముందు సాక్షాత్కరించాడు.

'భక్తా, టీ.వి. సినిమా మధ్యలో అడ్వర్టయిజ్‌మెంట్‌లా ఏంటి నీ గోల?' అని అడిగాడు వీలైనంత శాంతంగా.

'ఏంటా... నా అంత పరమభక్తుని చిన్న కోరిక కూడా తీర్చలేకపోయావే... నువ్వూ ఒక దేవుడివేనా?' అని రెచ్చిపోయాడు రాజేష్ విపరీతమైన కోపంతో.

'మళ్ళీ మొదలెట్టకు నాయనా, నీ గోల పడలేక పార్వతితో కూడా చెప్పకుండా వచ్చేసానని ప్రత్యక్షమయ్యాక గుర్తొచ్చింది... ఇప్పుడే పదినిమిషాల్లో వచ్చేస్తాను. ఈలోపు ఏం కావాలో డిసైడ్‌చేసుకో... ఒకే ఒక్క కోరిక సుమా' అని బుడుంగుమని మాయమైపోయాడు శివుడు.

రాజేష్‌కి యిది కలయా, వైష్ణవ మాయా అని అనిపించింది. శివుడు క్లియర్‌గా కనిపిస్తుంటే మధ్యలో విష్ణువునెందుకు లాగడం ఆ శంకరుణ్ణే తల్చుకుందాం అనుకుంటూ 'శంకర్ సినిమాలో కంప్యూటర్ గ్రాఫిక్స్‌లా ఏమిటీ వింత' అని తనలో తాను అనుకోసాగాడు.

'ఒకే ఒక్క కోరికట... మరీ పరమ పిసినారి అయిపోయాడేమిటి శివుడు... ఏం అడగాలబ్బా...' అని ఆలోచిస్తుండగా ఎదురుగా తన అభిమాన హీరోయిన్ విన్యాస - వాల్ పోస్టర్ మీద దర్శనమిచ్చింది.

'సుందరికి బుద్ధి చెప్పాలంటే విన్యాసని పెళ్ళి చేసుకోవడం ఒక్కటే మార్గం' అని మళ్ళీ తనలో తాను అనుకుంటుండగానే శివుడు ప్రత్యక్షమై 'భక్తా, త్వరగా చెప్పు నీ కోరిక ఏమిటి' అని అడిగాడు. రాజేష్ వెంటనే 'నా అభిమాన హీరోయిన్ విన్యాస నన్ను పెళ్ళి చేసుకునేలా చూడు స్వామి' అన్నాడు.

పరమశివుడు రాజేష్ వంక చూసి ఒక వెర్రి నవ్వు నవ్వాడు.

'యిప్పటిదాకా ప్రేమా, దోమా అని నన్ను బండబూతులు తిట్టి... నన్నూ పార్వతినీ డిస్టర్బ్ చేసి, యిప్పుడేమో ప్రేమికురాలు ప్లేస్‌లో హీరోయిన్ కావల్సి వచ్చిందా? దానికి బదులు నువ్వు సుందరినే అడిగుంటే నీ స్వంతం చేసివుండేవాడిని కదా... సర్లే.... ఆడిన మాట తప్పను. విన్యాస పాతికేళ్ళు వచ్చాకే పెళ్ళి చేసుకుంటానని మొన్ననే పేపర్ స్టేట్‌మెంటిచ్చింది. సినిమా హీరోయిన్‌కి పాతికేళ్ళు ఎప్పుడు వస్తాయో ఆ బ్రహ్మక్కూడా తెలీదు కదా... అంచేత ఆమె లెక్క ప్రకారం పాతికేళ్ళు వచ్చాకే మీ పెళ్ళవుతుంది' అని చెప్పి అంతర్థానమయ్యాడు శివుడు. ■




1960లో వచ్చిన శ్రీ ప్రొడక్షన్స్ వారి



చిత్రంలోని 3 పాటల గురించి గత సంచికలో వివరించగా, మిగిలిన స్వరరచనలలో ఓ నాలుగు పాటలు ఓ నాలుగు పద్యాల గురించి ఈ సంచికలో...

ఆశలు తీర్చవె ఓ జననీ
ఆదరముంచవే జాలిగొనీ ॥ఆశలు॥
సవతి తల్లి దయమాలినది
తండ్రి మాట ఇటు సాగనిది ॥సవతి॥
పవలూ రేయీ వాపోవుటయే
నా వరమైనది ఈ జగతి ॥ఆశలు॥
శోకమైన నా లోకములో
గోచరించె శుభరేఖలెవో ॥శోక॥
ఈ వెలుగే నా జీవన శోభా
దీవెన సేయవె ప్రేమఖనీ ॥ఆశలు॥



ఈ పాటను జిక్కి గానం చేయగా రాజసులోచనపై చిత్రీకరించారు. శంకరాభరణ రాగస్వరాలపై చేసిన కార్డ్ కంపొజిషన్ పాట ఇది. 1959లో 'ఖైదీ నం 911' అనే హిందీ చిత్రం ఒకటి వచ్చింది. ఈ చిత్రం కోసం దత్తారామ్ స్వరపరచగా లతా పాడిన 'మిఠి మిఠి బాతో సే బచ్‌నా జరా... ట్యూన్‌ని 'ఆశలు తీర్చవే ఓ జనని' పాటకు వాడుకున్నారు. ఇలా వాడుకోవడం వల్ల 'ఖైదీ నం 911' చిత్రాన్ని తర్వాతి రోజుల్లో తెలుగులో 'ఖైదీ కన్నయ్య' చిత్రంగా తీసినప్పుడు - పిల్లాడికి ఓ టీచర్ పాటలతో పాఠం చెప్పే సన్నివేశంలో వచ్చే పాట 'తియతీయని తేనెల మాటలతో తీస్తారు సుమా గోతులు... నమ్మవద్దూ' కి 'ససురాల్' చిత్రంలోని 'తెరి ప్యారి ప్యారి సూరత్‌కో కిసీకి నజర్ నా లగే చష్మే బద్దూ' అనే పాట ట్యూన్‌ని ఆశ్రయించవలసి వచ్చింది. అంచేత 'ఖైదీ నెం 911' చిత్రంలోని 'మిఠి మిఠి బాతోసే' పాట సంగీత సాహిత్యాల్ని వేరుచేసి ట్యూన్‌ని 'ఆశలు తీర్చవె' పాటకి, లిరిక్‌ని 'తియ తీయని తేనెల మాటలతో' పాటకి (ఖైదీ కన్నయ్యలో) వాడుకోవడాన్ని ఓ విశేషంగా ఇక్కడ ఉదహరించక తప్పదు. హుషారుగాను, విషాదంగాను రెండు రకాలుగా పాడిన 'మిఠి మిఠి బాతోసే బచ్‌నా జరా' పాటకి, తెలుగులో వచ్చిన 'ఆశలు తీర్చవె ఓ జననీ' పాటకి - తాళాన్ని చతురస్ర గతిలోనే ఉపయోగించినా నడకలో తేడా చూపించారు అటు దత్తారామ్... ఇటు ఘంటసాల.

హిట్ అయిన హిందీ పాటలో తర్వాతి రోజులకి పనికొచ్చే సాహిత్యం ఓవైపు డామినేట్ చేస్తూ వున్నా ప్రస్తుత సన్నివేశానికి తగిన సాహిత్యాన్ని తగు విలువలతో సమకూర్చడం నిజంగా గొప్ప విషయమే. ముఖ్యంగా 'దీవెన సేవయె ప్రేమఖనీ' అనే వాక్యం శబ్దపరంగా అర్థపరంగా ప్రశంసించదగ్గది.

అతడు : కమ్ కమ్ కమ్ కంగారు నీకేలనే
నా వంక రావేలనే చెలి నీకింక సిగ్గేలనే
ఆమె : నో నో నో నీ జోరు తగ్గాలిగా
ఆ రోజు రావాలిగా ఇక ఆపైన నీదానగా నో నో నో
అతడు : కోరి ఏనాడు జతచేరి ఎగతాళిగా
చేరువైనాము ఆనాడే జోడైతిమే ॥కోరి॥
ఆమె : ఇంత స్నేహానికి అంత ఆరాటమా
చాలులే తమరికి ఏల ఈ తొందరా ॥కమ్॥
ఆమె : ఏల ఈ లీల పదిమందిలో పాటలా
పరువు మరియాద లేని ఈ సయ్యాటలా ॥ఏల॥
అతడు : నీవు నా దానవై నేను నీ వాడనై
నీడగా నిలిచినా చాలులే నా చెలి ॥కమ్॥



ఈ పాటను ఘంటసాల, జిక్కి గానం చేయగా అక్కినేని, రాజసులోచనపై చిత్రీకరించారు. 1958లో వచ్చిన 'మౌసీ' హిందీ చిత్రం కోసం వసంత్ దేశాయ్ స్వరపరచగా లతా, తలత్ మహమ్మద్ పాడిన 'టిం టిం టిం తారోంకే బీచ్ తలే' పాట ట్యూన్‌ని ఈ పాటకు వాడుకున్నారు. శంకరాభరణ రాగంపై వచ్చే స్వరాలపై చేసిన ఈ కార్డ్ కంపోజిషన్ సాంగ్‌లో పల్లవి తర్వాతా, చరణాల మధ్య మధ్యా - వచ్చే ఆలాపనలు పాటకు ఎంతో వన్నె తెచ్చాయి. ఒరిజినల్ హిందీ ట్యూన్ తలత్ మహమ్మద్ గొంతుతో అతి మృదువుగా అమిరిపోతే తెలుగు అనుకరణ ఘంటసాల కంఠంలో మధుర మార్దవంగా ఇమిడిపోయింది. విభిన్న గాత్రధర్మాలు కలిగిన ఇద్దరు గాయకులకు తగ్గ ట్యూన్‌ని సృష్టించిన అసలు స్వరకర్త వసంత్ దేశాయ్‌ని ప్రత్యేకంగా అభినందించాలి.

సాకీ : తుషార శీతల సరోవరాన<br>
అనంత నీరవ నిశీధిలోన<br>
ఈ కలువ నిరీక్షణా...<br>
నీ కొరకే - రాజా - వెన్నెల రాజా<br>
ప : కలనైనా నీ తలపే ॥కలనైనా॥<br>
కలవరమందైనా నీ తలపే ॥కలనైనా॥<br>
చ : కలువ మిఠారపు కమ్మని కలలు ॥కలువ॥<br>
కళలూ కాంతులు నీ కొరకేలే ॥కళలూ॥<br>
చెలి ఆరాధన సాధన నీవె<br>
జిలిబిలి రాజా జాలి తలచరా ॥కలనైనా॥<br>
చ: కనుల మనోరథ మాధురి దాచి ॥కనుల॥<br>
కానుక చేసే వేళకు కాచి<br>
వాడే రేకుల వీడని మమతల<br>
వేడుచు నీకై వేచి నిలచెరా ॥కలనైనా॥



'తుషారు శీతల సరోవరాన' అనే సాకీతో మొదలై 'కలనైనా నీ వలపే' అనే మకుటంతో ప్రసిద్ధికెక్కిన ఈ గీత స్వరకర్తగా ఘంటసాలకు, గాయనిగా పి.లీలకు ఎనలేని పేరు ప్రఖ్యాతులను తెచ్చిపెట్టింది. కృష్ణకుమారి, కాంతారావు, రాజేశ్వరి పై పాట చిత్రీకరించారు. ఈ రాజేశ్వరి ఎవరోకాదు ప్రముఖ నటి శ్రీదేవి తల్లి. మొదట ఈ వేషానికి సుజాత అనే నటిని అనుకున్నారు. సమయానికి ఆవిడ లభించకపోవడంతో కాంతారావుగారి సలహాపై రాజేశ్వరిని తీసుకోవటం జరిగింది. ఈ 'కలనైన నీ వలపే' పాటకి హిందోళ రాగం ఆధారం. సితార్ వాద్యానికి అతి చక్కని ప్రాధాన్యత గల ఈ గీతం ఔత్సాహిక గాయనీమణులకు ఘంటసాల శాశ్వతంగా ఇచ్చిన ఓ వరం.

అతడు : చక్కనిదానా చిక్కనిదానా ఇంకా అలకేనా<br>
ఆమె : నీ మాయలన్నీ చాలించు నాతోనా ॥నీ మాయ॥<br>
అతడు : పోతా పోతానంటే నేనేమై పోతానే<br>
ఎనిమిది గంటల షరతు పోయింది నిన్నటితోనే ॥పోతా॥<br>
ఆమె : తమరి నాన్న హై హై హై విడువలేదే ॥తమరి॥ ॥చక్కని॥<br>
ఆమె : అమ్మగారి ఇంటా మా నాన్నతోటీ తంటా<br>
అత్తగారి ఇంటా హై హై పోరంటా ॥అమ్మ॥<br>
అతడు : జతగ ఉంటే ఏ తంట మనకు లేదంటా॥జతగా॥ ॥చక్కని॥



ఈ పాటను పిఠాపురం నాగేశ్వరరావు, స్వర్ణలత పాడగా రేలంగి, సురభి బాలసరస్వతి అభినయించారు. సంగీత దర్శకురాలు ఉషాఖన్నా స్వరపరచగా 1959లో వచ్చిన 'దిల్ దేకె దేఖో' చిత్రంలోని టైటిల్‌సాంగ్ ఈ పాటకి యధాతథంగా ఆధారం. రఫీ పాడిన ఆ హిందీ పాటకు ఇంకో ఒరిజినల్ ఉంది. 'Sugar Time' అనే టైటిల్‌తో మెక్‌గ్వాయిర్ సిస్టర్స్ స్వరపరచి, పాడి 1958లో విడుదల చేసిన 'Sugar in the morning, Sugar in the evening, Sugar at supper Time, Be my little sugar and love me all the time' అనే పాప్ సాంగ్ ఈ 'దిల్ దేకె దేఖో దిల్ దేకె దేఖో దిల్ దేఖో దిల్ దేకె దేఖోజీ దిల్ లేనే వాలో దిల్ దేనా సీఖోజీ' పాటకు ఆధారం. చరిత్ర ప్రాధాన్యం కలిగిన కొన్ని విషయాలను, విశేషాలను ఆసక్తితో సేకరించి దాచుకునే 'హాసం' పాఠకుల సౌకర్యార్థం పొందుపరిచిన 'Sugar in the morning' పాప్‌సాంగ్ సాహిత్యమిది.

Sugar in the morning,<br>
Sugar in the evening,<br>
Sugar at supper Time,<br>
Be my little sugar and love me all the time;<br>
Like the stars above you - I will always love you,<br>
When I call you mine,<br>
So be my little sugar and love me all the time,<br>
Won't you say you love me, like the stars above,<br>
And forever be mine in this heaven of live,<br>
Honey in the morning honey in the evening,<br>
Honey at supper time;<br>
Be my little honey and love me all the time,<br>
You went away, that saturday,<br>
And you thought you'd make me pay;<br>
Well, you did, but now you're back,<br>
Oh, we'll live in a little shake: "Oh, Be my little".

హిందీ పాటలోని చరణాల స్వరరచనకి 'Sugar Time' లోని చరణాల స్వరరచనకీ చాలా తేడా వుంది. కానీ మన తెలుగు పాట 'చక్కని దానా చిక్కని దానా' కు మాత్రం 'దిల్‌దెకెదేఖో' హిందీ పాటే పూర్తిగా ఆధారం. పాటలోని సాహిత్యం జాగ్రత్తగా గమనిస్తే కామెడీ ట్రాక్ కొంతవరకు అర్థమయిపోవటమే కాకుండా కథతోపాటు కామెడీ ట్రాక్‌కు తగ్గట్టుగా కూడా ఆ రోజుల్లో పాటల సాహిత్యం ఉండేదని తెలుస్తుంది.

హిందీ చిత్రాలలోని ట్యూన్‌లను యథాతథంగా తీసుకుని తయారు చేసిన - రావె రాధా రాణీరావే, ఆశలు తీర్చవె ఓ జననీ, కమ్ కమ్ కమ్ కంగారు నీకేలనే, చక్కనిదానా చిక్కని దానా పాటలను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఒక్క విషయం అరటి పండు చేతిలో ఒలిచిపెట్టినట్టు అర్థమవుతుంది.

బాగా పాపులర్ అయిన హిందీ పాటల ట్యూన్‌లను ఎంత మనం ఆడాప్ట్ చేసుకున్నా - తెలుగులో కూడా ఈ నాలుగు పాటలూ ఇంత హిట్ అయ్యాయంటే అందుకు కారణం ట్యూన్స్‌లో వున్న గొప్పదనం మాత్రమే కాదు - ఈ సంగీతం మనదే ఈ సాహిత్యం మనదే అన్నంతగా మన హృదయాలలో చొచ్చుకుపోయిన - నేటివిటి టచ్. ఇవాళ తయారవుతున్న ద్విభాషా చిత్రాలలో గాని, నిర్మాణానికి ముందుగానే ప్లాన్ చేసుకుంటున్న డబ్బింగ్ చిత్రాలలో గాని పాటల పరంగా మనం మిస్ అవుతున్నది అదే...!

పైన ఉదహరించిన పాటలే కొన్ని పద్యాలు కూడా ఉన్నాయీ చిత్రంలో... వాటిలో ఓ నాలుగు పద్యాల గురించి....

**లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్‌డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప ఇతః పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్**
**రావే ప్రేయసీ... కావవే సఖియ... సంరక్షించు ప్రాణేశ్వరీ**



బమ్మెర పోతన విరచితమైన భాగవతంలోని గజేంద్ర మోక్షఘట్టంలో పద్యాన్ని తీసుకుని సినిమా పరంగా కొన్ని మార్పులు చేసి వుపయోగించుకోవడం జరిగిందిక్కడ. శార్దూల విక్రీడితమైన అసలు పద్యంలోని 'రావే ఈశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మక' అనే చతుర్థ పాదాన్ని 'రావే ప్రేయసీ కావవే సఖియ సంరక్షించు ప్రాణేశ్వరీ' అంటూ మార్చారు. పద్యాల్ని పాడుతున్నప్పుడు అందులోని పదాల్ని ఉచ్చరించటంలో వ్యాకరణ పరంగా వుండే అరసున్నాల్ని తీసేసి ఆ ప్రకారంగా వచ్చే మార్పుల్ని సరళతరం చేసి - పాండిత్యంతో సంబంధం లేని వారు కూడా హాయిగా పాడుకోడానికి అనువుగా తీర్చిదిద్దుకున్నారీ పద్యాన్ని. సంగీతపరంగా ఈ పద్యాన్ని ఘంటసాల హిందోళ రాగంలో స్వరపరచి పాడగా అక్కినేని నాగేశ్వరరావుపై చిత్రీకరించారు. ఆఖరున రాజసులోచన కూడా సన్నివేశ ప్రాధ్యాంగా వచ్చి చేరుతుంది.

**తే.గీ.** **మగని ప్రాణంబు, అత్తమామలకు చూపు**
**పరులు గైకొన్న రాజ్యము వైభవమ్ము**
**ముద్దు పాపల వరముగా పొందగలిగే**
**వెలది సావిత్రి తన యుక్తివలనగాదే!**

**తే.గీ.** **నిండు కొలువున కీడిచి నీచమతులు**
**వలువ లూడిచి తలవంపు సలుప నెంచ**
**ప్రజలు కీర్తింప పరువు కాపాడు కొనియె**
**కలికి ద్రౌపది తన భక్తి కతనగాదె!**

**తే.గీ.** **దుష్ట దానవ విద్రోహ దుఃఖభార**
**వివశమై విలపించెడు విశ్వమందు**
**రాక్షసుల దృంచి శాంతిని రక్షచేసి**
**కాళికామాత తన శక్తి కతనకాదె!**



ఘంటసాల ఆలపించిన ఈ మూడు పద్యాలను కూడా అక్కినేని నాగేశ్వరరావు, రాజసులోచనపై చిత్రీకరించారు. ఇందులో సతీసావిత్రిపై గల పద్యాన్ని కళ్యాణి రాగంలోనూ, ద్రౌపదిపై గల పద్యాన్ని ఆరభి రాగంలోనూ, కాళికామాతపై గల పద్యాన్ని కేదారగౌళ రాగంలోనూ స్వరపరచారు ఘంటసాల.

కళ్యాణి రాగానికి సంబంధించి, యమన్ గురించి, యమన్ కలిసిన కళ్యాణి గురించి - సినీ గీతాల పరంగా - సంగీతంలో ప్రవేశం లేకుండా - కేవలం అభిరుచి మాత్రమే కలిగిన శ్రోతలకు కొన్ని కన్‌ఫ్యూజన్స్ ఉంటాయి. శుద్ధమైన కళ్యాణిరాగం ఎలా వుంటుందో తెలుసుకొనగోరే శ్రోతలకు ఈ సతీసావిత్రిపై స్వరపరిచిన పద్యం సదుపమానంగా పనికివస్తుంది.

కొన్ని కొన్ని సంఘటనలు జరిగిపోయాక తరచి చూసుకుని విశ్లేషించుకుంటే ఆ అనుభవం ఇచ్చే తృప్తే వేరు. కాళికాదేవిపై పద్యాలు అనగానే ఎవరికైనా గుర్తొచ్చేది... మహాకవి కాళిదాసు చిత్రంలో ఘంటసాల ఆలపించిన శ్యామలాదండకం. అందులోని 'చతుర్భుజే చంద్రకళావతంసే' అనే శ్లోకం. ఈ శ్లోకాన్ని కేదారగౌళ రాగంలో స్వరపరిచారు పెండ్యాల! ఇక్కడ ఈ చిత్రంలోని కాళికామాతపై గల ఈ పద్యం కూడా కేదారగౌళ రాగంలోనే స్వరపరచబడింది. అందుకు కనిపించే కారణం ఒక్కటే... కేదారగౌళ రాగంలో పై స్థాయి నుంచి పాడే సౌలభ్యం వుంది. అది ఒక రకమైన ఆవేశాన్ని ప్రతిఫలింపచేస్తూ వుంటుంది. కాళికాదేవి అవతారం కూడా ఆవేశానికి ప్రతిరూపమే కదా!

**ఈ శాంతినివాసం చిత్రానికి మూలమైన తమిళ నాటకం 'మల్లియమ్ మంగళమ్'ని సహస్ర నామం బృందంవారు ప్రదర్శించేవారు. అప్పట్లో విజయాసంస్థలో నటిస్తూ నెలకు 125 రూపాయల వేతనంతో పెర్మనెంట్ ఆర్టిస్టుల బృందంలో వల్లం నరసింహారావు, పద్మనాభం ఉండేవారు. మద్రాసు అన్నామలై మండ్రంలో ప్రదర్శించిన ఆ నాటకాన్ని పద్మనాభం వల్లం నరసింహారావు చూసి బాగుందనుకుని ఆ నాటక రచయిత బి.యస్.రామయ్య వద్ద అనుమతి తీసుకుని పాలగుమ్మి పద్మరాజు చేత తెలుగులో 'శాంతి నివాసం' పేరుతో నాటకంగా రాయించి, రేఖ అండ్ మురళి ఆర్ట్స్ బ్యానర్‌పై సుమారు 100కి పైగా ప్రదర్శనలు ఇచ్చారు. ఈ నాటకం కోసం శ్రీశ్రీ, వీటూరి (వేటూరి కాదు), వడ్డాది, పాలగుమ్మి పద్మరాజు పాటలను రాశారు. యస్.పి.కోదండపాణి సంగీతాన్ని ఇచ్చారు. మాధవపెద్ది సత్యం, పి.బి.శ్రీనివాస్, సత్యారావు, ఎస్.జానకి, ఉడత సరోజిని ఆ పాటలను పాడారు. అవి గ్రామ్ ఫోన్ రికార్డులుగా కూడా వచ్చాయి. ఆ పాటల పుస్తకాల్ని 12 నయా పైసలకు అమ్మేవారు. అప్పటికి, ఆ తరువాత సినీ నటీ నటులుగా గుర్తింపు తెచ్చుకున్న పద్మనాభం, వల్లం నరసింహారావు, వడ్లమాని విశ్వనాథం, మోహన్‌దాస్, మహంకాళి వెంకయ్య, మీనాకుమారి, అదోని లక్ష్మి (ఆగమనం టీవీ సీరియల్ ద్వారా పాపులర్ అయిన నటి రూపాదేవి తల్లి), రమాదేవి, డబ్బింగ్ జానకి, పార్వతి ఆ నాటకంలో ధరించిన పాత్రలను తర్వాత సినిమాగా వచ్చిన 'శాంతి నివాసం' లో అక్కినేని నాగేశ్వరరావు, కాంతారావు, నాగయ్య, రేలంగి, రమణారెడ్డి, రాజసులోచన, దేవిక, సూర్యకాంతం, సురభి, బాలసరస్వతి, కృష్ణకుమారి పోషించారు.**

**వల్లం నరసింహారావు కుమార్తె రేఖ, పద్మనాభం కుమారుడు మురళి పేరుతో వెలసిన రేఖా అండ్ మురళి ఆర్ట్ బ్యానర్ పై ఆ నాటకం తొలి ప్రదర్శన మద్రాసు పానగల్ పార్క్‌లోని కృష్ణగాన సభలో జరిగింది. మూలం అయిన తమిళ నాటకం 'మల్లియమ్ మంగళమ్' బృందం నాయకుడు, నటుడు అయిన సహస్రనామం - మా నూరో ప్రదర్శన అంత గొప్పగా ఉంది మీ తొలి ప్రదర్శన - అని పొగిడారట. నాటకాన్ని చూసిన ఆత్రేయ మర్నాడు తన అభిప్రాయాన్ని చెప్పొచ్చులే అని ఇంటికి వెళుతూ సగం దూరం వెళ్లాక మనసొప్పక మళ్లీ వెనక్కితిరిగొచ్చి - తెలుగు నాటక రంగం ఇంకా చచ్చిపోలేదని, తమిళ నాటక రంగానికి ఏ మాత్రం తీసిపోదని నిరూపించారయ్యా - అంటూ ఎంతో ఆవేశంగా కళ్ళనీళ్లు పెట్టుకున్నారట. అంత సత్తా వుండబట్టే అదే స్థాయిలో రూపొందిన 'శాంతి నివాసం' చిత్రం ఆనాడే కాదు ఈనాడు కూడా అందర్నీ అలరించే స్థాయిలో వుంది.** ■

**రచన : కొసరాజు** **నేపథ్యం : జమునారాణి**

ఎంతా టక్కరివాడు - నా రాజు ఏ మూలనో నక్కినాడు
వంటచేను గట్టు మీద - వంటిగ నే పోతుంటే
వెంట వచ్చినట్టులున్నదీ - ఎవరో వెనక నిలచినట్టులున్నదీ
గుబులు గుబులుగా - గుండె ఝల్లుమని
బిక్కుబిక్కుమని చూశాను - ఫక్కున పక్కని నవ్వేను ఎవరూ?..... నా నీడ! ॥ఎంత॥
పొర్లిపారు ఏటిలోన - బుటుకు బుటుకు మునుగుతుంటె
బుగ్గతాకినట్టులున్నదీ - ఎవరో పైట లాగినట్టులున్నదీ
గిలిగింతలు పెట్టినట్లు - వొడలంతా పులకరించె
నీళ్ళంతా వెదికినాను - త్రుళ్ళిత్రుళ్ళి పారిపోయెనూ ఎవరూ?..... చేప! ॥ఎంత॥
అర్థరాత్రి వేళ నేను - ఆదమరచి నిదురపోతే
వద్ద చేరినట్టులున్నదీ - ఎవరో ముద్దులాడినట్టులున్నది
చిక్కినాడూ దొంగయనుకొని, చేయిచాచి పట్టబోతే
కంటి కేమి కానరాక - కరిగి కరిగి పోయెను ఎవరూ?.... కల! ॥ఎంత॥

**రచన : ఆరుద్ర** **నేపథ్యం : పి.సుశీల**

ఏమండోయ్ శ్రీవారు ఒక చిన్నమాట!
ఏ ఊరు వెళతారు? ఏది కానివేళ ॥ఏమండోయ్॥
పసివాని చూచుటకీ తొందరా?
మైమరచి... ముద్దాడి... లాలింతురా? ॥పసివాని॥
శ్రీమతికి బహుమతిగ ఏమిత్తురో
ఇచ్చేందుకేముంది మీ దగ్గరా? ఏమండోయ్... ॥ఏమండోయ్॥
అబ్బాయి పోలిక ఈ తండ్రిదా? అపురూపమైన ఆ తల్లిదా?
అయ్యగారి అందాలు రానిచ్చినా
ఈ బుద్ధి రానీకు భగవంతుడా.... ఏమండోయ్... ॥ఏమండోయ్॥
ప్రియమైన మా ఇల్లు విడనాడిపోతే
తలదాచుకొన మీకు తావైన లేదే ॥ప్రియమైన॥
కపటాలు మానేసి నా మదిలోన ॥కపటాలు॥
కాపురము చేయండి కలకాలము... ఏమండోయ్... ॥ఏమండోయ్॥

**రచన : దాశరథి** **నేపథ్యం : ఘంటసాల, పి.సుశీల**

శాంతి : నన్ను వదిలి నీవు పోలేవులే - అది నిజములే
పూవు లేక తావి నిలువలేదులే - లేదులే
వేణు : తావిలేని పూవు విలువలేనిదే ఇదీ - నిజములే
నేను లేని నీవు లేనేలేవులే - లేవులే
శాంతి : నా మనసే చిక్కుకునే నీ చూపుల వలలో
నా మనసు నా సొగసు నిండెను నీ మదిలో
నా మనసే చిక్కుకునే నీ చూపుల వలలో
నా మనసు నా సొగసు నిండెను నీ మదిలో
చిరకాలపు నా కలలే ఈనాటికి నిజమాయె
దూరదూర తీరాలు చేరువైపోయె...ఓ....
వేణు : తావిలేని పూవు విలువలేనిదే - ఇదీ నిజములే
నేను లేని నీవు లేనే లేవులే లేవులే
సిగ్గు తెరలలో కనులు దించుకొనీ - తలను వంచుకొనీ
బుగ్గమీద పెళ్ళి బొట్టు ముద్దులాడ ॥సిగ్గు తెరలలో॥
రంగులీను నీ మెడలో బంగారపు తాళికట్టి
పొంగిపోవు శుభదినము రానున్నదిలే...ఓ....
శాంతి : నన్ను వదిలి నీవు పోలేవులే - అదీ నిజములే
పూవు లేక తావి నిలువలేదులే - లేదులే
వేణు : తొలినాటి రేయి - తడబాటు పడుతూ
మెలమెల్లగా నీవు రాగా
నీ మేని హొయలు - నీలోని వగలు నాలోన గిలిగింతలిడగా
శాంతి : హృదయాలు కలసి - వుయ్యాల లూగి
ఆకాశమే అందుకొనగా
పైపైకి సాగి మేఘాల దాటి - కనరాని లోకాలు కనగా...
ఇద్దరు : ఆహో... ఓహో... ఊఁ ఊఁ... ఓ.... ఓ.... ఓ.... ఓ....
వేణు : నిన్ను వదిలి నేను పోలేనులే - అదీ నిజములే
శాంతి : నీవు లేని నేను లేనేలేనులే - లేనులే... ....

**రచన : కొసరాజు** **నేపథ్యం : ఘంటసాల, జమునారాణి బృందం**

ఆడ : తప్పు! తప్పూ!
మామా ! మామా ! మామా ! మామా ! మామా ! మామా !
మగ : ఏమె ! ఏమె ! భామా ! - ఏమె ! ఏమె ! భామా !
ఆడ : పట్టుకుంటె కందిపోవు - పండువంటి చిన్నదుంటె
చుట్టు చుట్టు తిరుగుతారు మరియాదా ॥పట్టుకుంటె॥
తాళికట్టకుండ ముట్టుకుంటె తప్పు గాదా ॥మామా - మామా॥
మగ : వాలు వాలు చూపులతో - గాలమేసి లాగి లాగి
ప్రేమలోకి దింపువారు మీరు కాదా?
ఆడ : ఓహెూ ! ॥వాలు వాలు॥
మగ : చెయ్యి వెయ్యబోతే బెదురుతారు వింతగాదా
ఏమె - ఏమె - భామా
ఆడ : నీ వాళ్లు నా వాళ్లు రాకనే -
మనకు నెత్తిమీద అక్షింతలు పడకనే ॥నీ వాళ్లు॥
ఆడ : సిగ్గు దాచి
మగ : ఓహెూ -
ఆడ : సిగ్గుదాచి ఒకరొకరు - సిగను పూలు కట్టుకోని
టింగురంగయంటు వూరు తిరగొచ్చునా? - లోకం
తెలుసుకోక మగవాళ్లు మెలగొచ్చునా? ॥మామా - మామా॥
మగ : కళ్లు కళ్లు కలుసుకోను రాకముందే - అహ
కప్పుకున్న సిగ్గు జారిపోకముందే ॥కళ్లు కళ్లు॥
మాయజేసి
ఆడ : ఓహెూ
మగ : మరులుగొల్పి ఆడ : ఓహెూ
మగ : మాయజేసి మరులుగొల్పి - మాటలోన మాటగల్పి
మధురమైన మా మనసు దోచవచ్చునా?
నీవు మర్మమెరిగి యీ మాట అడగవచ్చునా?
ఏమె - ఏమె - భామా
ఆడ : పడుచుపిల్ల కంటబడితె వెంటబడుదురూ
అబ్బొ ! వలపంతా వొలకబోసి ఆశపెడుదురూ ॥పడుచుపిల్ల॥
పువ్వు మీద మగ : ఓహెూ
ఆడ : పువ్వు పువ్వు మీద వాలు పోతు తేనెటీగె వంటి
మగవాళ్ళ జిత్తులన్నీ తెలుసులేవయా
మా పుట్టిముంచు కథలన్నీ విన్నామయా ॥మామా - మామా॥
మగ : కొత్త కొత్త మోజుల్ని కోరువారు - రోజు
చిత్రంగ వేషాలు మార్చువారు ॥కొత్త కొత్త॥
టక్కరోళ్ళుంటారు - టక్కులు వేస్తుంటారు
నీవు చెప్పుమాట కూడా నిజమేనులే
స్నేహం దూరంగా వున్నపుడె జోరానులే
ఔనె - ఔనె - భామా - - ఔనె ఔనె - భామా
ఆడ : కట్టుబాటు వుండాలి - గౌరవంగ బ్రతకాలి
ఆత్రపడక కొంతకాల మాగుదామయా ॥కట్టుబాటు॥
ఫెళ్ళున పెళ్లయితే ఇద్దరికీ అడ్డులేదయా ॥మాఁవ - మామా॥
మగ : ఔనె - ఔనె - భామా - ఔనె - ఔనె - భామా -

రచన : శ్రీశ్రీ నేపథ్యం : పి.సుశీల

సాకి : ఆగవోయీ - ఆగవోయీ ఆగవోయీ - ఆగవోయీ
త్యాగం ఇదియేనా? హృదయం శిలయేనా? ఏల యీ మోసం?
ఇల్లాలి మనసే - కల్లోలమాయె
ఏలా, యీ మోసం? ఏదీ నీ హృదయం?
నీవు కట్టిన తాళి - నిగనిగ మెరిసేను
కనికరమున గాజులు - కరముల వెలిగెను
ఆనాటి పారాణీ - ఆనవాలు మిగిలేను
ఆ జాలి, ఆ మమత - నీకు లేకపోయెనా? ఏదీ నీ హృదయం?
నిలువనీడ నిచ్చావు - నగలు చీరెలిచ్చావు
అంతూ పొంతూలేని - ఆశలు కలిగించావు
బాధ్యత అంతతో తీరెనని తలచావా?
అంతేనా? చదివిన నీ చదువంతా వ్యర్థమా? ఏదీ నీ హృదయం?
రేయి పవలు కంటికి రెప్పగా, మేను మనసు మాటా ఒక్కటిగా
జీవితమంతా చెంత నిలిచివుండాలి - త్యాగమదే... త్యాగమదే...
మూడుముళ్ళు వేయుటయే త్యాగమని తలచావా...
ఏదీ నీ హృదయం? త్యాగం ఇదియేనా?
హృదయం శిలయేనా? ఏలా యీ మోసం?
కలకంఠి కంట కన్నీరొలికినచో, గరళమైపోవును అమృతమే మరువకుమా!
కన్నులున్న అంధుడవై బాధలుపడనేలా?
కనులు లేని ధీనురాలి గాథలు వినలేవా?
మగువను నీ దానిని చేసుకో - మనసును నీదారికి తీసుకో
మానవ రూపంలో దేవునిగా మారిపో!

రచన : ఆచార్య ఆత్రేయ నేపథ్యం : ఎస్.జానకి

ఓహెూ ఓహెూ...
ఓహెూ ఓహెూ పావురమా - వయ్యారి పావురమా
మావారి అందాలు నీవైన తెలుపుమా
మావారి అందాలు నీవైన తెలుపుమా ॥ఓహెూ॥
మనసు మధురమైనది - మమతలు నిండినది
సొగసు నేనెరుగనిది - చూడాలని వున్నది
అరువుగ నీ కనులు - కరుణతో ఇవ్వగలవా?
అరువుగ నీ కనులు - కరుణతో ఇవ్వగలవా?
కరువు తీర ఒక్కసారి కాంతునమ్మ వారినీ...
ఓహెూ ఓహెూ... ॥ఓహెూ॥
వలపుకన్న తీయని - పలుకులు వారివి
తలచుకున్న చాలును - పులకరించు నా మేను
మగసిరి దొరయని - మరునికి సరియని
మగసిరి దొరయని - మరునికి సరియని
అందరు అందురే - అంత అందమైన వారా...
ఓహెూ ఓహెూ... ॥ఓహెూ॥
అందరి కన్నులు - అయ్యగారిమీదనే
దిష్టి తగల గలదనీ - తెలిపిరమ్మ కొందరు
అన్నది నిజమేనా? అల్లిన కథలేనా?
అన్నది నిజమేనా? అల్లిన కథలేనా?
కన్నులున్న నీవైనా ఉన్నమాట చెప్పుమా...
ఓహెూ ఓహెూ... ॥ఓహెూ॥

రచన : ఆచార్య ఆత్రేయ నేపథ్యం : ఘంటసాల

సాకి : అహెూ ! ఆంధ్రభోజా ! శ్రీకృష్ణదేవరాయా !
విజయనగర సామ్రాజ్య నిర్మాణ తేజోవిరాజా !!
ఈ శిథిలాలలో చిరంజీవివైనావయా !
శిలలపై శిల్పాలు చెక్కినారు
శిలలపై శిల్పాలు చెక్కినారు - మనవాళ్లు
సృష్టికే అందాలు తెచ్చినారు ॥శిలలపై॥
కనుచూపు కరువైన వారికైనా
కనుపించి కనువిందు కలిగించు రీతిగా ॥శిలలపై॥
ఒకవైపు ఉగ్రూతలూపు కవనాలు
ఒకప్రక్క పురికించు యుద్ధభేరీలు
ఒకచెంప శృంగార మొలుకు నాట్యాలు
నవరసాలొలికించు నగరానికొచ్చాము
కనులు లేవని నీవు కలతపడవలదు
నా కనులు నీవిగా చేసుకొని చూడు ॥శిలలపై॥
ఏక శిలరథముపై - లోకేశు ఒడిలోన
ఓరచూపులదేవి ఊరేగి రాగా
రాతి స్తంభాలకే చేతనత్వము కలిగి
సరిగమా పదనిసా స్వరములే పాడగా
కొంగుముడి వేసుకుని క్రొత్త దంపతులు
కొడుకు పుట్టాలనీ కోరుతున్నారనీ ॥శిలలపై॥
రాజులే పోయినా - రాజ్యాలు కూలినా
కాలాలు మారినా - గాడ్పులే వీచినా
మనుజులే దనుజులై మట్టిపాల్జేసినా
చెదరనీ కదలనీ శిల్పాలవలెనే
నీవు నా హృదయాన నిత్యమై సత్యమై
నిలిచి వుందువుచెలీ, నిజము నా జాబిలీ !

## తారాగణం

నాగేశ్వరరావు
రంగారావు
నాగభూషణం
సావిత్రి
జానకి
సూర్యకాంతం
వాసంతి

## గెస్ట్ ఆర్టిస్టులు

గుమ్మడి
రమణారెడ్డి
సూర్యకళ
ప్రభావతి, అల్లురామలింగయ్య,
ప్రసాదరావు, వంగర, మల్లాది, మద్దాలి,
వి.శివరామ్, మహంకాళి వెంకయ్య,
సుబ్బారావ్, స్వామి, చంద్రకుమార్,
నాగాంజనేయులు,
సాంబశివరావ్...

# కథా సంగ్రహం

పల్లెటూళ్లో కమ్మరికొలిమి పెట్టుకొని గుట్టుగా, గౌరవంగా కష్టపడి జీవించే రంగయ్య (గుమ్మడి)కి ఒకే ఒక తమ్ముడు, ఒకే ఒక కూతురు వున్నారు. రంగయ్య ఎంతో కష్టపడి తన ఆరోగ్యమైనా చూసుకోకుండా, కన్నకూతురు బాగైనా ఎంచుకోకుండా తమ్ముడ్ని పట్నంలో బి.ఏ. చదివిస్తున్నాడు. తమ్ముడు వేణు (నాగేశ్వరరావు) కూడా యోగ్యుడు. అన్నయ్య పడుతున్న కష్టానికి ఎంతో నొచ్చుకొని చదువు కూడా మానెయ్యదలచుకున్నాడు. కానీ, రంగయ్య పట్టు వదల్లేదు. వేణు, కనీసం ఖర్చయినా తగ్గుతుందని హాస్టల్లో నుండి మకాం ఆనందరావనే పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇంటికి మార్చాడు.

కొద్ది రోజులకే ఆనందరావు (ఎస్వీ రంగారావు) భార్య కాంతమ్మ (సూర్యకాంతం)కు వేణు మీద మంచి అభిప్రాయం కలగడం, ఆ కొద్ది రోజుల్లోనే ఆనందరావు కూతురు శాంతి(సావిత్రి)కి, వేణు బ్రహ్మచారి అని తెలియడం, వేణుని ప్రేమించడం, వేణు ఆమెను ప్రేమించడం జరిగింది.

అన్నయ్య కీశుభవార్త వినిపించాలని వేణు, వాళ్లందరినీ తీసుకుని పల్లెటూరు బయలుదేరాడు. శుభవార్త విని రంగయ్య చాలా సంతోషించాడు. అతనికి అప్పటికే జబ్బు ఎక్కువైంది. పైగా తమ్ముడి వివాహ ప్రస్తావనతో గబుక్కుని ఇన్ని సంవత్సరాలుగా తను మరిచిపోయిన ఒక ముఖ్య విషయం గుర్తుకొచ్చినట్లు, తన కూతురు జయ (వాసంతి) ముఖంలోకి చూస్తాడు. జయకు క్షమించరాని అన్యాయం చేశాను. దీన్ని ఒక ఇంటిదాన్ని చేయాల్సిన బాధ్యత వుందనే మరిచిపోయాను. 'అమ్మా, జయా! నిన్ను దిక్కు లేనిదాన్ని చేసి వెళ్లిపోతున్నానమ్మా' అని విలపిస్తాడు.

వేణు, అన్నయ్య దుఃఖానికడ్డుపడ్డాడు. జయ పెళ్లి తర్వాతే నా పెండ్లి.... జయ సుఖం తర్వాతే నా సుఖం.. ఇకనుంచి జయ నా బిడ్డ' అంటూ మాట యిచ్చాడు.

వేణు మంచి మనసుతో చేసిన ప్రమాణం విని, రంగయ్య తృప్తిగా కన్ను మూశాడు.

ఆ ఊళ్లోనే శంకరయ్య(రమణారెడ్డి) అనే ఒక వ్యవసాయదారునికి 'పుట్టుగుడ్డి' అయిన రాధ (షావుకారు జానకి) అనే ఆడపిల్లా, త్రాగుబోతూ, పోకిరీ అయిన కుమార్ (నాగభూషణం) అనే కొడుకూ వున్నారు. కుమార్ దుర్మార్గం జయకు తెలియదు. అతన్నే పెళ్లి చేసుకోవాలని నిర్ణయించింది.

జయకూ, కుమార్‌కూ పెళ్లి కావాలంటే, తన గుడ్డి కూతురు రాధను వేణు పెళ్లాడవలసినట్లుగా శంకరయ్య లంకె వేశాడు. అన్న కూతురి ఆనందం కోసం వేణు గుడ్డి పిల్లను పెళ్లాడాడు.

జ్ఞానవంతురాలైన శాంతి వేణు, రాధల పెళ్లికీ, దాంపత్యానికి దోహదం చేసింది. ప్రేమ ఫలించనంతమాత్రాన జీవితం వ్యర్థం చేసుకోగూడదనే బుద్ధిమంతురాలు కాబట్టే 'లా' ప్యాసై, ప్రాక్టీసు చేస్తోంది. దుర్మార్గుడైన కుమార్, జయను కామించాడే గానీ, ప్రేమించలేదు. పెళ్లయ్యాక మోజు తీరిపోయింది. ఇప్పుడు జయంటే అసహ్యం, ఈసడింపు.

పట్నంలో అతని ద్వారా మోసపోయిన ఒకామె(సూర్యకళ) తనను పెళ్లి చేసుకోమని ఒత్తిడి చేయడంతో కుమార్ ఆమెను హత్య చేస్తాడు. అది చూసిన వేణు - జయ కాపురం నిలబెట్టడం కోసం ఆ నేరాన్ని తనపై వేసుకుంటాడు.

ప్రభుత్వం తరపున విచారించి అతనికి శిక్ష వేయించే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా ఆనందరావు వాదించగా వేణు గుణగణాలెరిగిన శాంతి ఒక లాయర్‌గా ఆయనకు ఎదురు నిలిచి న్యాయం కోసం పోరాడుతుంది.

హత్య చేసిన హడావిడిలో కుమార్ - రాధ చెయ్యి తొక్కి పారిపోతాడు. ఆ సాక్ష్యంతో, రాధ సహాయంతో కుమార్‌ని పట్టి కోర్టుకు అప్పజెపుతుంది శాంతి.

ఇంతమంది మంచి మనసులు గల వారి మధ్య తానుండదగనని, తన తప్పు తెలుసుకుని, అందర్నీ క్షమించమని కోరుతూ పశ్చాత్తాపంతో జైలుకెళతాడు కుమార్.

వేణు, రాధలకు ఒక పసిబిడ్డ పుట్టడంతో కథ సుఖాంతమవుతుంది.

## టెక్నీషియన్లు

| | |
|---|---|
| కథ | : కె.ఎన్.గోపాలకృష్ణన్ |
| మాటలు | : ఆచార్య ఆత్రేయ |
| పాటలు | : ఆత్రేయ, శ్రీశ్రీ, ఆరుద్ర, కొసరాజు, దాశరథి |
| సంగీతం | : కె.వి.మహదేవన్ |
| ప్లే-బాక్ | : సుశీల, జానకి, జమునారాణి, ఘంటసాల |
| నృత్య దర్శకుడు | : హీరాలాల్ |
| నృత్యం | : జ్యోతి, నటరాజన్ |
| ఛాయాగ్రహణం | : పి.యల్.రాయ్ |
| శబ్దగ్రహణం | : ఎ.కృష్ణన్ |
| పాటలు | : వి.శివరాం |
| మాటలు | : బి.నర్సింహమూర్తి |
| కళ | : ఎస్.కృష్ణారావ్ |
| మేకప్ | : కె.నాగేశ్వరరావు, పీతాంబరం, ఎస్.ఎస్.ఆర్.మూర్తి |
| దుస్తులు | : పి.రామకృష్ణ |
| స్టిల్స్ | : సత్యం (జైహింద్ స్టూడియోస్) |
| ప్రొడక్షన్ | : ఆర్ముగం, సెందామరై, రాజు |
| అసోసియేట్ డైరెక్టరు | |
| అండ్ ఎడిటర్ | : టి.కృష్ణ |
| స్టూడియో | : విజయ - వాహిని |

## సహాయకులు

| | |
|---|---|
| దర్శకత్వం | : పి.నాగాంజనేయులు, టి.ఎం.స్వామి |
| సంగీతం | : పుగళేంది |
| ఛాయాగ్రహణం | : నంజప్ప, లోకనాథన్ |
| ఎడిటింగ్ | : కె.గోపాలరావు |
| దుస్తులు | : కిట్టు, సూర్యనారాయణ |
| గ్రామఫోను రికార్డులు | : హెచ్.ఎమ్.వి.అండ్ కొలంబియా |
| నిర్మాత | : సి.సుందరం |
| దర్శకత్వం | : ఆదుర్తి సుబ్బారావు |


సి.సుందరం


ఆదుర్తి సుబ్బారావు


కె.వి.మహదేవన్


కొసరాజు


శ్రీశ్రీ


ఆత్రేయ


ఆరుద్ర


దాశరథి


ఘంటసాల


సుశీల


జానకి


జమునారాణి







తెలుగు సినీసాహితీ క్షేత్రంలో
శ్రీ వేటూరి సుందరరామమూర్తి
చేయని వ్యవసాయం లేదు.
తీయని ఫలసాయం లేదు.
తెలుగు సినిమా పాటకు సాహితీ
గౌరవాన్ని తెచ్చినవారు శ్రీ వేటూరి.
ఆయన పాటలీపుత్రుడు.
వేటూరి పొందిన జాతీయ అవార్డు,
నంది అవార్డులు, దేశవిదేశాలలో
సన్మానాలు గురించి ఎందరికో
తెలుసు గానీ ఎన్ని పాటలు రాసారో
ఆయనకే తెలియదు.
1972లో చిత్రసీమలో కాలుమోపిన
నాటినుండి ఈనాటి వరకూ వేటూరి
ఏ యే చిత్రాలకు ఎన్నెన్ని పాటలు రాశారో
వివరాలు సేకరించి, ఆ పాటల సాహిత్యాన్ని
క్రోడీకరించి ఒక గీతకోశం తయారుచేయాలని,
సాహితీమూల్యాలతో అలరారే ఆయన
గీతసాహిత్యాన్ని అయిదు సంపుటాలుగా
ముద్రించి సాహితీ అభిమానుల ముద్దు తీర్చాలని
**'వేటూరి సాహితీ సమితి'** సంకల్పించింది.
ఇదొక సాహితీయజ్ఞం.
శ్రీయుతులు యస్.పి.బాలసుబ్రహ్మణ్యం,
కీరవాణి, మణిశర్మ, కోటి వంటి హేమాహేమీలు
ఈ యజ్ఞంలో పాలు పంచుకుంటున్నారు.
వేటూరి పాటలు 32 వసంతాలుగా విలసిల్లుతున్న
మధురగీతాలు. వందలాది చిత్రాలకు వేలసంఖ్యలో
వేటూరి పాటలు రాశారు. ఇంటింటి పాటలుగా
తెలుగింటనే కాక తమిళ, కేరళ, కర్ణాటక రాష్ట్రాలలో
కూడా ఇంటిపేరుని నిలబెట్టిన ఆ పాటల సేకరణకు
అంకురార్పణ జరుగుతోంది. మీరు చేయవలసినదల్లా
'ఇంకు'రార్పణ మాత్రమే!
ఆయన తొలిపాట నుంచి యిప్పటి పాటవరకు
మీవద్దనున్న పాటల పల్లవి, సినిమా పేరు జాబితా
రాసి పంపితే చాలు. ఒకవేళ ఆ పాట వివరాలు
మా వద్ద లేకపోతే పూర్తి సమాచారానికై మిమ్ములను
కోరడం జరుగుతుంది. అప్పుడు పాట పల్లవి,
చరణాలు పూర్తిగా రాసి గాయనీగాయకులు,
సంగీతదర్శకుడు, నిర్మాణసంస్థ తదితర వివరాలతో
సహా పంపవలసి వుంటుంది. ఆ విధంగా సహకరించిన
వారిని తగు రీతిగా సత్కరించడం జరుగుతుంది.
ఈ సమాచార సేకరణలో 'హాసం' తన వంతు
సహకారం అందజేస్తోంది. మీ వద్దనున్న ప్రాథమిక
సమాచారం (పల్లవి, సినిమా పేరు)
**నవంబరు 30, 2003 (అభిమానుల కోరిక మేరకు
గడువు పొడిగించడమైనది.)** లోగా ఈ క్రింద నున్న
'హాసం' అడ్రసుకు పంపండి - కవరుపై
'వేటూరి గీతకోశం' అని స్పష్టంగా పేర్కొనండి.

## వేటూరి గీతకోశం

కేరాఫ్ 'హాసం', 502, శ్రీ బాలాజీ నిలయం,
13-1-212, మోతీ నగర్, హైదరాబాద్ 500018.

